# సంజీవి

మొసలికంటి సంజీవరావు



సరస్వతి గ్రంథమండలి
రాజమహేంద్రవరము

నిజామురాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రాబాదు నెం, **544/566** వ గృహమందు నామపల్లి గౌరీశంకరవర్మ అండుకో, ఆంధ్ర బుక్కుడిపో వారిని మా ప్రతినిధులుగా ఏర్పఱచినాము. కావున నిజామురాష్ట్ర వాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుఁడు.

# PREFACE



WITH great pleasure, I introduce the novel 'SANJIVI' to the Andhra reading public. It is, in my opinion, a perfect translation of Sir Walter Scott's novel, the Talisman. It describes the prominent incidents graphically and with perfect ease ; it portrays the characters of Saladdin, the Knight of the Leopard and Richard the Lion-heart as picturesquely as its original and its style has got a grace and lucidity about it, so that one is tempted to consider it rather an original work than a translation.

THE help that such translations do to the Andhra Literature is too plain to need any lengthy explanation. 'The Novel' has come to be written in Telugu Literature in close imitation of the English Novel and since Sir Walter Scott is the father of the English Novel, his novels translated into Telugu by an individual who has a fair command of the two languages, will immensely help to enrich the Telugu Literature.

THERE is an opinion current in the average Andhra mind that the works of merit in English–Novels, histories or works of science—do not yield to translation into Telugu, and even if translated by a proficient at the art, the translations will be artificial and dry as dust, missing the soul of the originals. But 'SANJIVI', carefully read through, helps to remove the false notion and reveals that, in efficient hands, a translation is sure to be at least as sweet and interesting as the original itself.

I congratulate my friend Mr. Sanjivarow on the success of his attempt, and I wish he would help to enrieh the Telugu Literature by translating the masterpieces of all the English novelists.

BOARD HIGH SCHOOL,
PARVATIPUR
*7th June 1930.*

A. SOMASEKHARAROW,
B.A., (Hons.) L.T.,
*Headmaster.*

సిరియాదేశ మెడారిమయము. దహనాయమానుఁడగు భాస్కరుఁడు మధ్యాహ్నప్రభావిభాసితుఁడు గాకమున్నా దేశమునందలి ‘మృతసముద్ర’ ప్రాంతమున, నిర్జన మరుభూమియం దొక శూరుఁ డశ్వారూఢుఁడై మందగమనమునఁ బరిభ్రమించుచుండెను. తత్పూర్వమాతఁడు భయంకరములగు సన్నని లోయలనుండి వెలువడి, యనంతమగుసమప్రదేశమునఁ దోఁచెను.

తొల్లి, యీప్రదేశము ప్రశస్తజలసమృద్ధమై, రత్నగర్భమై, వైభవసమన్వితమై, కొంతకాలము కలకలలాడి, తుదకిట్టులధ్వానముగ, నికృష్టముగఁ బరిణమించెను. తదాలోచనలయందు శూరుఁడు నిమగ్నుఁడాయెను. మధ్యాహ్నమాసన్నమగుచున్నను, క్షుత్పిపాసలను దలంపకుండెను. పథశ్రమమును, తద్భయమునుగూడ మఱచిపోయెను.

బహుభంగక్షుభితమగునామృతసముద్రము(Dead sea)యనేకయోజనవిస్తీర్ణమై,వినీలజలపూరితమై,చూడభయావహముగనుండెను.తొల్లియీనికృష్టజలాశయముక్రిందనే ప్రసిద్ధనగరములు సగర్వముగఁ బ్రవర్ధిల్లియుండెను! భయంకరజలద నిర్గతాశనిపాతముననో, లేక, భూగర్భస్థానలఝురు లాకస్మికముగఁ బెల్లుబికి వెలువడుట చేతనోగాని, యీ బహునగర విరాజిత సుక్షేత్రము కొన్ని వేలసంవత్సరములక్రిందట రూపుసెడి, మృతసముద్రగర్భస్థమై, నామమాత్రావశిష్టమాయెను. ఈదుష్టజలరాశియందొక్క మత్స్యమైననుగానరాదు; ఒక్క తెప్పయైనను బొడసూపదు ; తనపాపఫుఁదోయములు భరించుటకుఁ దానే తగుదునననట్టు లనంతమగు మహాసముద్రముం జేరఁబోక, యట్టె నిలిచియుండును. క్షారగంధకమయమగు నాతావునఁ బచ్చనిపచ్చికయు సస్యములును

గానరాకుండెను. పచ్చని మొలక మచ్చునకైన నందెచ్చటను దోఁప కుండెను. సార్థకనామధేయమగు నాజలరాశికి నీడుగ నాభూభాగము గూడ నాతెఱంగున జీవరహితముగ నుండెను. తజ్జలాంతరగంధకాది విషవాయువులతో నిండి సబిడీకృతమగుటచేఁ గావలయు, నందొక విహంగము గూడఁ గానరాకుండెను.

జనశూన్యమగు నానికృష్టసీమయందలి సూర్యాతపము దుస్సహవైభవముతో దీపించుచుండెను. సజీవప్రకృతియంతయు నడంగిన యారంగమున మన తెరువరియొక్కఁడే దిగజారు నిసుకపై నడుగులు లెక్కిడుచు నల్లన నడుచుచుండెను. అశ్వారూఢుఁడగు నాశూరుఁడు సాయుధుఁడై తన యంగరక్షణకొఱకుఁ దనుత్రాణము శిరస్త్రాణము మొదలగువానిని నఖశిఖపర్యంతము దట్టముగ ధరించెను. ఆ కవచభారమత్యధికము. ఆతని తేజితాల్చిన జయనము *గూడ నందుల కీడుగనే యుండెను. అంతటి భారమెడారి ప్రయాణమున కెంతయు ననను కూలముగనుండెను. ఆతని లాంఛనమగు చిఱుతపులి యాతని డాలుపై నవ్యక్తముగఁ గాన్పించుచుండెను. కవచము నాచ్ఛాదించిన వస్త్రము చినిఁగిచినిఁగి యున్నను, ఉపయోగకరముగ నుండెను; అయ్యది లేనియెడల, కవచ ముగ్రాతపమునఁ గ్రాఁగి యాతని నెంతేని బాధించియుండును.

శూరుఁడు 'కణత' నామధేయుఁడు, క్రైస్తవుఁడు, స్కాట్లండు దేశస్థుఁడు. వివిధక్రైస్తవదేశములనుండి యోధులు పెక్కండ్రు యుద్ధసన్నద్ధులై యరుదెంచి, రెండుసంవత్సరము లాప్రాంతమున విడిసియుండిరి. శీతలదేశములందుండు క్రైస్తవసైనికు లచటి వేఁడిమి భరింపఁజాలక, చాలమంది మరణించిరి. కణతునిఁబోలు దృఢగాత్రులు మాత్ర మారోగ్యవంతులై, చెక్కుచెదరకయుండిరి. కాని, అల్పమగు

---

* గుఱ్ఱపుఁగవచము.

నాతని పరివారము తద్దేశరోగములవలనను, పోరాటములవలనను క్రమముగా క్షీణించెను. తుదకాతని పరిచారకుఁడు మాత్రమె మిగిలెను. వాఁడైనను రోగగ్రస్తుఁడై పడియుండుటచేత, శూరుఁడు నిజాశ్వమాత్ర సాహాయ్యుఁడై ప్రయాణ మొనరింపవలసినవాఁ డాయెను. ఐననేమి? యుద్ధదీక్షాపరుఁడగు కణతుఁడు తన దైవమును తన దీర్ఘ కరవాలమును విశ్వసించి, యాభయంకరప్రదేశమున నిర్భయముగ దిరుగాడఁజొచ్చెను.

శూరుని శరీరము లోహనిర్మితమోయన, నమితబలవంతముగ నుండెను. ఐనను మానవుఁడు గదా. మధ్యాహ్నమాయెను; అనతి దూరమున రెండుమూఁడు ఖర్జూరవృక్షములు గోచరించెను; శూరుఁ డానందపరవశుఁడాయెను. ఆతావున నొక బావికూడఁ గాన్పించుటచే, నట సలిలముద్రావి, ఆహారమారగించి విశ్రమింపవలయునని యాతఁడు నిశ్చయించెను. తద్విషయస్ఫురణముచేఁ గావలయు, నాహయము నిజ నాసికాపుటంబులు విస్తరిల్ల, శిరము నిగుడ, శీఘ్రతరముగఁ బాఱఁ దొడంగెను. కాని, విధివశమున శూరుని యభీష్టము సులభముగ సిద్ధింపకపోయెను.

చిత్రకలాంఛనుఁడగు మనశూరుఁ డనిమిషనయనుఁడై యావంకఁ బరికింపఁ, దజ్జలాశయప్రాంతమున నెద్దియో చలించుచుండినట్లుండెను. ఇంకను జూచుచుండ, దీర్ఘశూలహస్తుఁడై, యుష్ణీషవేష్టితశిరస్కుఁడై, నిజమరకతోత్తరీయము వడివడిగాలికి నెగుర నొక పురుషుఁ డశ్వారూఢుఁడై, యాతనివంకకే యమందగమనమునఁ బఱతెంచుచుండెను. ఆరౌతు విపక్షుఁడగు మహమ్మదీయుఁడగుట తథ్యము. మఱియు నెడారియందు మిత్రదర్శనము దుర్ఘటమని యొక సుద్దికలదు. కాని, వైరిజనులగు మహమ్మదీయులను జెక్కాడుటకు దీక్షవహించిన క్రైస్తవశూరుఁడు ఖగరాజువలె నితాంతతీవ్రగమనమునఁ బాఱివచ్చు

తురుష్కవీరుని సరకు సేయఁడాయెను. అట్టి శూరునకు వైరి యాఁగ మనమే యధికతర ప్రీతికరమగును. కణతుఁడు తోడనే వీరపురుషోచితముగఁ దనబల్లెము సారించి, దాపలకేల ఖలీనము దాల్చి, చరణాంకుశమునఁ దన తేజిని హెచ్చరించి, జయసంపాదన సమర్థమగు నాత్మవిశ్వాసము వహించి, క్షణక్షణము దగ్గరయగు శాత్రవునిఁ దాఁకుటకు గంభీరముగ వేచియుండెను.

నేర్పరియగు తురుష్కవీరుఁడు కళ్లెము నతి నిర్లక్ష్యముగఁ దన వామహస్తమునఁబూని, శరీర సంచలనమాత్రముననే తనయశ్వమును శాసింపుచు, వాయువేగమున నేతెంచుచుండెను. వెండియుచ్చులతో రాజిలుచు భుజమున వ్రేలాడు ఖడ్గమృగచర్మనిర్మితమగు తనడాలు సాహాయ్యమునఁ గ్రైస్తవప్రత్యర్థికరాంచిత కఠోర శూలఘాతము బారినుండి తప్పించుట కోయన, నద్దాని నాయెడమచేతితోడనే మహామ్మదీయుఁడు త్రిప్పుచుండెను. మఱియు నాతఁడు తన దక్షిణహస్తమున బల్లెము నడిమినిబట్టి పైకెత్తి గిరగిర నాడింపుచుండెను. ఆవిధమున సమీపించు వైరిని గాంచియు, చిఱుతపులి శూరుఁడు తత్సమాన వేగమునఁ బాఱి యాతని మార్కొనుటకు మాఱుగ నక్కి నిలిచి యుండెను. కారణమేమన, మహమ్మదీయుల నైజమాతఁ డెఱిఁగి యుండెను. ఆకారణమునఁ దనయశ్వమున కనవసరాయాసము గలిగింపనొల్లకను, ఒకవేళఁ దురుష్కుఁడు సాహసియై సూటిగఁ బైనుఱికినను అపాయము వొరయనేరదని విశ్వసించియు, నగమువలె నాతఁడు నిశ్చలముగనుండెను. ఆ రహస్యమెఱింగియే మహమ్మదీయుఁడు పరస్పరదూరము ద్విశూలమాత్రమైనంతనే, యనన్య సాధారణనైపుణ్యమున హయమును గిఱుక్కున నెడమకు మరలించి, క్రైస్తవశూరుని రెండుసారులు రయమునఁ జుట్టెను. చిత్రకశూరుఁడు తనతావు వీడక, వైరికి సులువీయక, అప్రమత్తుఁడై యాతఁ డెటు తిరిగినఁ దాను

నాతని కభిముఖముగఁ దిరుగఁజొచ్చెను. అనంతర మాతురుష్కుఁడు నూరుగజముల దూరము మరలి, వేగవలె మగుడ నాతనిఁ గవయఁ బోయెను. వైరి నాతఁడు తత్క్షణము దాఁకక, రయమ్మున మగుడ వెనుదిరిగి, యాతుణము త్రివ్వన డాయఁబోయెను. స్కాచిశూరుని కట్టి మిథ్యాయుద్ధము దుస్సహముగనుండెను. దానఁ దనకపాయము వాడమవచ్చెను. కాన నాతఁడు కృతనిశ్చయుఁడై తోమరముం దటాలునఁ దీసి, తన బలకౌశలములచ్చుపడ నప్పగతునిపై రయమ్మున విసిరెను. మహమ్మదీయవీరుఁడు తత్క్షణము దనకేడెమెత్తి, రక్షించు కొనఁగడఁగెను. కాని, పాశ్చాత్యశూరనిర్ముక్తప్రబలాయుధోద్వేగ మున నాతఁడు తనశిరమున కంటిన డాలుతోడనే యశ్వమునుండి నేలఁబడెను. ఐన నాతఁడు స్థిరచిత్తుఁడై, క్రైస్తవశూరుఁ డరుదెంచు లోపుననే తన తేజినెఁజేరి, విద్యుద్వేగమున నధిరోహించెను. శూరుఁడు తన తూయుధము గ్రహింపఁజాలెను. ఆతని బలకౌశలములను జవి జూచిన మహమ్మదీయవీరుఁడు వైరి నిక సమీపింపఁ దలంపక, దవ్వ ననే నిలిచి, బల్లెము నేలఁగ్రుచ్చి, వెన్నునఁ వ్రేలాడు వింటి ననుసంధించి, ఆదవ్వుననే రెండుమూడుసారు లాతని చుట్టును దనహయమును బరు వెత్తింపుచు, గుఱితప్పక చిహ్నకలాంఛనునిపై నాఱుబాణములు వద లెను. క్రైస్తవుఁడు దట్టంపుఁ గవచము ధరించియుండనిచో నపా యము సంభవింపవలసినదే. ఐనను దనుత్రాణ మొక్కయెడ నొక్కింత సడలియుండుటచేఁ గాఁబోలు, నేడవబాణఘాతమున నాశూరుఁడు గుభాలున నేలఁగూలెను. కాని, ఎంత విపరీతము! భూపతనుఁడైన క్రైస్తవశూరుని డాసి పరిశీలింపఁ గడఁగిన తురుష్కుఁడు తత్క్షణము వైరి భుజబద్ధుఁడాయెను! ఎదిరి పోరాడుట కవకాశమీయక దవ్వు దవ్వులనుండి తనుఁ గారింపఁజూచు తురుష్క నాకర్షింపఁగోరియే, యాతఁ డటి మాయోపాయ మొనరించెను. అంతయైనను, మహమ్మ

దీయుని చిత్తస్థైర్యమును, లాఘవకౌశలములును అక్కఱకువచ్చెను. ఆతని కరవాలముఱ్ఱ వ్రేలాడు పట్టెనిఁ బాశ్చాత్యశూరుఁడు దృఢముగఁ బట్టియుండెను. పట్టువడిన తురుష్కయోధుఁ డాక్షణము తనకాసియ సడలించి, శాత్రవునాతీయునఁ గనుఱ్ఱబాఱి, మానవసహజబుద్ధివైభవముతో నాయూపరిస్థితులం బరికించు తనతురంగరాజముపై లంఘించి, నిమేషమాత్రమున సురక్షితముగ దూరస్థుఁడాయెను. కాని, పౌరుషవంతుఁడగు మహమ్మదీయుని పాగాయును తూణీరమును వైరియధీనము లాయెను. ఇఁక నాతఁడు తామస ముడిగి, శాంతచిత్తుఁడై, నిజాభిప్రాయసూచకముగఁ జేయి సాచి, అంతదనుక శాత్రవుఁడైన క్రైస్తవుని డాసి, రెండుజాతులవారును సంభాషింప నేర్పడిన సామాన్యభాషయం దిట్టు లనెను—

"ఆర్యా! పరస్పరవైరులగు క్రైస్తవ మహమ్మదీయుల కియ్యది విరామసమయముగదా. మన కీపోరాట మేల?"

"నిక్కమె. కాని ని న్నెట్లు విశ్వసింతును?"

క్రైస్తవశూరుఁ డట్లు ప్రశ్నింప, మహమ్మదీయుఁ డిట్లు బదులాడెను—

"మహమ్మదుమతస్థుఁ డాడితప్పఁడని యెఱుంగుము. ధీరుఁడా! ధైర్యము ద్రోహకళంకితము కాదని నేను విశ్వసింతును. అన్యథా యగునేని, నీవే నా కట్టి విశ్వాసము గలిగింపవలయుసుమా."

స్కాచిశూరుఁ డుదారహృదయుఁడని విశ్వసించి, మహమ్మదీయుఁడు ధారాళముగ నాతని సమీపించెను. అట్టివాని ననుమానించినందులకు శూరుఁడు లజ్జించి, తన ఖడ్గము దాఁకి విస్పష్టముగ నిట్టు లనెను—

"ఆర్యా! ఈ యస్త్రముపై నున్న సిలువతోడు!—విధివశమున మన మెంతకాలము సహచరులమై యుందుమో యంతకాలమును నేను విశ్వాసబద్ధుఁడనై యుందును."

తోడనే తురుష్కుఁ డీపగిది శపథ మొనరించెను—"ప్రవక్తయగు మహమ్మదుతోడు! మహమ్మదువారి దైవమగు నల్లాతోడు!—నీయెడ ద్రోహ మాచరింపను. అల్లదె నీరము—వేళయైనది. మన మటు బోయి విశ్రమింతము, రమ్ము. నేను సలిలము ద్రావవలయునని చూచుచుండ, నీవు నాకంటఁ బడితివి; తోడనే యుద్ధసన్నద్ధుఁడనై సత్వర మరుదెంచితిని."

తొల్లిటి వైరులు క్రోధానుమానవిరహితహృదయులై, తోడనే తజ్జలాశయము జేరఁబోయిరి.

౨

వివిధ క్రైస్తవదేశస్థులు యుద్ధసన్నద్ధులై సిరియాదేశమున కరుదేర వలసిన యవసర మరయఁదగును. క్రైస్తవలోకారాధ్యుఁడగు 'ఏసు క్రీస్తు' సిరియాదేశాంతర్భాగమగు పాలస్థానదేశమున జనించి, విహరించి, యందే, తన దేశస్థులవలననే భయంకరముగ వధ్యుఁడాయెను. పాలస్థాన మాకారణమునఁ గ్రైస్తవులకుఁ బరమపవిత్రవంత మాయెను. కాలవశమున మహమ్మదీయు లాదేశ మాక్రమించి, క్రైస్తవతైర్థికులను బాధింపఁ దొడఁగిరి. క్రైస్తవాన్వయము క్రోధఘూర్ణితమాయెను. ఆకారణమునఁ బెక్కండ్రు క్రైస్తవరాజన్యులును నాయకులును గలసి, ముష్కరుఁడగు తురుష్కుని మద మడంచి తమ పవిత్రస్థలములను స్వాధీనపఱచుకొనవలయునని దృఢముగ సంకల్పించి, యనంతసేనాసమేతులై యరుదెంచిరి. ఇట్టి మతయుద్ధములను 'క్రూసేడు' లందురు. ఇయ్యది మూడవ క్రూసేడు.

క్రైస్తవమహమ్మదీయులు రెండుసంవత్సరములు యుద్ధనిమగ్నులై

చచ్చుచుఁ జంపుచు నుండిరి. ప్రకృత మియ్యది యుద్ధవిరామసమయము. ఈ విషయములు గత ప్రకరణముననే వెల్లడియాయెను.

ఆకస్మికముగాఁ దారసిల్లి పోరాడిన క్రైస్తవ మహమ్మదీయ శూరులు మందగమనమున స్వారి యొనరింపుచు విశ్రమయోగ్యమగు నాజలాశయప్రాంతముఁ జేరఁబోయిరి. సారసేనయోధుఁ డడ్డుపడకుండినచో స్కాచిశూరుఁ డీసరికందుపోయిగ విడిసి యుండునుగదా. వీరు లిర్వురు స్వీయమనోభవాలోచనాధీనులై, పరస్పరప్రాణాపాయసమర్థకలహజనితాయాస మపనయించుకొనుచు వెడలుచుండిరి. అశ్వములకుఁగూడ నట్టియాయాట యనుకూలముగనే యుండెను. వెనుకటి పోరాటము గమనింతుమేని, యవనాశ్వము క్రైస్తవహయముకంటెఁ గడు బడలి యుండవలయును. అటుగాక, పాశ్చాత్యుని తేజియే యింకను స్వేదజలార్ద్రశరీరమై యుండెను. తురుష్కవారువముయొక్క కళ్లెము మాత్రము ఫేనముతో నిండి యుండెను. గాని, మేనంతయుఁ జక్కగ నాటిపోయెను. నేల యిసుకమయమగుటచేతను, తానును రౌతును గూడ భారమగు కవచము మోయుచుండుటచేతను, పాశ్చాత్యహయము సుఖముగా నడవఁజాలకుండెను. తదాశ్వికుఁ డాకారణమున డిగ్గి తనవాహనముతోఁ బాటుఁ దానును గష్టపడుచు, నా కడుమెత్తని యిసుకపై యాన మొనరింపఁ దొడఁగెను.

వీరులిర్వురు గొంతతడవు మౌనము వహించియే పోయిరి. అంత* సారసేనుఁ డిట్టులనెను.—

"ఆర్యా! ఇంతడస్సిన నీయశ్వమునకు విశ్రాంతి యవసరము. కాని, అడుగడుగునకీ యిసుకయందు దిగిపోవు హయమువలన నీకుఁ బ్రయోజనమేమి?"

తనయశ్వము నాతీరున మహమ్మదీయుఁడు నిరసించుట సహింపక,

* సారసేనులు మహమ్మదీయులందొక జాతి. ఈవీరుఁడు సారసేనుఁడు.

శూరుఁడిట్లు బదులాడెను.—

"సారసేనా! నిజము—నీయనుభవము బురస్కరించుకొని యట్లులంటివి. ఈయుత్తమతురంగప్రాశస్త్యము నీకు దురూహ్యము. మనయెదుట నున్న యీవిశాలమరుభూమి యెంతవిశాలముగనున్నదో, యంత విశాలమగు తటాకముపైఁ దనగింఖపైనున్న వెంట్రుక యొక్కటి యైనను దడియకుండ, నన్నీ తేజీ మోసిమోసి, యీదేశముల కరు దెంచినది."

అట్టిమాట లాలించిన తురుష్కుఁడు విస్మయ పరవశుఁడాయెను. పాశ్చాత్త్యుని పలుకులు సత్యదూరముగఁ గాన్పించెను. తదవసరో ద్భూతనిరసనము బ్రకర్శింపనొల్లక భావగర్భితముగ మందహాస మొనరించి, యతఁడు తత్క్షణము నిశ్చలవదనుఁడై యల్లన నిట్లుల నెను.

"బాగు,—మీపలుకు లాలింతుమేని, యొక కథ యల్లెదరు."

"విశ్వాసరహితుఁడా! పవిత్రశూరబిరుదము వహించువాని పలుకులు శంకించుట యగౌరవము. ఎటులంగక నీవటులంటివి; లేదేని, మనసఖ్య మీ ముహూర్తముననే నశించియుండెడిది. నేను పంచశతా శ్వికజనసాహాయ్యుఁడనై బయలువెడలి, విమలస్ఫటికసన్నిభఘనాంబు పథంబున నీపగిది నాపాదమస్తకము కవచముధరించి బహుక్రోశదూర మశ్వారూఢుఁడనై నిక్కముగ నరుదెంచితి. నీవేల విశ్వసింపవు?"

నీరము పాషాణప్రాయముగ ఘనీభవించునని సారసేనుఁడెఱుంగఁడు కాఁబోలు. ఆతఁ డామాటలు విశ్వసింపక యిట్టుల నెను.—

"ఏమందువు? ఈచ్మృతసాగరమున నేమియు మునుంగదు. అట్టి యీనికృష్టజలరాశియైనను, ఈయనంతధారుణీచక్రముంజుట్టు వారాసులైనను ఒక్క హయరింఖాభారము వహింపఁజాలుననుట యసంబద్ధము."

కణతుఁడిట్లు బదులాడెను.—"నీయనుభవమిట్టిది. నేఁ జెప్పునది

గమనింపుము. ఈదేశపు వేఁడిమివలన భూమి క్రాఁగిక్రాఁగి నీరము బోలు ద్రవపదార్థమువలెఁ బరిణమించినది. మా దేశముననో!— అతులశీతలప్రభావముచే నీరము పరుషశిలాసన్నిభ మగును. కాని, ఈప్రసంగ మిఁక వలదు. బాలచంద్ర తేజోవిరాజితంబై మిలమిల మెఱయు నస్మద్దేశాంతరప్రశాంతనీలనిర్మలశీతలకాసారము దలంతు నేని, ఈయెడారిబాధ మఱియు నధికతరమగును. ఏడుసారులు తెగఁ గాలిన కొలిమినుండి వెలువడు నగ్నిధూమముంబోలు వాయువు నీవాతా వరణముగఁ బీల్చవలయునుగదా. ఈవిషయమిఁక విస్మరింపవలయు."

క్రైస్తవశూరుని సంభాషణము దుర్గ్రాహ్యముగ నుండెగాఁబోలు. తురుష్కుఁడు లోలోన వితర్కించి, తన యనుచరుని వదనము సపరి శీలనముగ వీక్షించి, నిజాభిప్రాయానుసారముగ నిట్టు లనెను—

"మీ దేశస్థులు హాస్యరసప్రధానులు! ఎన్నఁడు జరుగని యుదం తములను, అభూతవిషయములను బ్రసంగింపుచు మీలో మీరే గాక, ఇతరులతోఁగూడ నెక్కసక్కెము లాడుదురు. అమానుషకృత్యముల గుఱించి ఫ్రెంచివీరులు కుతూహలముగ ముచ్చటింతురు. అందు నీ వొకఁడవు. అట్టి నీకు నిజ మాడుటకంటె బీరము లాడుటయే సహజ గుణ మగును. ఈ సమయమున నేను నీ వాక్స్వాతంత్ర్యము నిరో ధింపఁగడఁగుట యపరాధమె."

అంతఁ గణతుఁ డిట్టులనెను. "నీ వనునట్లు ఫ్రెంచివీరు లట్టివారలె. సాహసకృత్యములు తా మొనరింపఁ బూనఁజాలక పోయినను, ఒన రింపఁబూని కృతార్థులు కాఁజాలక పోయినను, వానిం గుఱించి వదరుట వారి నైజము కాని నే నా దేశస్థుఁడఁ గాను. ఐనను నీవు గ్రహింపనేరని సంగతులు నీముందుఁ బ్రశంసించుట యవివేకమే. నిర్వక్రమగు యథార్థము బలికి, మిథ్యాప్రగల్భుఁడ నని నీచేఁ బేర్వ డితిని. ఆర్యా! ఈవిషయ మిఁకఁ జాలును."

నా రంతలో నా ఖర్జూరవృక్షప్రాంతము జేరిరి. అచటి చల్లని నీడయందు జలము తళతళ మెఱయుచు నవిరళముగ వెలువడుచుండెను.

అయ్యది క్రైస్తవ మహమ్మదీయ జాతులకు యుద్ధవిరామసమయము గదా. తద్విరామ సమయమువలెనే యీ మనోహరప్రదేశము గూడ నాకర్షణీయముగ, మోదావహముగ నుండెను. ఇయ్యది మఱి యొక తావున నుండెనేని, గమనింపవలసిన యవసర ముండక పోవచ్చును. సామాన్య విషయములు, సామాన్య పదార్థములును గణనీయములు గాఁజాలవు. కాని, దిగంతపర్యంతము వ్యాపించి జీవరహితమై యున్న యెడారియందీ జలాశయనిలయము నిక్కముగ స్వర్గప్రాయముగ నుండెను. పాలస్థానము దుర్గ్రాహ్యముగ్రస్తము గాకపూర్వ ముదారచిత్తుఁ డెవ్వఁడో యొకఁడా జలము నేలయందింకిపోకుండను, గాలిదుమారము లా బావిని ముంచివేయకుండను భద్రపఱుపవలయునని యెంచి, సముచితధనురాకృతిగ నాపై నొక గోడ నెలకొల్పెను. కాలవశమున నా కమానుశిథిలమైనను, అనలసన్నిభమగు సూర్యాతపమును మాత్రము జొరనీయకుండెను. అందు నెట్టులోఁ బ్రవేశించు సూర్యకిరణముల వెలుంగున దోఁచు నాతోయములు మనోనయనముల కానంద మొదవించుచుండెను. ఆ ధనుస్సుక్రింద వెలువడు జలము ముందుగ నొక బలపపుఁ గుండియందుఁ జేరియుండును. ఆ కుండియు జెడిపోయెను. ఆ తావున కనుదేఱు బాటసారు లద్దానిని మఱియుఁ జెఱచియుందురు. కాని ఆ కట్టడ మట్లు పాడువడుట యొక విధముగ బాగుగనే యుండెను. తమవలె మున్నెందఱో యీ దుష్టపథంబున బాధవడి యీ విశ్రమస్థానమున విడిసి తప్పక సుక్షేత్రములు జేరియుందురని గ్రహించి పాంథులు సంతసించుట కనుకూలముగ నుండెను. తచ్చంద్రకాంత శిలావినిర్మిత జలాశయమునుండి యల్లనఁ బాఱు జలపోషణమున నా చుట్టునుండు వృక్షములు వర్థిల్లుటయేగాక

ఆ తావంతయుఁ బచ్చని పచ్చికతో నిండి మొగములువలె నయన పర్వముగ రాజిల్లుచుండెను.

ఆ మనోహరప్రదేశమున యోధు లిర్వురు నిలిచి, తమ తమ యాచారముల చొప్పునఁ దమ యశ్వముల కళ్లెము మొదలగునవి సడలించిరి. దాహముదీఱఁ దాము నిర్మలాంబువులు గ్రోలకమున్నె వారు తమ హయములనె ముందుగ నీరము ద్రావనిచ్చిరి. మచ్చిక యగు జంతువులు తమ యజమానులను వీడి పోఁజాలవు; మఱియు, జక్కని పచ్చికమయమగు నా తావు వీడి యామరుభూమియం దెటుఁ బోవుటయు నసంభవము. వా రా కారణమునఁ దమ వారువములను యథేచ్ఛగఁ బోనిచ్చిరి.

అంతఁ గ్రైస్తవసారసేను లిర్వురు నా పచ్చని బయలునందు సుఖాసీనులై, తమ తమ భోజనపదార్థములు వెలికిఁ దీసిరి. అయ్యవి మితముగ నుండెను. ఆ యల్పాహార మారగింపకమున్నె వారు పరస్పర విలోకనములకు గుఱియైరి. ఆ చూపులు గతసంధిగ్ధకలహసంభవ కుతూహలసంభరితములై యుండెను. ఇరువురు నసాధారణవీరవరులు: అం దెవ్వఁడోడినను దన కెనయగు నుత్తమవీరునిచే నోటువడితినని సంతసింపవలయునేగాని యణుమాత్రమైనఁ గుందవలసిన యవసరము లేదు: ఆకారణమున నా ప్రాచ్యపాశ్చాత్యవీరులు పరస్పరము దమ బలము లరసికొని, పరస్పర గుణగ్రహణ మొనరింపవలయుననియు లోలోన వాంఛించియుండిరి.

వేర్వేరు జాతులవారగు నా శూరులు స్వీయజాతీయలక్షణ లక్షితులై పరస్పరము విరుద్ధముగ నుండిరి. దృఢగాత్రుఁడగు క్రైస్తవుని శిరోజములు లఘుగోరోచనవర్ణవిరాజితములై, యుంగరములు గట్టి దట్టముగ నుండెను. మూతిపై జిక్కని మీస ముండెను; గడ్డము మాత్రము లేదు. వాని విశాలనయనములు పూర్ణముగఁ దెఱచికొని

యుండెను. వదనము, దృశ్యాదృశ్యముగఁ గానఁబడు కంఠమును హిమసన్నిభముగ నుండక, యుష్ణదేశప్రవాసమువలన సహజశ్వేతవర్ణము దొఱంగియుండెను. నాసిక 'గ్రీకు' జనోచితముగఁ జక్కఁగ నలరారుచుండెను. వక్త్రమొకింత వెడదగ నున్నను, సుస్థిరధవళదంతసమన్వితము. చిన్నదియగు మస్తకము కంఠముపై మనోహరముగ నమరియుండెను. పాశ్చాత్యశూరుని ప్రాయము ముప్పదిసంవత్సరములు మీఱియుండదు. నిజశీతలావాసము వీడి, యత్యుష్ణదేశమున నతికష్టములు బడుటచేత నా శూరుఁడు సహజముఖవికాసము గోల్పోయి యధికతరప్రాయునివలెఁ దోఁచుచుండెను. కావున నాతని వయస్సు మూఁడు నాలుగు సంవత్సరములు తక్కువగనే యుండును. మూర్తి సమున్నతము. శరీరము బలాఢ్యము. ఆ దృఢగాత్రము ప్రకృతము సముచితలాఘవముతోఁ గూడియే యున్నను, నిరంతరవ్యాయామక్రీడాభిరతునివోలె నపరార్ధజీవితమున భారతరమైస్వాధీనము తప్పునట్లు తోఁచుచుండెను. అందనుక లోహపుఁ జిక్కమున డాగియుండిన హస్తములు దీర్ఘములై, సుందరములై, సముచితముగ నమరియుండెను. మణిబంధముల బలవైశాల్యము లపూర్వము. భుజములు ప్రశంసనీయముగ నేర్పడి పరిపుష్టముగ నుండెను. అవ్వీరుని భాషాగమనములు సైనికజనోచితకర్కశమయములై, నిర్లక్ష్యధారాళగుణసమంచితములునై యుండెను. ఆజ్ఞాపించి యాడిగము లందుటయేగాని ఆతఁ డన్యజనవిధేయుఁడై యుండువాఁడు కాఁడని కంఠస్వరము తెలుపుచుండెను: తన యభిప్రాయములు బిగ్గరగ నిబ్బరముగ వెల్లడించుటయే ఆతని యభ్యాసమనియు గూడఁ దెల్లమగును.

సారసేనుని రూపురేఖలు కేవలము మఱియొక తెఱఁగున నుండెను. మూర్తి సాధారణోన్నతి మించియే యుండెను, గాని, మానవాతీత

దీర్ఘకాయుఁడగు పాశ్చాత్యునికంటె నధమము మూడంగుళములు కుఱుచగ నుండెను. దీర్ఘములగు పలుచని భుజములు హస్తములు నాతని వదనమున కనువుగ నుండి, గత యుద్ధావసరప్రదర్శితోరుబల కౌశలముల కాకరములగుననిమాత్రము చూచునంతనే తోఁపకుండెను. కాని కొంచెము నిదానించి పరిశీలింతుమేని, యథార్థము వ్యక్తమగును. రక్తమాంసపరిపుష్టమగు కాయము బలవంతమయ్యు, నధికతరభారమువలన శీఘ్రతరముగ నలసి, తద్బలోన్నతులవలని ప్రయోజనము గోల్పోవును. ఈ యమీరుని శరీర మట్లుగాక, దృఢశల్యకండరబంధురమై, శ్రమసమాదులు సహించియుండుటకుఁ దగియుండెను. స్వీయజాతీయలక్షణములతో నలరారు నాతని చిన్నవదనము ప్రాచ్యసూర్యాతపమున నల్లవడియు, జక్కఁగ నేర్పడి, కోమలముగ, మనోహరముగ నుండెను. కడు భద్రముగ సంస్కరింపఁబడిన నల్లని యుంగరముల గడ్డ మచితముగ వ్రేలాడుచుండెను. నాసిక తిన్నగ నిర్దుష్టముగ నుండెను. నిమ్నములగు నయనములు నల్లనై, తీక్ష్ణములై, కాంతివంతములునై యుండెను. దంతములు తద్దేశాంతరహారిదంతసన్నిభసుందరములై యలరారుచుండెను. నెలవంకవలె సన్నముగ వంపుదిరిగి తళతళ దీపించు నాతని ఖడ్గమువలెనే ఆతని శరీర మొప్పియుండెనని చెప్పిన జాలును. క్రైస్తవుని శస్త్ర మట్లుగాక దీర్ఘముగ మహత్తరముగ నేలప్పఁ బడియుండెను. ఫాలము విశాలముగ నుండక, శరీరము కడు పలుచగ, వదన మతివాడిగ నుండుటచేఁ బాశ్చాత్యాభిరుచికి నీరసముగ నున్నను, మంచి నడిప్రాయమువాఁడగు తురుష్కవీరుఁడు కడు మనోహరాకారుఁడని చెప్పఁదగును.

సారసేను ప్రవర్తనము గంభీరముగ, సరసముగ, సగౌరవముగ నుండెను. ఐనను, అతఁడు తన సహజకుపితస్వాంతము వెలువడకుండ నిరోధించుకొనుచుండెననియు, తన గౌరవము భంగపడకుండ మెలంగఁ

గడంగుచుండెననియు నల్లనఁ దెలియుచుండెను.

పాశ్చాత్యుఁడు గూడఁ దన యాధిక్యత బురస్కరించుకొని యహంకారపూరితచిత్తుఁడై యుండెఁ గాఁబోలు. ఐన నయ్యది వేఱు విధమున వ్యక్తమగుచుండెను. ఒకరుల యభిప్రాయము లాతఁ డావంతయు నరయక నిబ్బరముగ నిరంకుశముగ నిర్లక్ష్యముగ మెలంగుచుండెను. వీరు లిద్దఱు నుదారహృదయులు. ఎదుట నుండువారి యంతరము జూచి తదనుగుణముగఁ జరించుట క్రైస్తవు నభ్యాసము. మానియగు సారసేనుఁడు తా నెట్టులు మెలఁగవలయునో యోచించి యట్టు లాచరించును.

వారి యాహార మల్పము: అందుఁ దురుష్కుని భోజన మత్యల్పము. అరేబియాదేశసులగు సారసేనులు సహజముగఁ గఠినజీవులు. కాని వారు సిరియాదేశ మాక్రమించిన యనంతర మతులితభోగముల నోలలాడఁజొచ్చిరి. ఐనను, మన సారసేనవీరుఁ డెడారిజీవనమున కల వాటుపడినవానివలెఁ బిడికెడు ఖర్జూరములను మోటురకపు బార్లీ రొట్టెను మాత్ర మారగించి సమీపమున నున్న నిర్మలసలిలము ద్రావి సంతసించెను. క్రైస్తవుని భోజన మట్టిది కాదు. అదియు మోటుగనే యున్నను, అంతకంటెఁ బుష్టిగ రసవంతముగ నుండెను. మహమ్మదీయునకు వరాహమాంసము దుస్సహము, పాపావహము, విషతుల్యమును గదా. క్రైస్తవుఁ డట్టి మాంసమే తినఁదొడఁగెను. మఱియు నాతని దాహము స్వచ్ఛమగు నీరముతోఁ దీరునది కాదు. అందులకు మధురస మాయత్తమై యుండెను. కేవలము శరీరసంబంధమగు క్షుత్తు నివారించుకొనుట కధిక తాపత్రయము బ్రదర్శించుట యసమంజసమని యమీరు భావించి యుండెను. క్రైస్తవుఁ డన్ననో, అట్టి శంక మెఱుంగక, ఆఁకలితీఱ భుజించి, మనసార ద్రాక్షరసము ద్రావి, సంతుష్టాంతరంగుఁ డాయెను. మతములు వేఱగుటచేతనే,

మనములు దురభిప్రాయమగ్నము లాయెను. క్రైస్తవుఁడు సత్యమత దూరుఁడని తురుష్కుఁడును, తురుష్కుడు నీతిబాహ్యుఁడని క్రైస్తవుఁడును తలంచియుండిరి. ఆకారణమున జనించు నవ్యక్తనిరసనము ఈయూహోరాదులచేఁ బరస్పరము మఱియు నధికమాయెను. కాని, ఇటీవలి పోరాటమున నొకరిబల మొకరు చవిచూచి యుండుటచే, తీవ్రభావములకుఁ దావీయక, ఇరువురు గంభీరముగ నుండిరి. ఐనను, తాను భుజించిన యనంతరము చాలకాలమువఱకును పాశ్చాత్యుని భోజనము ముగియకుండెను. తురుష్కుఁ డిఁక సహింపఁజాలక యిట్టు లనెను—

"ధీరుఁడా! పురుషోచితముగఁ బోరాడు వీరుఁడు శ్వానమువలె, సూకరమువలె మెసవుట పాడియగునా? అదృష్టవశమున స్వర్గము నుండి యూడిపడిన యపూర్వపదార్థమువలె నెంత యాతురముగఁ దినుచుంటివి! విశ్వాసరహితుఁడగు యూధుఁడైనను నినుఁ గాంచి డిల్ల వడును."

ఆతఁ డటు లాడునని యెఱుంగని పాశ్చాత్యుఁడు విస్మయాక్రాంత చిత్తుఁడై, మోమెత్తి యిట్లు బదులాడెను—

"శూరుఁడా! దాస్యభావకళంకితులగు యూధులమాట నాకేమి? క్రైస్తవస్వాతంత్ర్యము పురస్కరించుకొని నేను వర్తించువాఁడను. సారసేనా! మా ప్రవర్తనము సముచితము, సమంజసము నని యెఱుంగుము—పూజ్యురాలగు 'కన్యమేరీ' రక్షించుగాత!"

క్రైస్తవ జగద్రక్షకుఁడగు ఏసుక్రీస్తుయొక్క కన్యాజననియగు 'మేరీ' నామస్మరణము క్రైస్తవులకుఁ బుణ్యప్రదము. కాని, తన్నామోచ్చారణ మొనరింపుచు, నా యమీరుని ఛాందసాభిప్రాయముతో నెక్కసక్కెములాడుటకో యన, నాతఁడు మిగిలిన పానీయము స్వచ్ఛందముగఁ ద్రావెను. తురుష్కుఁ డిట్టు లనెను—

"ఇదియును క్రైస్తవ స్వాతంత్ర్యప్రభావము కాంబోలు! మృగము వలె భుజించి, మృగము సహితము నిరాకరించు ఈ విషద్రవము గూడ నాస్వాదించి, తన్మనస్స్థితికిఁ బాల్పడెదవు!" పాశ్చాత్యుఁ డనుమానింపక రయమ్మున నిట్లు వాక్రుచ్చెను—

"మూర్ఖసారసేనా! ఈమధువు దైవదత్తము. దైవము ప్రసాదించు పదార్థములను దూషించుట పాపమని యెఱుంగుము. కాయకష్టము పడు మనుజుని హృదయమున కుల్లాసము గలిగించి, రోగార్తున కుత్సాహ మొసగించి, విచారగ్రస్తున కూఱటగొల్పు నీ ద్రాక్షరసము వివేకవంతున కెంతయు నక్కఱయగును. అనుభవజ్ఞుఁ డనుదినము గుడుచు నాహారమునకువలెనే, ఈ సుధారసము ద్రావించి నందులకుఁ గూడఁ బరాత్పరునకు వందనము లర్పించును. తప్పుద్రావి మైమఱచువాఁడును, మధురస మెట్టిదో యెఱుంగని నీవును గూడ నొక్క విధమగు బుద్ధిహీనులే."

సారసేనుని తీక్ష్ణనయనములు క్షణము ప్రజ్వరిల్లెను: వాని హస్తము తోడనే బాకున్కుఁ బాఱెను. కాని, అది యొక క్షణికము. పాశ్చాత్యశూరుని యసాధారణబల మొక గడియక్రిందనే తనముక్కున కనుభవవేద్యమై యుండెను. అతని రక్తనాళము లింకను తదాలోచనా కంపితములై యుండెను. సారసేనుఁ డాకారణమునఁ దీవ్రాచరణమున కుద్యమింపక, సులభతరమగు వాగ్వాదమునకే తలపడెను—

"నీ యవివేకపూర్వాగ్రహము గలిగించుటకు నూఱుగ జాలిగొలుపుచున్నది. అంధుఁడా! దుర్గ్రాహ్యాతిరేకమున నీవు వాకొను పాశ్చాత్య స్వాతంత్ర్యము దురాచారబద్ధమై, మానవసౌఖ్యలతాలవిత్రమై, దుస్సహమై యున్నదని యెఱుంగవా? కాంత రోగగ్రస్తయైనను, వంధ్యయైనను, గయ్యాళియైనను, మఱి యేతీరున సహింపరాకున్నను, ఇచ్ఛకువచ్చు మఱియొక వనితను జేపట్టరాదని నీ ధర్మశాస్త్రము

ఘోషించుచునుగదా! క్రైస్తవుఁడా! ఇది దాస్యమని నేను ఖచితముగ నందును! సత్యానురక్తులగు మహమ్మదీయు లట్టి దురభిప్రాయబద్ధులు గారే. పితృసమానుఁడగు 'అబ్రహాము' వలె, వివేకనిధియగు 'సలోమాను' వలె బహు సుందరీవేష్టితులమై సుఖముగ నుండఁదగునని మా ప్రవక్త సెలవిచ్చెను: సురగానానందమా!——మనోహర మరు న్నారీసందోహపరివృతులమై స్వర్గమున హాయిగ నుందుము."

"ఓయీ, సారసేనా! ఆ వియత్తలనివాసియగు పరమాత్మునితోడు—ఇహలోకనివాసియగు నా పరమపావనిచేతను—నీవు నిక్కముగ నంధుఁడవు. మతిభ్రష్టుఁడవు. నీతిబాహ్యుఁడవు. ఓయీ! నీవు ధరించు ఆ వజ్రపుటుంగరము మహామూల్యమని విశ్వసింతువుగదా?"

"ఇట్టి యమూల్యరత్నము ప్రసిద్ధనగరరాజములగు 'బాలసోరు' 'బాగ్దాదు' లందుఁ గూడ నింకొకటి కానరాదు. కాని, ఇప్పుడీ ప్రశంస యేల?"

"ఏలనో గ్రహింతువుగాక. నీ యుంగరము దీసి, నా కుఠారముతో నిరువది తునక లగునట్లు పగులఁగొట్టెదము:——అందు నొక్కొక తునక తొంటి విలువ గలిగియుండునా? లేక, అన్నియుఁ గలసియు నొక్క దశాంశమైన నక్కఱసేయునా?"

"బాలకునివలెఁ బ్రశ్నించితివి. వజ్రము తునియలగునేని, సహస్రాంశమైనను వెల లేకపోవును."

"సారసేనా! గమనింపుము. గుణబంధురయు సుందరియు నగు భార్యయెడ క్రైస్తవవీరుఁడు ప్రేమానుబద్ధుఁడై యుండును;——ఆ ప్రేమ పూర్ణవజ్రతుల్యము. అర్థవివాహితలై, స్వాతంత్ర్యవిరహితలై పోరలాడు నీ భార్యలపై నీవు పాఱవేయు నభిమానము తళతళ మెఱయు నిర్భిన్నవజ్రశకలములవలె నిరర్థకము."

అంత నమీరుఁ డిట్లు బదులాడెను——

"పూజ్యమగు 'కాబా' తోడు!—నిన్ను బంధించు ఇనుపగొలుసు సువర్ణశృంఖలమని భ్రమించి తదాలింగన మొనరించు నున్మాదుఁడవు!—లెస్సగఁ బరిశీలింపుము! ఈ యంగుళీయ నిబద్ధ ప్రధానరత్న మల్పతరరత్నపరివృత మగుటచేతనే ఈ యుంగరము ద్విగుణీకృత వైభవముతో నలరారును. ఈ కేంద్రరత్నము పురుషుఁడు: ఆ చుట్టు నుండు చిన్నరాలు కాంతలు. పురుషునివలె నియ్యవి నిశ్చలము, పరిపూర్ణము, సహజముగ మూల్యవంతము. పురుషరత్న కరుణా వినోదలబ్ధకాంతిప్రభావమున నీ యల్పస్త్రీరత్నములు తదుచితముగ రాజిల్లు. ముద్రికనుండి ఈ మధ్యమణి విడదీసి చూడుము,—తొంటి వైభవ మావంతయు గోల్పోక, యథావిధంబున దీపించును: ఈ చిన్న మణులన్ననో!—నీరసతరంబు లగును. ఇయ్యదే నీ యుపమానమునఁ దెల్లమగును. మా కవిరాజు 'మసీహ్' ఏమనునో వింటివా?—'భానుమంతుని మొగంబు గడంగునంతనే, విరాజమాన నక్షత్రంబులు కాంతిహీనములగు: అట్టులే, పురుషుని కరుణాకటాక్షమాత్రముననే కాంతకు శోభాసౌందర్యము లలవడును'."

"సాంసేనా! శూరజనాభిమానయోగ్యయగు లతాంగిని నీ వెన్నఁడు గాంచినట్లు కానరాదు. శూరులము విశ్వాససేవాబద్ధులమై యుండు మా పాశ్చాత్య నారీనివహముల నెఱుంగుదేని, నికృష్టవిషయ లాలసులై నీ యంతిఃపురమున దాస్యమునఁ బొరలాడు నీ వనితలను నిక్కముగ నేవగింతువు. మా పడఁతుల సౌందర్యస్ఫురణమున మా శూలాగ్రములు నిశితతరము లగును; మా ఖడ్గధార తీక్ష్ణతరమగును. వెలిఁగింపని దీప మెంత కాంతివంతముగ నుండునో, స్వీయహృదయాపహరణ మొనరింపఁజాలు ముగ్ధకలికి నెఱుంగని శూరుఁడును నిజభుజవిక్రమప్రభావమున నంతటి యశోవంతుఁడే యగును."

"పాశ్చాత్యయోధు లిట్టి విపరీతాభిప్రాయపూరితహృదయులని

వినియుందును. ఇయ్యది, శూన్యసమాధి సంపాదనార్థ మింతదవ్వు గొని తెచ్చిన యున్మాదకలశుణములలో నొక్కటి కావలయునని భావించితిని. ఐనను, పాశ్చాత్యవీరులు తమ కాంతల సౌందర్యము గొండంతగఁ గొనియాడుదురు: ధీరులగు యోధుల నావిధమునఁ దమ పాదాక్రాంతుల నొనరింపఁజాలు మేల్బంతుల లావణ్య మొక్కసారి నాకండ్లతోఁ గాంచఁ గోరెదను.”

అంతఁ గ్రైస్తవరూపుఁ డిట్లు బదులాడెను—

“ధీరసారసేనా! పవిత్రవంతమగు సమాధికి నే నిప్పుడు యాత్ర బోవుచుంటిని; ఆంగ్లేయనృపాలుఁ డగు ‘రిచర్డ్స’ శిబిరమునకు నిన్నిక్షణము సగర్వముగ, సురక్షితముగఁ గొనిపోయియుందును. ఉదాత్తవైరుల తా రాజపుంగవుఁడు సముచితముగ, సమధికముగ స్వాగత మొసంగును. నే నిప్పుడే కాక్రైస్తవ పేరవడియున్నను, నిన్నటకు సగౌరవముగఁ గొనిపోఁజాలుదును. భవదీయ కాంతాజనవజ్రఖనినికర వైభవము నీసడింపుచు సహస్రాధికముగ దీపించు సపూర్వాంగ్లపరాసు వనితారత్నముల నందుఁ గాంచఁగలవు.”

తురుష్కుఁ డుత్సాహపరుఁడై యిట్లు లనెను—

“ఆర్యా! నీ యాహ్వానము మోదావహము. నీ సమాధియాత్ర ప్రకృతి ముగించి రాఁజాలుదేని, నేను సంసిద్ధుఁడను. మఱియు, నీ విప్పుడు వెనుదిరిగి నీ నిలయము జేరుటయే క్షేమకరము. వైరిజన సంకీర్ణమగు నీ ప్రదేశమునం దాజ్ఞాపత్రము లేకుండ సంచరించుట కడు నపాయకరము.”

శూరుఁడు తోడనే యొక పత్రము బ్రదర్శించి యిట్లు లనెను—

“మాదు మియ్యదె—తురుష్కసార్వభౌముఁడగు ‘సలాఉద్దీను’ ఒసఁగిన యాజ్ఞాపత్రము!”

ఈజట్టు సిరియా దేశములను బాలించు సలాదీను ముద్రిక యందుఁ

గాన్పించినంతనే సారసేనుఁడు సముచితావనతవదనుఁడై, యత్యంత గౌరవముతో నద్దానిని జుంబించి, ఫాలమున కద్దుకొని, ఇట్లు లనెను—

"మూర్ఖుఁడా! ఎంతపని యొనరించితివి? నీ ధూర్తప్రవర్తనమున నీకును నాకును గూడ ద్రోహ మొనరించినవాఁడ వైతివి. మనము తారసిలినంతనే, ఈ పత్ర మేల చూపకుంటివి?"

"నీవు శూలము సారించి నన్ను మార్కొనఁ గడంగుటచేత. సారసేనులు పెక్కండ్రు గుమికూడి నన్నుఁ దాఁకఁ జూచురేని, అపుడీ పత్రము ప్రదర్శింపనగును గాని, ఒక్కఁ డడుదెంచినంతమాత్రమున నటు లాచరించుట గౌరవహీనము గదా."

"ఐనను, నిన్నీమార్గమున నిరోధించుట కొక్కఁడు చాలఁడా?" అని సారసేనుఁడు సగర్వముగఁ బ్రశ్నింపఁ, గ్రైస్తవయువకుఁ డిట్టు లనెను—

"ధీరసారసేనా! నిక్కము. కాని, నీవంటివార లరుదుగదా. మఱియు నిట్టి రాజవిహంగములు పిండుగట్టి సంచరింపవు; సంచరించినను, ప్రోవుగా నన్ను దాఁకునని కావు."

క్రైస్తవుని వెనుకటి నిగూఢతిరస్కారమునఁ జురుక్కుమనిన తురుష్కుని చిత్త మిట్టి యభినందనపుఁ బలుకులచే సంతసించెను—

"ఆర్యా! లెస్సగఁ బల్కితివి. మాకారణమున నీ కెట్టి యపచార మైనను బొరయనేరదు. కాని, నిన్నునేఁ బొలియింపకుండుట మేలాయె. తురుష్క సార్వభౌము నాజ్ఞాపత్రము ధరించువాఁ డవధ్యుఁడు. ఎవ్వఁడేని యన్యథా చరించునేని పాశముననో ఖడ్గముననో తప్పక తెగటారును."

"ఈ పత్ర మింత ప్రయోజనకారియని వినుట యెంతయుఁ బ్రీతికరము. సమయ మగునేని వేఱు విచార మరయక దోఁపిడిసేయు తెరువాటుజాతుల కీప్రాంత మాకరముగదా."

"నిక్కము. వినుము, మా ప్రవక్తపాగాత్రోడు-నీకీ మార్గమధ్యమున నెట్టి యపాయమైనను సంభవమగునేని పంచసహస్రాశ్వ సాహాయ్యుఁడనై వారివెంబడి ప్రతిక్రియ యొనరింతును. పురుషుల నందఱను తక్షణము వధించి వారి స్త్రీలను గడు దూరదేశమున బానిస లొనరింప నియోగించి ఆ జాతిపేరైన లేకుండ చేతును. మఱియు నీ భాగమున లవణము పాతఱ వేయించి, ఈ వర్తమానముననేగాక, భావియందుఁగూడ నొక్క యీగయు నిందు నిలుచుట కవకాశము లేకుండ యొనరింతును!"

"ఉదారమనస్కుఁడా! నాకంటె నెక్కుడు వానిపట్ల నిట్లు వర్తించుట పాడి యగునని తలంతును. కాని మే మెక్కుడు లెటులున్నను నేను పోవలయును: నా మొక్కుబడి తీర్పవలయు. ఈరేయి విడిసియుండ జాలు విశ్రమస్థానము జూపుదేని, మిక్కిలి సంతసింతును.

"మదీయాలయకు నాగారముననే విశ్రమింతువుగాక." తురుష్కుఁడట్లు లాహ్వానింప సారసేనుఁ డిట్లు లనెను——

"ఈరాత్రి పూజ్యుఁడగు 'ఎంగాడీ' స్వామిని దర్శించి యటఁ బ్రార్థన సలుపవలయు."

అంత సారసేనుఁ డిట్లు పలికెను——"అంతవఱకునైన సురక్షితముగ నిన్నుఁ గొనిపోదును."

"సారసేనా! నీ సాహచర్య మానందప్రదమే కాని పరమపావనుఁడగు నెంగాడీస్వామికి కపాయము సంభవించునేమోయని వెఱచువాఁడను. ఆహా! జగదీశ్వరసేవాపరాయణులగు మా క్రైస్తవ సాధుజనులను మీ దేశస్థులు క్రూరముగ వధించుటచేతనేగదా క్రైస్తవదేశ దేశాంతరశూరులము పలువురము గూడి శస్త్రహస్తులమై దృఢసంకల్పధురీణులమై యరుదెంచితిమి. మా పరమపావనక్షేత్రమగు 'యెరుసలేము' మా యధీన మొనరించుకొని మా దేశయాత్రాపరులు

నడుచు మార్గములు నిష్కంటక మొనరించి ఈ పుణ్యభూముల నివ సించు మా సాధువులకును యోగులకును ఏ యుపద్రవము జెందకుండ చూడవలయుఁగదా."

"క్రైస్తవుఁడా! గ్రీకులును సిరియనులును మా పరోక్షమునఁ గల్లు లల్లి దుష్ప్రవాదములు చాటుచున్నారు. పూజ్యుఁడగు మహమ్మదు తరువాత తదాధిపత్యము వహించిన 'అబూబకారు' చేసిన హితము చొప్పున మెలఁగవలెను. మహమ్మదీయ చమూపతులలోఁ బ్రధముఁ డగు నా మహనీయుఁడు సిరియాదేశము నాక్రమింపఁ సంకల్పించి ఒక సేనానాయకుని జేరి యిట్లు లుపదేశించెను. 'న్యాయమునఁ బుణ్యోచిత ముగఁ జరింపుఁడు. వృద్ధులను, దుర్బలులను, స్త్రీలను, శిశువులను జంప రాదు. ధాన్యము, ఫలవృక్షములును దైవప్రసాదములు-వానిని జెఱుప వలదు. ఒక యొడఁబడిక యొనరింపరేని అయ్యది ఒకవేళ మీకే దుస్సహముగఁ బరిణమించినను, మీరు సహింపవలయు; తదుల్లం ఘన మొనరింపఁదగదు. పుణ్యాత్ములు మా భూములందు వసతులు గల్పించుకొని దైవచింతానిమగ్నులై కాయక్లేశములఁ జెందియుందురు. అట్టివారిని హింసింపరాదు; వారి నివేశములు ఒకడగొట్టరాదు. కాని వారు శిరోజశూన్యులై—బోడులై యుందురేని క్షంతవ్యులు గారు. ఆ కుజనులు దుష్టసైతాను సంతతి వారిని గ్రహించి నిష్కరుణము తెగ నఱుకుఁడు.

వారొకవేళ మన సత్యమత మవలంబించినను మనకు లోఁబడి యుండుట కొప్పఁబడినను సజీవులై యుండవలయు. అట్లే మేము తదాజ్ఞానువర్తులమై యుంటిమి. మా ధర్మము వట్టిదగాక సైతా నాంశసంభవులగు యోగులను (మాంకులను) మాత్రము జెక్కాడి తిమి. ఒక జాతిపై నింకొక జాతినిఁ బురిగొల్పక కేవలము పరు సేవా యత్తచిత్తులై మను సత్పురుషులను బాధింపకుండుటయేగాక వారి

కేయసాయము ప్రాపింపకుండ రక్షింతును. నీవు పేర్కొను యెంగాడీ' యోగి మా పవిత్ర సత్యమతస్థుఁడు గాకున్నను యోగ్యుఁ డగుటచే నా ప్రేమాభిమానగౌరవములకుఁ బాత్రుఁడు."

"నేఁ జూడఁబోవు సన్యాసి మతాచార్యుఁడు కాఁడు. ఆతఁ డొక వేళ మీరు సహింపనేరని బోధియే యగుఁగాక — మ్లేచ్ఛుల నొకచీరికిఁగొనక శూలాయుధుఁడనై యాతని రక్షింతును."

అట్లు లాగ్రహపరవశుఁడగు శూరుని వారించి, సారసేనుఁ డిట్లు లనెను—"సోదరా! పరస్పరదూషణ మొనరింపకుందుముగాక. మనము సాయుధులమై పోరాడఁ గోరుదుమేని మహమ్మదీయులు నీకును క్రైస్తవులు నాకును దొరకకపోరు. మిత్రమా! ఈ యెంగాడీ స్వామిని అరబ్బులు తురుష్కులును గూడ నాదరించి రక్షింతురు. ఆతఁ డొకప్పుడు విపరీతచిత్తుఁడై వింతగఁ జరించినను, నిజ మత బద్ధుఁడై దోషరహితముగ మెలఁగును. అతఁ డాకారణమునఁ గ్రీస్తు వలెనే నవతరించిన మా ప్రవక్తకుఁగూడ నభిమానపాత్రుఁడే యగుగాని—"

క్రైస్తవుఁడు రోషకషాయతాత్ముఁడై యిట్లు గర్జించెను—

"సారసేనా! విరమింపుము! ఒంటెలు దోలుకొని జీవనమొనరించిన నీ మహమ్మదుతోడ జగద్రక్షకుఁడగు కన్యమేరీపుత్రుని సామాన్యముగ వాకొన సాహసింతువేని—"

అమీరుకూడ సహజముగ విద్యుద్వేగ కంపితగాత్రుఁ డాయెను. ఐనను ఒక క్షణమాత్రకాలమునఁ దెలివొంది నిజహృదయగౌరవ మచ్చుపడ సమంజసముగ నిట్లు బదులాడెను—

"నీ వెఱుఁగని వానిని దూషింపరాదు. మతాచార్యులు తమ మనోగతులచొప్పున సృష్టించు సిద్ధాంతములను నిరసింపవచ్చునుగాని మతస్థాపకుఁడుమాత్రము సర్వజనపూజ్యుఁడు. ఆర్యా! నా తోడు లేక

నీవు ఎంగాడీనిలయము చేయుట కష్టతరము; కావున పోదము రమ్ము. మతవివాదములు మన 'ముల్లాల'కు 'పూజారు'లకును జెల్లును. మన మా వితర్కము వీడి యౌవనయోగ్యజనోచితములగు యుద్ధములు, సునిశితకరవాలములు, సుందరవనితామణులు మొదలగు సరసప్రసంగములు సల్పుచుఁ బ్రయాణ మొనరింతము లెమ్ము!"

## 3

క్రైస్తవమహమ్మదీయవీరులు కొంత కాల మచట విశ్రమించి, మగుడ బ్రయాణ మొనరించుటకై తమ హయముల నాయత్తపఱచుకొనఁ జొచ్చిరి. సరళహృదయులై యొకరి కొకరు నాటి సాహాయ్య మొనరించుకొనిరి. ఇట్టి కృత్యము వారికిఁ బరిచితమైనదిగ నుండెను. ఆ కాలము ననుసరించి శూరు లట్టివను లెఱింగియుండవలయును. అశ్వము ప్రయాణములందును సమరములందును బొంత వీడరాని నెయ్యము. వీరు లిర్వురు స్వీయహయాభిమానబద్ధులై యున్నవారని గూడఁ గాన్పించును. తన వాహనముతోడి చనవు సారసేనుల కాంభోజ్యప్రవర్తితము: తూర్పుదేశములందలి సైనికజాతులు గుఱ్ఱముల నిరుపమించుచుగా దమ భార్యాపుత్రులతో సమానముగాఁ బరిగణింతురు. పాశ్చాత్య యోధుఁ డన్ననో, నాఁటి పరిస్థితుల ననుసరించి తన వాహనమును సాయుధుఁడగు నొక యనుచరునివోలెఁ జూచుచుండెను. ఆ తురగములా కారణమున మగుడఁ గష్టతరప్రయాణ మొనరించుటకే తమ యజమానులు ముస్తాబు చేయుచుండిరని యెఱింగినను సుఖాహార విహారాస్పదమగు నా తావు వీడుట దుస్సహమైనను లెక్కసేయక, సంతోషపూర్వకముగ సకిలింపఁదొడంగెను. ఒకరి గుఱ్ఱపుఁ బోడుగు ఇంకొకరికి

వింతగ నుండుటచేతఁ దదవసరోచిత విస్ఫారనయనులై వారు తిల కించుచుఁ బరస్పరసాహాయ్యమువలన శీఘ్రతరముగఁ గృతకృత్యులైరి.

వారు లిట్లుగ సత్కారార్హు లగుటకు మున్నె క్రైస్తవుఁడొకింత మధురస మాని, ఆ సజీవజలాగారమునఁ జేతులు ముంచి, తన యను చరు నుద్దేశించి యిట్లు లనెను—

“నేటి దుర్భర దాహబాధ యపూర్వము: ఈ శీతలామల మనోహరజలముకూడ నపూర్వము. ఇట్టి మనోహరజలాశయము నేమందునో మఱుంగుదునేని కృతఘ్నుఁడనై నిరంతరము సంస్మరింతును.”

అంత సారసేనుఁ డిట్లు బదులాడెను—

“ఆర్యా! ‘ఎడారివజ్రము’ని దీని నరబ్బీభాషయందుఁ బిలుతురు.”

“ఆహా! ఈ నామము సముచితము. మా సీమయందు వేయి జలాశయము లుండు—ఐనను అందొక్కటియు నింత స్మరణీయము కాదు. స్వీయసలిలప్రదానముగఁ బాంధులఁ దనియించు నీయెడారివజ్రము ప్రీతికరమై అత్యావశ్యకమునై యున్నది.”

“నిజ మాడితివి. అల్లదె మృతసాగర (Dead Sea) మింకను శాపగ్రస్తమై నరజంతువుల కెవ్వరికు నిరుపయోగమై దుస్సహమై యుండుఁగదా. ఈ మృతసాగరమేగాక ఇందుఁ జొచ్చు నదీతోయములు నట్టులే వర్జనీయములు.”

వీరలు గుఱ్ఱము లారోహించి ఆ వంధ్యసైకతసీమయందుఁ బోఁ దొడఁగిరి. దుస్సహమగు మధ్యాహ్న సూర్యాతప మంతరించెను. మందమారుత మిట్లు స రేఁగి ఉల్లాసము గొల్పుచుండెను. తన్మందానిలముతోఁ బాటు మెత్తని యిసుకరేణువులుకూడఁ గలిసియుండుటచే క్రైస్తవవీరునకు దుస్సహముగ నుండెను. సారసేనుఁ డేమియు జీకాకు పడలేదు. పాశ్చాత్యుఁడు సహింపనేరక శిరస్త్రాణము దీసి తన తేజి జీనుకుఁ దగిలించి, స్వారిచేయుట కనువగు టోపీ దాల్చెను. స్థలజ్ఞుఁ

దగు సారసేనుఁడు త్రోవ సూపుచుఁ దన యనుచరునితోఁ బాటు కొంతద వ్వరిగెను. ఆ యనంత నిరాధారవాలుకయందు మార్గ మరయుట సులభసాధ్యము కాదు. దూరమున గోచరించు శిలాఖండములను సూక్ష్మముగఁ బరిశీలించుచు దురుష్కుఁడు యాన మొనరించుచుండెను. ఆ కార్యమున నిమగ్నుఁడైన యాతఁడు కష్టతర జలమార్గమున నౌక నడపు నావికునివలెఁ దోఁచెను. ఒక మైలుదూర మత్యుతదేకధ్యానమున వెడలినపిమ్మట నదియే మార్గమని గ్రహించి సంతసించి ఆతఁడు తొంటికంటె ధారాళముగ సంభాషించెను—

"ఆర్యా! సజీవపదార్థమువలె నన్నను, జీవరహితమునగు నా జలాశయమును బ్రశంసించి పేరడిగితివి. నేను నీ నామధేయము తెలుపవేడెదను. కేవల మదృష్టవశమున నిను గాంచి నీతోఁ జేరి నీ సహచరుఁడనైతి. ఈపాలస్థాన మరుక్షేత్రమునఁగూడ నీ నామధేయము విదితమై యుండవలయు."

"నిజనామ మెఱిఁగించుటకిది యదనుగాదు. కాని, మీ దేశముపై దండెత్తివచ్చిన మా సైనికులు నన్ను 'కణాకు'డని పిలుతురు. నేను 'చిత్రక'*లాంఛనుఁడను. నాదేశమున నా కీబిరుదములు గలవు. నీ ప్రాచ్యశ్రవణమున కయ్యది కఠోరముగ నుండును. ధీరసారసేనా! నీ యభిధాన మెద్దియో అరయఁదగునా? అరబ్బీజాతులలో నీ వెందు ప్రభవించితివి?"

"మిత్రమా! నీపేరు నిక్కముగ సులభము. నే నరబ్బీదేశస్థుఁడను గాను, కాని, యంత ముష్కరులును అంతటి యుద్ధప్రియులును నగు 'కుర్దు' జాతివాఁడను. మా దేశము కుర్దిస్థానము. నా యభిధేయము 'షేరుకాపు.' ఈపదము పర్వతసింహార్థగర్భితము. చిత్రకలాంఛనా! మా దేశవంశములలో నెల్ల మాయదె శ్రేష్ఠతనము."

* 'చిత్రకము—చిఱుతపులి'

"యశోవంతుఁ డగు నలాఉద్దీను గూడ నీవంశజుఁ డనియే విని యుందును!"

కణతుఁ డిట్లు సాశ్చర్యముగఁ బలుక, సారసేనుఁ డిట్లు లనెను—మహమ్మదువారి కరుణాతిశయమున నట్టి మహాపురుషుఁడు మా కొండలయం దవతరించెను. వచోమాత్రమున విజయసంపాదనసమర్థుఁడై విశాల సిరియా యీజిప్టు దేశపరిపాలనాధురంధరుఁడై దీపించు నారాజపుంగవుని మ్రోల నేను కేవలము కీటకప్రాయుఁడను. వీరుఁడా! యుద్ధాగారము నీతోడ నరుదెంచినవా రెందరు?"

"రణకుశలురను పదిమందినిమాత్రమె ఆయత్తపఱుపఁజాలితిని. విలుకాండ్రును శూలాయుధులునుగలసి పంబదిమంది యుండవచ్చును. నా దురదృష్టముకొలది కొందఱు నను( గనుబ్రామి మాయమైరి. యుద్ధమున గొందఱు సమసిరి. రోగముల కాహుతియై మఱికొందఱు మడసిరి. ప్రకృతము విశ్వసనీయుఁడగు నా యనుఁగుబరిచారకుఁ డొక్కఁడు వ్యాధిగ్రస్తుఁడై నా తోడ రాఁజాలక ఇంటనుండి పోయెను."

అంత నామేసు ఇట్లు లనెను—

"క్రైస్తవా! ఈ తూణీరమునందు విహంగరాజపతత్రయోజితము* లగు బాణము లైదు గలవు. ఇందొక యమ్మును దీసి నా గుడారమున కంపుదునేని, సహస్రయోధు లశ్వారూఢులై ఆయిత్త మగుదురు. ఇంకొక శరమున కింకొక వేయిమంది సంసిద్ధులగువారు. ఈ తెఱఁగున నైదువేల రౌతులు నిరంతరము మదధీనమున నుండుటయేగాక, ఈ చాపము గాంచునంతనే దశసహస్రసంఖ్యాయుతాశ్వికదళము తత్క్షణము ప్రత్యక్షమగును. ఐనను, నేఁ గడు నల్పునిగఁ దోఁచు నీమహాదేశముపై దండెత్తుటకు నర్థశతసైన్యసమేతుఁడవై యరుదెంచితివా!"

* పతత్రము = ఱెక్క.

చిఱుతపులి శూరుఁడగు కణతుఁడు సహజముగ లోలోనఁ గనలి, నిందాగర్భితముగ నిట్లు లనెను—

"లోహపరిరక్షితమగు నొక్కచేయి పిడికెడు మధుమక్షికముల నొక్క క్షణమున నలిపివేయఁ జాలునని గ్రహింతువేని, యిట్టి బీరము లాడియుండవు."

"నిక్కమె,—కాని, చేతి కయ్యాది దొరకినగదా!"—అని, సరస ముగఁ బ్రతివచనము లాడి, సంహాస మొనరించి, దానఁ దమ నూతనస్నేహము సంకటపడునని యెంచి, సారసేనుఁడు మగుడ నిట్టు లనెను—"శూరుఁడా! అర్థసహితుఁడనై, యనుచరసహితుఁడనై యున్న నీవు నీ భ్రాతృశిబిరమునకుఁ నన్ను గొంపోయి, అందు నా కెట్టి యపాయము ఘటిల్లకుండ రక్షింతువనుకొనుచుంటినిగదా!—మీకైస్త్రవ రాజన్య లంతటి శూరగుణప్రియులా?"

"సారసేనా! గుణవంతుఁడగు శూరునకు రాజ్యమును రాజాధి కారమును లోపముగాని, గౌరవమునకు లోటులేదు. ఉత్తమోత్తమ భూపాలురు సహితము తత్సముముగ నాతని గౌరవింతురు. ఇంగ్లాండు దేశమును బాలించు నా 'రిచర్డ్' యొక శూరునిఁ బరిభవించె నను కొనుము: ఆతఁడును శూరధర్మబద్ధుఁడై, ఆ శూరునితోఁ బోరాడు టకు సంసిద్ధుఁడై యుండవలయు,—నిరాకరింపఁజాలఁడు."

"శూరబిరుదచిహ్నములగు నీతోలు మొలకట్టును రెండు చరణాం కుశములును దాల్చి పీనుఁడు విశాల భూపాలనా సమర్థునితోడ సమానముగ విహరించు విపరీతదృశ్యము గాంచఁ గుతూహల మగు చున్నది."

"శూరుఁడు స్వచ్ఛందవాశజుఁడును దృఢహృదయుఁడుం గూడఁ గావలయు."

"కాని, మీ నాయకనృపాలాదుల కాంతాజనంబులతోఁ గూడ

నింత ధారాళముగాఁ గలసియుందురా ?"

"సందేహమేల ? క్రైస్తవశూరుఁడు నిటువేఁడైనను, స్వీయభుజ ఖడ్గఘనకార్యయశస్సులను, నిజనిశ్చలహృదయమును భవ్యమకుట ఘటితసుందరతనురాజ్ఞికైనను సగౌరవ సేవాపూర్వకముగ నర్పించుటకుఁ దప్పక స్వతంత్రుఁడు."

"కాని, క్రైస్తవా! ప్రేమ, హృదయభవామూల్యధనంబని అచిర కాలముక్రిందట ఘనంబుగ నభివర్ణించి యుంటివి—నీప్రేమ నిశ్చయముగ నొక ఘనతరనారీరత్నము నాశ్రయించియే యుండును ?"

వదనము లజ్జారాగరంజితమై రాజిల్ల, పాశ్చాత్యుఁ డిట్లు బదులాడెను—"ఆర్యా! మేము తీవ్రపాటునఁ దన్నామ మెఱింగించువారము కాము—ఐనను, నీ వనునట్లు నా ప్రేమ ఘనతరహృదయమాశ్రయించెను : కాని, ప్రేమయు, తత్కారణోద్భూతభగ్నశూలాగాధావిశేషముల గుఱించియు వినఁగోరుదేని, ధైర్యహృదయుఁడవై మా శిబిరముల కరుదెంచుము. వలయునేని, నీ శ్రవణములకే గాక భుజములకు సహితము పని తగులును."

"సారసేనశూరుఁ డంత స్వారి యొనరింపుచునే దిగ్గున నిలుచుండి, నిజకరాంచితశూలము సారించి, ఇట్లు వాక్రుచ్చెను—"శూరుఁడా! శూలవిక్షేపమున నా కీడగు వీరుఁ డొక్కఁడైన మీయందుఁ గానరాఁడు సుమా."

"ఆ విషయము నేను నిబ్బరముగఁ బలుకఁజాలను. ఈ యభ్యాసమున మీ ప్రాచ్యులు ప్రవీణులు; ఐనను, తద్విద్యాకుశలులగు 'స్పెయిను' వీరులు మాయందుఁ గలరు సుమా."

"ఛీ! శునకములు! కుక్కలకొడుకులు! సత్యమతస్థులగు మహమ్మదీయులు స్పెయినుదేశమునందే ప్రభువులై యధికారులై రాజిల్లుచుండఁ, దమ దేశమును దలయెత్తి తిరుగనేరని యా నీచు లీదేశ

మున యుద్ధ మొనరింప నయుదెంతురా? అట్టివారితోడి పోరాటము నే నొల్ల."

"మిత్రమా! ఆశూరుచు లీపలుకు లాలింపకుందురుగాక. కాని,"—అంతలో నుదయకలహము స్మరణకు వచ్చుటచే గణతుఁడు మంద హాస మొనరించి యిట్టు లనెను—"నీవు చెప్పునట్టి పుల్లతోడి పందె మున కేమి,—రణరంగవిహారయోగ్యమగు ఘనకుఠారము దాల్చి తాఁకఁ గోరుదేని, పాశ్చాత్యయోధులు పెక్కండ్రు నీముచ్చట దీర్పఁగలరు."

పేరు హాసనాసనుఁడై యిట్టు లనెను—

"అట్టియాట కడు మోటుగ నుండును,—వినోదార్థ మాకాంక్షింపఁదగినది కాదు. కాని, భండనమున మాత్రము వెనుదీయు వాఁడను గానుసుమా."

"సారసేనా! అంగ్లరాజగు రిచర్డు దాల్చు మహాపరశువు నీవు గాంచవలయు;—అపుడు నాయది బెండువలెఁ గాన్పించును."

"శూరుఁడా! ఆ ద్వీపరాజు గుఱించి చాల వినియుందుము. నీవు గూడ నాతని ప్రజాకోటిలోనివాఁడవా?"

"ఈ యుద్ధయాత్రయందు మాత్ర మాతని యనుచరుఁడను. ఆ నృపాలుఁడు పాలించు లంకయందే నివసించువాఁడ నైనను, ఆతని ప్రజావర్గములోనివాఁడను గాను."

సారసేనుఁడు సాశ్చర్యముగ నిట్లు ప్రశ్నించెను—"ఏమందువు? ఆ నిర్భాగ్యద్వీపమున నిరువురు రాజు లుందురా?"

చిత్రకలాంఛనుఁడగు కణతుఁడు స్కాట్లాండు దేశస్థుఁడు. ఇంగ్లాండు స్కాట్లాండు దేశములు రెండును గలసి యొక దీవి యగును గాని, ఆ రెండును రెండు ప్రత్యేక దేశములు. కావున నాస్కాచివీరుఁ డిట్టు లనెను—"అగు నట్టులే యగు. ఆ దేశములు పరస్పర పోరాటమున

నిరంతరము మునిఁగియుండుదు. ఐనను ఈ ప్రాంతమునందలి మా పవిత్రనగరములను దుష్టమతిన్యై యాక్రమించు నీతేని శిక్షించుటకు మా పరస్పర వైషమ్యములు దలంపక ఈ తీరునఁ గలసి రాఁజాలుదుము."

"శూరుఁడా! తన యల్పద్వీపమునం దొక భాగము మఱియొకని రాజరికమున నుండుటయు, దశాధికసైన్యసమేతుఁడై యజేయుఁడై యొప్పు మా సమ్రాట్టును జయించి యీ శిలామయ సైకతసీమలను గడించుటకు మీ మేటినృపాలుఁ డొక యల్ప సేనాముఖమున నరుదెంచుటయును గడు హాస్యాస్పదము. కాని, పవిత్రసంస్థల సంపాదనార్థ మింతదూర మరుదెంచినను మీ పరస్పరకలహములను బాపుకొనియుండుడు. మీ స్కాట్లాండు దేశస్థులు రిచర్డుయొక్క రాజరికము నామోదించియు నుందురు?"

క్రోధావేగస్వరమున క్రైస్తవుఁడు రయమ్మున నిట్టు లనెను— "లేదు! లేదు! ఆంగ్ల రాజు మా దేశము జయించి ఆస్తి మీతోడఁ బోరాడఁ గడంగెనేని, మా పవిత్రనగరము—ఎరూసలేము—అభంగురముగ మీ హస్తగతమై యుండదగు!"

అతఁ డంతలోఁ దెలివొంది, ఇట్లు గొణఁగెను—"పాపాత్ముఁడ! పాపాత్ముఁడ!—నేను మతయుద్ధ దీక్షాపరుఁడ నగు సైనికుఁడను—క్రైస్తవజాతుల పరస్పర కలహస్మరణము నాకేడ!..."

పాశ్చాత్యుఁడు వేగిరపాటున నొకవిధమునఁ బ్రలాపించి, సవరించుకొనుట సారసేనుఁ డరసియే యుండెను. తన సహచరు నభిప్రాయ మాతఁడు పూర్తిగ గ్రహింపనేరకున్నను, మహమ్మదీయ జాతుల వలెఁ గ్రైస్తవజాతులుగూడఁ బరస్పర కలహనిమగ్నములై యుండెనని మాత్ర మరయఁజాలెను. కాని, అతఁడు మంచి మర్యాద లెఱింగిన విశాలహృదయుఁడగు సారసేనజాతి వాఁడగుటచేత, దనసహచ

రుని హృదయము నొవ్వఁజేయుట కిచ్చగింపక, తానేమియు నెఱుంగ నట్టులే మిన్నకుండెను.

వీరు లిర్వురు నటులేగుచుండఁ దద్ప్రాంతదృశ్యము వింతగ మాఱిపోయెను. వారిపుడు ప్రాచ్యదిశాభిముఖులగుచుండిరి. నిట్ట నిలువుగ లేచుకొండలవరుస సమీపమాయెను. మెత్తని యిసుకవంతు ఉన్నతశిలాశ్రేణి దృగ్గోచరమగుచుండెను గాని, అవియున్నట్టులే నిర్జీవముగ నికృష్టముగ నుండెను. సన్నమై, కఠినశిలామయమై, కష్టతర నిమ్నోన్నతి తలసంకీర్ణమై, దుర్గమమై, భీకరమై యొప్పు నాత్రోవ పాంథులకుఁ గడుంగడు దుస్సహము. సమున్నతశిలామధ్యస్థగిరికందరములు, లోయలును భయావహముగ నోరు దెఱచుకొని యుండెను. ఈతావులు ప్రాయికముగ ఘాతుకదస్యుగవిశ్రమనిలయములు; యుద్ధకారణోద్భూతదుర్భరదారిద్ర్యము కతముననో, లేక క్రైస్తవ మహమ్మదీయ సైనికజనపీడనము సైపఁజాలకనో దుర్మార్గానువర్తులై ఘాతుకతరంబుగ జనులను హింసించు క్రూరనరాధముల కాకరము— అట్లు అమీరు తన సహచరునకుఁ దెలుపఁదొడఁగెను.

ధైర్యబలసమన్వితుఁడగు కణతుఁడాభయంకరకథనము శ్రద్ధమెయి నాలింపలేదు. కాని, ఆతని చిత్తము క్రమముగా విపరీత భయాధీనమాయెను. కారణమేమి? ఆతఁడు క్రైస్తవుఁడు—మించి మతయుద్ధదీక్షాపరుఁడు. క్రైస్తవజగద్రక్షకుఁడగు క్రీస్తు తనమతబోధ ప్రారంభించుటకు ముందు దుర్గమారణ్యసీమకేగి, నలువదిదినములు నిరాహారవ్రతము బూని కఠినతపమాచరించెననుట ప్రసిద్ధము. ఆ తావయ్యేదె! ఆపరమపురుషుఁడా స్థలముననే సర్వజనవంచకుఁడగు 'సైతాను'ను గాంచెను. కణతుని చిత్తవిభ్రమమున కయ్యదె కారణము. తన సహచరుఁడు వీరుఁడు, ధీరుఁడు, ఉన్నతచిత్తుఁడు—అట్టివాని సాహచర్య మట్టి భయదనిర్మానుష్యస్థలమునఁ గడు వాంఛ

నీయముగనే యుండవలయు. ఆతని సరసప్రసంగధోరణియును దత్సమయానుకూలముగఁ బ్రీతికరముగ నుండవలయు. కాని, అమీరు విరుద్ధమతస్థుఁడు, మ్లేచ్ఛుఁడు. ఆ స్థలమన్ననో!—పాపిష్ఠిస్థానము, జగద్రక్షకుఁడగు క్రీస్తును వంచింపఁ గడఁగిన భయావహరంగము: మఱియు, నరులను బాధించి బాధించి, మంత్రప్రభావముచేఁ బాఱివచ్చు దయ్యములకు నాకరము. అట్టి తావున స్వీయమతస్థుఁడగు సన్యాసి యొకఁడు తోడుగ నుండిన బాగుండునని వీరుఁ డెంతయుఁ దలపోసెను.

క్రైస్తవుని చిత్తము మఱియు మఱియుఁ గలంగఁ జొచ్చెను. అంధకారబంధురగిరికందరములనడుమ నడచుగోలఁది సారసేను మానసోల్లాస మధికతర మగుచుండెను. ఆతఁడు మఱియుఁ బ్రీతికరముగ మాటాడఁ దొడఁగెను. నిజమనోభవాలోచనానిమగ్నుఁడగు క్రైస్తవుఁడు సంభాషింపఁడాయెను. తురుష్కుఁడది యొక చీరికిం గొనక, నిజచిత్తానందము బురస్కరించుకొని గానము సేయుచుండెను. స్వరమనుక్షణము లేచుచుండెను. క్రైస్తవుఁడు బధిరుఁడు కాఁడు. ప్రాచ్యభాష యాతఁ డొకింత ఎఱింగియు నుండెను. పేరు ప్రాచ్యకవితాజనోచిత సౌందర్యాభివర్ణన సంభృతగీతముల నాలాపించుచుండెనని ఆతఁ డరయఁజాలెను. అట్టి తఱి భక్తిగీతాశ్రవణము సముచితమని శూరుఁడు భావించెను. సారసేనుఁ డంతట నార్ద్రమాణిక్యరాగప్రభారంజితమగు ద్రాక్షారసము గుఱించి యాలాపించెను. ఆతఁడు నిరంతరప్రవర్ధమానహర్షోత్ఫుల్లహృదయుఁ డగుచుండెను. క్రొత్తగ నేర్పడిన స్నేహము కలంచి, కణతుఁడు సహించి యూరకుండెను గాని, తన మిత్రున కాతఁడు బుద్ధి సెప్పియే యుండును. పశ్చాత్తాపతప్తచిత్తుఁడై, నిశ్చలస్వాంతుఁడై యుండవలసిన ఆ మహోత్సవసమయమునఁ దన భక్తిదీక్షలను ధ్వంస మొనర్చి, తన యాత్మను పరవశ మొనరించుకొని, ముందుగతులు లేకుండ చేయఁ దలపెట్టి వెన్నాడు దయ్యమువలె నా

సారసేనుఁ డాతనికిఁ దోఁచుచుండెను. క్రైస్తవుఁ డేమి చేయవలయు? సారసేనుఁ డంతలో నింకొక గీతమునకు దొరఁకొనెను. అయ్యది, ప్రసిద్ధ 'రుదీపిక' కవి, 'బొకారా' 'సామరుకంద' నగరములందలి యగణితధనరాశికంటెఁ దన కాంత యురోజనములందలి పుట్టుమచ్చయే గణనీయమని శ్లాఘించు గీతము. క్రైస్తవుఁ డికఁ దాళఁజాలక కఠిన ముగ నిట్టు లనెను—

"సారసేనా! నీవు అంధప్రాయుఁడవు! కుమతస్థుఁడవు!—ఐనను, కొన్ని తావులు పవిత్రతరము లనియు, కొన్ని తావులందు మర్త్యులపై నైతాను అధికతరాధికార సమన్వితుండై గంతుమీఱి యుండుననియు నీ వేల యెఱుఁగవు? ఈ శిలలు—ఈ యాధకారబంధురగిరికందర ములు, ఈ యరణ్యభాగము—స్వర్గపదభ్రష్ట నైతానాది మిథ్యా దేవతల కాలవాలము—నీ కా విషయము విపులముగ వ్యక్తపఱుప నవసరము లేదు. దుష్టస్థలతత్త్వకోవిదులగు జ్ఞానులీప్రాంతముగుఱించి హెచ్చరించి యుండిరి. కావున నో సారసేనా! ఈ తెలివిమాలిన అకాలపు టుత్సాహ ముడిగి, ఈ ప్రదేశమున కనువగు మార్గమున నీ చిత్తము మఱలింపుము—కాని, నీకు భగవన్నామస్మరణ మేడ! మీ ప్రార్థన దైవదూషణము, పాపభూయిష్ఠమును గదా!"

అమీరు విస్మయాక్రాంతుఁడయ్యు, సరసముగ నిట్లు బదు లాడెను—

"మేటి శూరకణతా! నీ సహచరునెడ నిట్టు లన్యాయముగఁ బ్రవర్తింపఁ బాడియా? లేక, మీ పాశ్చాత్యసభ్యత ఇట్టిదే యగునా? నేఁ గాంచుచుండ, వరాహమాంసము మెక్కి, మధుపాన మొనరిం చితివి,—అది నీ క్రైస్తవస్వాతంత్ర్య మంటివి,—అట్టి దురభ్యాస ములు చూచి నేను జాలిగొని, యిన్నకుంటిఁగదా. మానసోల్లాసప్రద మగు గీతముల బాడుకొని ఈ భయావహమార్గ మతిక్రమింపఁజూచు

నన్ను నీవు నిందింపనేల ? మా కవి యేమనునో వింటివా—'గానము ఎడారియందలి స్వర్గతుషారసమానము: దాన, పాంథుని పథము చల్లపడును'."

"మిత్రమా ! నీ గానాభిరుచి నిరసింతునని తలంపవలదు. కాని, చిత్తము మహత్తరాలోచనాధీనమై యుండవలసిన ఈసమయమున విపరీత సంతోషమయమగుట తగదు. ఈ తావెట్టిది ? సాధుజనుల సన్మంత్రములకు వెఱచి, సరావాసభూములు వీడి, తముం బోలు పాపిష్ఠినిలయములు వెదకికొని పాఱివచ్చు దయ్యముల కియ్యది వాలము. ఈ స్థలము పిశాచీభూతసంకీర్ణము. కావున, ప్రణయ మాధురీ గీతాగానవిర్మగ్నుండవగుటకంటె, దైవచింతయు భక్తిగీత ములును దగియుండును."

"క్రైస్తవా ! భూతములగుఱించి యటు లాడఁదగదు. మీ రెవ్వరిని దలంచి భయాతిరేకమున దూషింతురో అట్టి యమరజాతి నుండియే మావంశము ప్రభవించెను."

"ఔను, మీరు పిశాచాంశసంభూతులని ముందే అనుకొంటిని: కానిచో, సాహసవంతులగు దివ్యసైనికులను—క్రైస్తవసైనికులను— ఇంతమందిని తృణీకరించి, పవిత్రవంతమగు పాలస్థానము మీ రాక్ర మించి యుండరు. సారసేనా ! నీ జాతిగుఱించి, నీ మతముగుఱించి నే నిటు లందుఁగాని, నిన్నొక్కని గుఱించియే గాదుసుమా. సైతాను వంశ సముద్భవుండవై యున్న నుందువు, గాని, నీ వా విషయస్ఫురణ మున నుప్పొంగుట కడు విపరీతము !"

"మాధీరోత్తమజాతి ధీరోత్తమసంభవమని సగర్వముగఁ జెప్పు కొనమా ? సైతాను ఎంతటి మానియో యెఱుంగుదువా ? పర మాత్మునకు దోసి లొగ్గి స్వర్గమున దుస్సహదాస్యమునఁ బొరలాడుట కంటె ధిక్కరించి యధోముఖమున గ్రింద పడుటయే గౌరవప్రదమని

సంభావించిన యగ్రగణ్యుఁడు! మానవంతులమగు మేము సగర్వముగ నా మహామానిం దలంపకుందుమా? భూతనాయకుఁడగు 'ఎబ్లిసు' మీకు నసహ్యాకరముగ నుండుగాక; ఆతఁడు తప్పక భయంకరుఁడు. మా కుర్దుజాతివారము తదంశసంభవులము."

ఇంద్రజాలాది మాంత్రికవిద్య లాకాలమునఁ బ్రబలముగ నుండెను. కావున తాను భూతాంశసంభవుఁడనని పేరు వాకొనినను, క్రైస్తవుఁ డంతగ నక్కజపడువాఁడు కాఁడు. కాని, ఆతావు అనన్యసాధారణము అపూర్వభయావహము నగుటచేతను తన సహచరుఁడు తాను భూతనాయకుని సంతతివాఁడనని స్పష్టముగ నా స్థలమున జెప్పుట చేతను ఆ వీటుని ధీరహృదయము లోలోన భయకంపిత మాయెను. భయనివారణార్థము తన చేతు లొక్కక్షణము సిలువవలెఁ గట్టుకొని నీ వంశవృత్తాంతము విశదపఱుపవలయునని తన మిత్రు నాతఁడు ఖచితముగఁ గోర సారసేనుఁడు తత్క్షణ మిట్లు వాక్రుచ్చెను—

"అప్పుడు మొదటిమానవుఁడని పేరు వడసిన 'ఆదాము' ఇంకను జనింపలేదు. ఆ యనాదికాలమున 'ఇస్తాఖరు*' నందు భూతము లొక సజీవశిల దొలచి రహస్యమందిరములను నిర్మించెను. చాలాకాలమైన యనంతరము 'జోహాకు' అను రాజు పెరసియాదేశ సింహాసన మారోహించెను. ఆతఁ డతి క్రూరాత్ముఁడు. భూతములతో నాతఁడు నెయ్యము నెఱపి రెండు భయంకరసర్పములను సంపాదించెను. ఆ రాజు శరీరముతో నయ్యవి కలసియుండెనని కవులు వర్ణింతురు. వాని కాహారమునకు దినమున కిరువురి నెత్తురు కావలసియుండెను. ఆ కారణమున నా దేశములోని జను లిర్వురు అనుదినము దారుణవధకుఁ బాల్పడుచుండిరి. జను లెంతని సహింపఁగలరు? తుద కాతఁడు నిజ క్రౌర్యప్రతిఫలముగ సింహాసనచ్యుతుఁడై కారాగారబద్ధుఁడాయెను.

* పూర్వము పెరసియా రాజధాని.

ఈలోపున నృపాలసర్ప కబళనార్థ మేడుగురు వనితారత్నము లెచట నుండియో తేఁబడిరి. వా రొక జ్ఞానిసంతానము. వారలే భూతని ధనము; వానికిఁ గల రెండవధనము జ్ఞానధనము. పాప మాతఁడు జ్ఞానసంపన్నుఁడయ్యు నిట్టి యుపద్రవ ముత్పత్తిల్లునని యరయలేక పోయెను. పెద్దకుమారి ప్రాయ మిరువది సంవత్సరములు. కనిష్ఠపుత్రిక పదమూఁడు సంవత్సరముల ప్రాయము గలది. ఆ కన్నియ లగణిత సౌందర్య శోభాసమన్వితలై, అమరనారీసన్నిభలై, ఏకరూపధారి ణులై పరస్పర మొక్కసంవత్సరము చిన్నపెద్ద యగుటచే స్వర్గద్వార మున కమరియుండు సోపానపరంపరవలె మనోహరముగఁ దోఁచిరి. తదీయవధ్యశాలాబద్ధమోహనాంగుల లావణ్యము మర్త్యులకేగాక యమరులకుసహితము వర్ణనీయముగ నొప్పారెను. అంతలో నాకసము గర్జించెను. భూమి వడఁకెను. తన్మందిరోపరిభాగము నిర్భిన్న మాయెను. ధనుర్బాణధరులై మృగయులఁ బోలు సోదరు లేడుగురు రయమ్మునఁ బ్రత్యక్షమైరి. వారంతయు నున్నతగాత్రులు; ధవళవస్త్రులు గాకున్నను సుందరాకారులు; నయనములుమాత్రము సజీవ మానవ నయనకాంతికి దూరములై ప్రేతకళానిలయములై తోఁచెను. అంతలి మొనగాఁడు జ్యేష్ఠసోదరీ కరగ్రహణ మొనరించి ఆమె పేరున సంబో ధించి యిట్లనెను—'కాంతా! నే నధోలోకపాలకుఁడనని గ్రహిం పుము. నా నామధేయము 'క్రతాబు' జనీ*స్థానానము మదధీనము. దైవము తొల్లి మృత్తికానముఁడగు మానవుని సృష్టించి వానికి ధన్యవాదము సలుపవలయునని కోర మేము సహింపనేరక నిరాక రించినవారము. మేము ప్రాధమికాగ్ని భూతసముద్భవులము. మేము యక్కటికమెఱుంగని క్రూరులమని వినియుందువు. అది కేవలము మిథ్య. మము విశ్వసించు సత్పురుషులను మేము సాఁకుచుందుము.

---

* జని—భూతము.

జ్ఞానియగు నీ జనకుఁడు వెఱ్ఱియై ఆ పరమదేవత నొక్కనే యారాధింపక మమ్మునుగూడ దలంచువాఁడు. నీవును నీ సోదరులును ఇఁక మృత్యువున కాహుతి గావలయుఁగదా. మీ రండఱు మీమీ సుందర కుటిలకుంతలములం దొక్కొక శిరోజము భక్తిప్రపూర్వకముగా మా కర్పింతురేని ఈ యపాయమునుండి రక్షించి మి మ్మొక దూరస్థలమునకు సురక్షితముగఁ జేర్పఁగలను.' భూతరా జట్లు పలుక అపభ్రభయాతిరేకమున వేఱుతలం పెఱుఁగని ఆ జవ్వని ఇయ్యకొనెను. కన్నె లంద ఱు నాతఁడు కోరు కప్పము వెంటనే సమర్పించిరి. ఆ ముహూర్తమున నా మచ్చెకంటులు కురిస్థాన పర్వతాంతర మాయామందిరమునకుఁ గరలింపబడిరి. వా రింక మానవులకుఁ గానరాలేదు. కాని కాలపరిణామమున నా భూతమందిర పరిసరములందు నేడుగురు యువకులు కానవచ్చిరి. మృగయా రణకుశలురగు నా వీరులు ఆ ప్రాంతమునఁ దిగఁగాడు జనులకంటె నెక్కుడ ఉన్నతముగ భీకరముగ నిబ్బరముగఁగూడ నుండిరి. క్రమముగా వారు వివాహ మాడి పుత్రవంతులై వంశనిర్మాతలై యశోమండితులైరి. జగద్విఖ్యాత శౌర్యధనులగు మా కురుజాతు లేడింటికిని వారలు మూలపురుషులు."

క్రైస్తవవీరుఁడు సాశ్చర్యముగ నా భయంకర గాథ నాలించెను. నిమేషమాత్ర మాతఁడు చింతాపరుఁడై యిట్లు లనెను.

"వీరుఁడా! మేలు మేలు! నీ వంశచారిత్రము భయంకరమై అసహ్యకరముగ నున్నను నిరసింపఁదగినది కాదు. నీ విట్లు మూర్ఖముగఁ గుమతవిశ్వాసబద్ధుఁడవై యుంట నా కింక వింతగఁ గాన్పింపదు. నీ వభివర్ణించిన ఆ సప్తమృగయులయంశ మీకు సంక్రమించెను. తత్పిశాచతత్త్వము మీరక్తమున జీర్ణించియుండుటచేత నే మీకు సత్యముకంటె నసత్యము ప్రియతరమగు. కావుననే పాపిష్ఠిభూతసంకీర్ణమగు ఈ తావున చేరునంతనే నీ చిత్త ముప్పొంగ నిర్భరానందప్రభావ

మునఁ బదములు పాడ నారంభించితివి.''

క్రైస్తవుఁ డట్లు చనవుగనే నిందాగర్భితస్వరమునఁ బలికినను సారసేనుఁ డావంతయుఁ గినియక సంతసించి యిట్లు లనెను. "మిత్రమా! నీ పలుకు లమోఘము. కాని ఈ పిశాచము లన్నియు గత్యంతర మెఱుంగక నిరంతర మిట్టులే యుండునని తలంపరాదు. ఈ కాల మొక విధమగు సంధ్య. కొంతకాల మిట్లు లగుడు నిజకర్మఫలాను గుణ్యముగ సన్మానమో శిక్షయో కాంచును. కాని యిట్టి విషయ ప్రశంస మతాచార్యులకుఁ దగును; మన కేల ? మా పవిత్రగ్రంథమగు 'ఖొరాను' ఎంత పఠించినను తత్పూర్వవిశ్వాసములు మా కింకను స్మరణీయములు.'

ఈ జగము పాపపుణ్యమయము. ఈ రెండు గుణములకు నిరంత రాయమానమగు పరస్పరసంఘర్షణము ప్రపంచధర్మము. అందు 'ఆర్మజు' మూర్తీభవించిన పుణ్యము; అట్టులే 'అహ్రిమాను' మూర్తీ భవించిన పాపము. అనాదిపారసీక మట్టిది. మహమ్మదీయు లట్లు గాక యేకేశ్వరోపాసకులు. ఐనను తొంటి దురాచారవిశ్వాసములు వీడకుండుటచేత దుష్టమూర్తియగు 'నహ్రిమాను' వారి కింకను బ్రశంసనీయుఁడై యుండెను. తాదృశాభిప్రాయబద్ధుఁడగు మన సార సేనుఁ డంత గొంతు సవరించి దుష్టమూర్తియగు నహ్రిమాను ప్రభా వము గొనియాడు గీతములు పాడ నారంభించెను. ఆతని యుత్సా హము క్షణక్షణప్రవర్ధమాన మాయెను.

క్రైస్తవుఁడు భయాగ్రహాఘూర్ణమాన మానసుఁడాయెను. పాపిష్ఠ సైతానుయొక్క భక్తునివలెఁ జరించు నా దుష్టమానవు నాక్షణము వీడిపోవలయునా ? లేక, మతయుద్ధ దీక్షాబద్ధుఁడై యరుదెంచిన క్రైస్తవసైనికున కుచితమగు తెఱఁగున నామ్లేచ్ఛు నాక్షణమ గతాసు నొనరించి వాని కళేబరము వన్యమృగములకు వీడి తనదారిం బోవల

యునా ?—చిత్రకవీసుఁ డట్లు దుర్భరాందోళనమునకుఁ బాల్పడి యుండ, నాకస్మికముగ నొక వైపరీత్యము సంభవించెను.

సాయంతనమగుఁడు, వెలుఁగడఁగుచుండెను. ఐనను, పలుచని పొడుగాటి మూర్తియొకటి దవ్వుదవ్వులఁ గ్రి స్తనసూయునకు గోచరించెను. మార్గమునందలి శిలాగుల్మములు భంగుభంగున లంఘించుచు నామూర్తి వనదేవతయో మఱేదియో తెలియకుండెను. సారసేను పాపిష్ఠగీతాలాపము కతంబున నొక దయ్యాగు పొడచూపి యుండునని యాతఁడు విశ్వసించెను. "కాని, నాకేల ? ఈ పిశాచమును ఈ భక్తుఁడును గూడ మద్భుజబలము జవిజూతురుగాక !"—అని కణాశుఁడు నిశ్చయించుకొనెను.

తన గానముచే నన్య మెఱుంగక మేను మఱచియున్న అమీరందులకు సంభావనగా నిజమిత్రకరాంచితముసలనిర్భిన్నశిరస్కుఁడై, తానున మరణింపవలసినదే. అదృష్టవశమున నట్టి కళంక మా చిత్రకలాంఛనునకుఁ జుట్టుకొనకుండ తప్పిపోయెను. ఆ వ్యక్తి తమకుఁ దెలియకుండ వెంబడింపవలయునని యెంచి కావలయు, తాలచాటున నక్కుచు, వన్యమృగోచితలాఘవమున బైకెగురుచు, నంతలో నదృశ్యమగుచు నగుపించుచుండెనని శూరుఁడు గ్రహింపఁగల్గెను. షేకు తన గానము ముగించునంతలో, మేషాజినము ధరించిన యున్నతశరీరుఁ డొకఁడు మార్గమున కడ్డుగ రయమ్మునఁ దోఁచి, ఆతని వాహనము పగ్గము దృఢముగఁ బట్టి వెనుకకు నెట్టెను. ఆకారణమున నాయుత్తమ హయము నోటియందలి దీర్ఘఖలీనము దుస్సహముగఁ బీడించుటచే నా జంతువు నిలువున లేచి, వెనుకకు విఱిగిపడెను. సారసేనుఁడు తన యశ్వముక్రిందఁబడి నలుగవలసినదే, కాని, శరవేగమున నొకప్రక్కకు దొరలి, ఆ ప్రమాదము తప్పించుకొనెను.

అంత నా విపరీతవైరి గుఱ్ఱమువీడి, భూపతనుఁడైన షేకుకంఠము

బట్టి గుభాలున నాతనిపైఁ బడెను. సారసేనుఁడు యౌవనజవసత్వ లాఘవ సమన్వితుఁడయ్యు, నా వ్యక్తిని వారింపనేరక గిజగిజలాడి, ఒకింత నవ్వుచునే సక్రోధముగ నిట్టు లనెను—"హమాకూ !— మూర్ఖా!—నన్ను వీడుము—నీ చనవు మితిమీఱెను—వీడుము!— బాకుదీసి బుద్ధిసెప్పెద."

"నీబాకు !—మ్లేచ్ఛా ! అంతబలము గలదేని, తీయుము !"— ఆగంతుకుఁ డట్టు లధిక్షేపించి, పెనఁగి, పతితవీరహస్తప్రదీపితాస్త్రము దానే లాగికొని, వాని శిరముపై జళిపించెను. వీరు తన సహచరు నుద్దేశించి భయప్రకంపితస్వరమున నిట్టు లరచెను—

"క్రైస్తవా! రక్షింపుము ! ఈ 'హమాకో' నన్ను వధించును."

"వధింతునా !—అవును; ఆ దుష్టభూతస్తోత్రపాఠకుఁడవగు నీ వవశ్యము వధ్యుడవు" అని ఆ యెడారినివాసి భయంకరముగ బదులాడెను.

క్రైస్తవవీరుఁ డంతనుక ప్రూన్పడి తిలకింపుచుండెను. ఆవ్యక్తిని దూరమునఁ గాంచినపు డెట్టి భావ ముదయించెనో, అందులకుఁ గేవలము విరుద్ధముగ నిపుడు పరిణమించెను. ఏమైనను, దైన్యా వస్థకుఁ బాల్పడియున్న తన మిత్రునకుఁ దోడ్పడుట గౌరవప్రదమని యెంచి, ఆతఁడు మేఁకతోలు దాల్చిన విజయి నుద్దేశించి యిట్టు లనెను—

"నీ వెవ్వఁడవైనను—సదంశసంభవుఁడ వైనను, దుష్టాంశభవుఁడ వైనను సరె—నా పలుకులు పాటింపుము. ప్రకృత మీ సారసేనుఁడు రక్షణీయుఁడు. కాన నీ వీతని వీడియుండుమని అర్థించెద; లేదేని, నీతోఁ బోరెద."

అంత నా హమాకుఁ డిట్లు బదులాడెను—

"ఆహా ! మతయుద్ధబద్ధునకుఁ దగిన పోరాటము ! ఈ క్రైస్తవ

సంస్కారవిరహితక్షుద్రునిఁ బురస్కరించుకొని స్వీయమతస్థునితోఁ బోరాడుదువే! సిలువదాల్చు క్రైస్తవుఁడవయ్యు, బాలేందులాంఛను కొఱకుఁ గ్రైస్తవునితోడ భండన మొనరించుటకే ఈ యరణ్యమున కరుదెంచి యుందువా? సైతాను ప్రభావాలాపప్రియుఁడవు నీవు మంచి క్రైస్తవవీరుఁడవే యగుదువు!"

అట్లు లాడుచునే ఆ మేషాజినుఁడు సారసేనుని వీడి, ఆతని కత్తి నాతని కిచ్చివేసి, ఇట్టు లనెను—

"షేరుకాఫ్! ఎఱింగితిగదా, నీ దురహంకారకారణమున నెంతటి యపాయమునకుఁ బాల్పడితివో! పరమాత్ముఁడు సంకల్పించునెడ ఎంతయో నీవు గర్వించు జవకౌశలములు ఏ దుర్బలకారణముననో నిరర్థక మగుననియు నరయుము. ఇల్దరీమ్! నీ నక్షత్రప్రభావమున ముందు కొండొక శుభంబు నీకుఁ బ్రాపింపవలసి యున్నది—దానఁ బ్రకృతము బ్రదికిపోతివి. లేదేని, పాపిష్ఠగీతము లాలాపించు నీకంఠము జీల్పకుండ నిను వీడియుండను."

ఎడారిమనుజుని ధూర్తప్రవర్తనమును, ధూర్తప్రలాపములను గూడ షేరు గణించినటులు కానరాదు—"హసూకో! ఓయి సజ్జనుఁడా! చనవుగలదుగదా యని మితిమీఱి చరింపకుము. దైవికముగా నీవు మతిభ్రష్టుఁడవై, కాలజ్ఞుఁడ వగుటచేత, నేను నిక్కంపు మహమ్మదీయునివలె నిను గౌరవింతును. ఐనను, ఎవ్వఁడేని నన్ను దాఁకుట, నా యశ్వఖలీనము బట్టి నిరోధించుటయు నేను సహింపను. నీ వేమైనఁ జెప్పఁగోరుదేని, నే నాగ్రహింతునని బెగడువడకుము. కాని, నీవు మగుడ ధౌర్త్య మొనరింప నెంతువేని, నీ చింపిరితల తెగిపోవునని గ్రహించి భద్రముగ మెలంగుము!—ఇఁక నీవు—క్రైస్తవమిత్రమా!"—సారసేనుఁ డంతలో నశ్వారూఢుఁ డాయెను—

"ఎడారియందు యాన మొనరించునపుడు, మిత్రవాక్కులకంటె మిత్ర

కార్యములు ప్రీతికరములై యుండు; కాని, నీ ప్రవర్తనమునకో!— మాటలకు మాత్రము లోటులేదు. ఈ వనచరుఁడు నిజమానసోద్రేకమున నన్నుఁ బొలియింపనుండెను!—నీ వట్టి ముహూర్తమునఁ దోడ్పడవలదా?"

"ఆహా! నీకు దక్షిణము సాయపడకుండుట నేరమే యగు:— కాని, నీ వైరి వైపరీత్యమును, తదాకస్మికపరిణామమును గాంచి— ఈతఁడు భవదీయ దుష్టగీతాశ్రవణోద్ధృతభూత మనుకొంటినుమా!— అచ్చువడి, రెండు మూడు నిముసములవఱకు నా ఖడ్గము దీయఁజాలక పోతిని."

"నీ స్నేహము తదావేశశూన్యము. ఈ హామాకు నున్మాదమొకింత యధికతర మాయెనేని, నీవు నిరంతరాయమానదుర్వ్యాశోమగ్నుఁడ వగుసట్లు, నీవు కాంచుచుండ, సాయుధుఁడవై యుండ, అశ్వారూఢుఁడవై యుండ, నీ సహచరుఁడు మ్రగ్గవలసినదేకదా!"

"ఓయీ సారసేనా! నామాట విశ్వసింపుము—ఆ వ్యక్తి భూత మనుకొంటిని; నీ వా సంతతివాఁడవే యగుటచే, ఈ యిసుకపైఁ బడి పరస్పరాలింగనమున నెట్టి కుటుంబరహస్యము ముచ్చటింపుచుండిరో యెఱుంగనైతి"

"ఇట్టి పరిహాస మొక సమాధానము కానేరదు. ఏమందువా, నన్నుఁ దాఁకువాఁడు ఆ భూతరాజే యగుగాక—ఐనను, మన స్నేహము దలంచి నీ వాతని మార్కొనవలయు. మఱియొకటి— నీ పితనియం దెట్టి దుష్టాంశ, ఎట్టి పిశాచాంశయైనఁ గాంతువేని, అయ్యది నీ జాతిదోషము కావలయునే గాని, నాయది కానేరదని గ్రహింపుము. ఈ హామాకోయే, నీవు సందర్శింప నరుదెంచిన సన్యాసి!"

"ఇతఁడా!"—దృఢగాత్రుఁడయ్యు జీర్ణించియున్న ఆ హామా

కును సాశ్చర్యముగఁ దిలకించి, కణతుఁ డిట్లు లనెను—"ఇతఁడా!—సారసేనా, పరిహాసించుచుంటివి—పూజ్యుఁడగు ఎంగాడీస్వామి కాఁ జాలఁడు!"

"నన్ను విశ్వసింపవేని, ఆతఁడే యెఱింగించు—" పేరుకాపు అట్లు బదులాడుచుండగనే, ఆ వనచరుఁ డిట్లు పలికెను—"నేనే ఎంగాడీ నామధేయుఁడ—ఎడారియందు దిరుగాడువాఁడ—సిలువ దాల్చు క్రైస్తవుల హితుఁడ—మ్లేచ్ఛ, భూతపిశాచారాధకులను భంజించువాఁడ. పొండు, పొండు!—ఆకుమతస్థులను గడతేర్పుడు!" ఆ వింత సన్యాసి యట్లు కేకలుచు, నయోబద్ధముద్గర మొండు నిజాజిన వస్త్రమునుండి తీసి, శిరము పై కెత్తి, యపూర్వకౌశలమునఁ ద్రిప్పఁ దొడగెను.

కణతుఁడు సహజముగ నిరవధికవిస్మయపరుఁడై, అచేతనుఁడై, అనిమేషుఁడై వీక్షింపుచుండెను. ఆ వనచరుఁ డట్లు ఉన్మాదసహజాసంబద్ధాలాపుఁడై, స్వీయోద్దండముద్గరము మిత్రునకేని శత్రునికేని తగులునని తలంపనియట్లు నిరాఘాటముగ వడివడి సారించి, తుదకుఁ దన భూరిబలంబును, ఆ గుదియ దిట్టతనంబును సమానముగఁ దెల్లమగు చందమునఁ దత్సమీప ఘనశిలాఖండము నొక్క వ్రేటునఁ దుత్తునియ లొనరించెను.

అంత పేరు హాసనాననుఁడై తన క్రైస్తవ సహచరు నుద్దేశించి "చూచితిగదా నీ స్వాములవారిని" అని తదవసరోచితముగ నెక్కసక్కెము లాడెను.

"ఈతఁ డున్మాదుఁ"డని యాతఁడు బదులాడ పేరు మగుడ నిట్టు లనెను—"ఐనను ప్రభావమునకు లోటులేదు" ఉన్మాదులు తత్క్షణ దివ్యజ్ఞానప్రేరితులని ప్రాచ్యులు విశ్వసింతురు. క్రైస్తవా! ఒక నయనము లుప్తమగునేని రెండవది తీక్ష్ణతరం బగుగదా—ఒక

చేయి ఖండితమగునేని రెండవ భుజబల మధిక తరమగు—అట్టులే ఐహికపరంబగు మానవవిజ్ఞానము భంగపడునేని నాశన మొందునేని దివ్యజ్ఞానము నిశితతరమై పరిపక్వ మొందును.”

అంతలో నా సన్న్యాసి యెలుగెత్తి యిట్లు లాలాపించెను.

“నేనే ‘ఎంగాడీతియడోరు’ను—ఈ యెడారి దీపికను. మ్లేచ్ఛుల పాలిటి ముద్గరమును! నేడు సింహచిత్రకములు నన్ననుసరించి నా గుహాయందు నుండుసుగాక; వాని కోరలు గాంచి మేషము వెఱచు నదిగాదు...”

అట్టి పాట యిట్లు ముగించి కొంచెముదూర మాతఁడు వడివడి బాఱి వ్యాయామక్రీడారంగమున నాఱితేఱినవానివోలె మూడు గంతులు వైచెను. నిస్సంగున కట్టి వింత ప్రవర్తన మెంతమాత్ర మొప్పనిదగుటచే స్కాచిసూఘఁ డట్టె ప్రూన్పడియుండెను. ఆ సన్న్యాసి భావ మెఱింగిన సారసేఘఁ డిట్లు లనెను—

“నేను సింహనామధేయుఁడ; నీవు చిత్రకలాంఛనుఁడవు. మేక తోలు వస్త్రముదాల్చు తానే మేషము; మన మిత్రపురము నాతని నిలయమున నీ రేయి విడియవలయునను కోరువాఁడు. మన మట్టులే యొనరింపవలయు. ఇంకొక విశ్రమస్థాన మీరేయి గాంచుట అసాధ్యము. ఈ స్వామి లొట్టియవలె నీ ప్రదేశమున నతివేగముగఁ బోఁగలఁడు. మన దృష్టి ఆతనిమీఁద నే యుంచి వెంబడింపవలయును.”

“ఆతఁడు పలికినట్టులే ఆ వనచరుఁడు శరవేగమునఁ బాఱుచు మధ్యమధ్య వెనుదిరిగి వెనుకబడిన పీకులను రండని హెచ్చరింపుచుండెను. మలకలు తిరిగి సన్ననై భయంకరమగు చఱియలతో నిండిన ఆ పథ మతి దుస్సహముగ నుండెను. అట్టి దారుల కలవాటు పడిన షేరునకుఁగూడ, గష్టముగనే యుండెను. క్రైస్తవుని దురవస్థ కేవలము వర్ణనాతీతము. మార్గ మపరిచితము, అగమ్యము, భయా

వహాము; తానును హాయమునుగూడ భారతరకవచముచేఁ గ్రుంగు చుండిరి. ఒక్కక్షణ మేమరి ఏభయంకర గర్తమునఁ బోపడి నికృష్టముగ మరణించుటకంటె నసాయకరమగు తుములసమర నాశనికి వాంఛ నీయముగ నుండెను. ఎట్టకేలకు వారు గమ్యస్థానము జూడఁజాలిరి. అనతిదూరమున నొక గుహాచెంగట నా యపూర్వస్వామి దీర్ఘదారు కరదీపికాహస్తుఁడై నిలుచుండెను.

తద్దీపనిర్గతగంధమయవాయువు దుస్సహముగ నున్నను ఓర్చి క్రైస్తవుఁ డాగుహాచెంగట నేలకు డిగ్గి యందుఁ బ్రవేశించెను. స్థలము విశాలముగలేదు. ఆ కోణము రెండు భాగములుగ నుండెను. ముందుభాగమున నొక వేదికయు నాచ్ఛాదిత జమ్ముకాడలతోఁ గల్పించిన యొక సిలువయునుండెను. అయ్యది ఎంగాడీ దేవాలయము కావలయు. అట్టి తావు క్రైస్తవునకుఁ బవిత్రవంత మగుటచే స్కాచివీరుఁడు తన హాయము నటఁ గట్టుటకు సంశయింపుచుండ సారసేనుఁ డదియే యచటి యాచారమని హెచ్చరించెను. సన్యాసి అభ్యంతరభాగము జొచ్చి అతిథులను సన్మానించుటకు సవరించునంతలో వారందుఁ బ్రవేశించిరి. ప్రథమఖండముక్రింద నొక మోటు తలుపుచెక్కగల బిలముండెను. అదియే ఎంగాడీ శయ్యాగారము. బాహ్యాకృష్టికి దరిద్ర ముగ నున్నను బిలాంతరస్థలము విశాలముగ సదుపాయముగనే యుండెను. స్వామిపరిశ్రమచే నేల చాలమట్టుకు సమమట్టమైయుం డెను. ఆతఁ డందు నిసుకజల్లి, ప్రాణాపాయకరమగు నా నికృష్టారణ్య మున నాసమీపముననే జిహ్వాశ్రవణముల కింపుగ నలరారు శిలా నిర్గతజలములచే ననుదినము తడుపును. జీర్ణకేతననిర్మితములగు తల గడ లొకప్రక్కనుండెను. నేలవలె గదినిలువుభాగముకూడ మోటు గనేయుండెను. పచ్చని మొలకలు పువ్వులును జుట్టు వ్రేలాడుచుండెను. శీతలసుగంధముల వెదచల్లు రెండుమైనపుదీపము లందు మనోహర

ముగ వెలుంగుచుండెను.

ఒకమూలఁ బనిముట్లు పడియుండెను. మఱియొకదెస, మేరీకన్య విగ్రహము మోటుగనే యొకగూటియం దమరియుండెను. ఒకమేజా, రెండుకుర్చీలునుగూడ నుండెను. ఆయవి తూర్పుదేశపుఁ బనితనమునకు విరుద్ధముగనుండుటచే, నాతఁడే వానిని దయారుచేసియుండవలయును. బల్లమీఁద జమ్ముకాడలు పప్పులునుగాక, ఎండుమాంసముగూడ నుండెను. అతిథుల నోరూరునట్లు ఎంగాడీ వాని నమర్చియుంచెను. ఆతఁడు మౌనమువహించియేయుండెను గాని, ఈప్రకృతసన్మానము వెనుకటి మోటువిపరీతప్రవర్తనమునకుఁ గేవలము విరుద్ధముగనుండెనని కణతఁడు ఱిచ్చవడి చూచుచుండెను. నిశ్చలచిత్తుఁడైన సన్న్యాసి ఉపవాసాదికఠినవ్రతభూయిష్ఠజీవనమునఁ గృశీభూతుడైయున్నను, సహజగంభీరోదారసమున్నతమూర్తి. తల్లక్షణములు సాధుజనసహజవినమ్రతాచ్ఛాదనమున మఱుగువడినటులుండెను. జనులను పాలించుటకు నుద్భవించి, దైవసేవాపరాయణుఁడై మను దలంపున నిజరాజ్యపరిత్యాగమొనరించినవానివోలె నాతఁ డందు నడచుచుండెను. ఐనను, వాని యసాధారణశరీరౌన్నత్యము, దీర్ఘకేశపాశములు, గడ్డము, నిమ్నతను ధూర్తనయనతీక్ష్ణమును సన్న్యాసికిఁ గాక శస్త్రజీవికిఁ దగియున్నట్లుండెను.

సారసేనుఁడుగూడ సన్న్యాసియెడ నొకింత భక్తియుక్తుఁడైనట్టులే యుండెను. తన మిత్రుని శ్రవణమున నాతఁ డిట్టు లనెను—"హమాకో చిత్త మిపుడు బాగున్నది; కాని, మనము భోజన మొనరించువఱకు మనతోఁ బ్రసంగింపఁడు—ఇదియొక నీమము."

కావున మౌనవ్రతుఁడగు ఎంగాడీ స్కాచివీరుని గాంచి, యొక చతుష్పాదిపై నాసీనుఁడవు గమ్మని సన్న యొనరించెను. పేరు తన జాతి యాచారముచొప్పున నొక చాపలదిండుపై నాసీనుఁ డాయెను.

వారల కాయత్తపఱచిన ఆహారముల నాశీర్వదించువానివలె సన్యాసి తన చేతులెత్తి, నారిముందిడెను. మాటాడక ఓగిర మారగించుట సారసేనునకుఁ బరిపాటి. క్రైస్తవున కట్టి మితభాషణము క్రొత్తయైనను దెలిసికొని, నిజమనోభవాలోచనాధీనుఁ డాయెను.

తా నేమియుఁ జవిజూడకనే ఆ సాధు వటువేచి, వారి భోజనము ముగియుట గాంచి, ఉచ్ఛిష్టములు దీసివైచి, పర్బతు ద్రవపూరిత కలశము మేరునకును, మధుపాత్రము క్రైస్తవీరునకును ఒసంగెను.

"బిడ్డలారా! ఆస్వాదింపుఁడు—" అవియే ఆతని నోటినుండి వెలువడిన మొదటి పలుకులు,—"దైవము ప్రసాదించు పదార్థము లారగించి యాతని సంస్మరింపవలయు."

సన్యాసి అట్లు పలికి, తాను ప్రార్థన మొనరించుటకుఁ గావలయు నవ్వలగదిలోనికిఁ బోయెను. అతిథులు తా ముండిన తావుననే యుండిరి. కణతుని చిత్త మాందోళనమున కగ్గమాయెను. ఎంగాడీ ప్రవర్తన మాతనికి దుర్గ్రాహ్యముగ నుండెను. ఆతని యుదంత మరయవలయు కుతూహలమే గాదు, అట్టి యవసర ముండెను. ఎంగాడీస్వామి క్రైస్తవాన్వయదిగంతయశోవంతుఁడు; సర్వజనవంద్యుఁడు; క్రైస్తవ జగద్గురువై, తదంతరదేశములను సాధికారముగ శాసించు 'పోపు'ను, ప్రసిద్ధరాజన్యులును గూడ నాతని గారవింతురు. సన్యాసి వారలతో నుత్తర ప్రత్యుత్తరములు సలుపుచుండును. మహమ్మదీయులు క్రైస్తవయాత్రికులను బెట్టు బాములను విపులముగ నభివర్ణించి, లేఖలు విలిఖించి క్రైస్తవజగన్నేతల కాతఁడు మతావేశము రగులఁగొలిపెను. మఱియు, మహమ్మదీయుల మద మడంపఁ గృతనిశ్చయులై యరుదెంచిన క్రైస్తవనాయకు లాతనితో నానాక రహస్యాలోచన మొనరింపవలసి యుండెను. ఆ కార్యభారము వహించియే స్వామి యింకనూరుఁ డిట్టి దుర్గమమార్గము బట్టి, పడరాని పాటులు

పడి యేతెంచెను. సన్యాసి సలిపిన అతిథిసేవ ప్రశంసనీయము. కాని, మార్గమధ్యమున నాతని వర్తనము విరుద్ధముగ, విపరీతముగ, దుర్భరముగ నుండెఁగదా: నిక్కముగ నొక యున్మాదునివలె నాతఁడు చరించెను. చూచి చూచి అట్టివానితో నిగూఢతమ విషయాలోచనము తగునా?

చిత్రకలాంఛనున కేమియు దోఁపకుండెను. తన దౌత్య మెఱింగింపకుండుట యసమంజసము; ఎఱింగించుటయు నసమంజసముగనే యుండెను. విచారించి చూడ, తన సహచరుఁడగు పేరుకాఫున కాతఁడు పరిచితుఁడువలె నుండుటచేఁ జిన మిత్రుఁ డాతని సమాచార మెఱింగింపఁగలడని గ్రహించెను. సారసేనుఁడు సవిస్తరముగఁ దెలుపక పోయినను, ఇటు లొకింత నల్లనల్లనఁ దెలియఁబఱచెను—తొల్లి ఈ సన్యాసి ధైర్యసాహసములు గల యోధ: ఆలోచనయందుఁ గుశలుఁడు. మార్గమధ్యమున నాతఁడు చూపిన బలలాఘవములే ఆతఁ డొక శూరుఁడు కావలయునని చాటుచుండెను. ఎరూసలేమునగర మాతఁడు యాత్రాపరుఁడై చొచ్చినటులు కానరాదు—జీవితశేష మా పుణ్యభూమియందు వెడలించువానివలె నుండెను. అచిరకాలమున నా ప్రదేశము వీడి ఈ నిర్మానుష్యస్థలమున స్థావర మేర్పఱచుకొనెను. ఈతఁడు నిశ్చలభక్తుఁడని క్రైస్తవులు నుతింతురు; ఉన్మాదలక్షణములు గాంచి ఈతఁడు దైవప్రేరితుఁడు గావలయునని తురుష్కులు, అరబ్బులు గూడ గౌరవింతురు. ఇట్టివానినే తుర్కీభాషయందు 'హామాకో' యందురు: దాన నీ నామమునుగూడఁ బ్రసిద్ధమాయెను. ఆతని ప్రవర్తనము సారసేనునకుఁ గూడ దుర్గ్రాహ్యముగ నుండెను. ఒకప్పుఁ డాతఁడు పుణ్యజ్ఞానాదియుత్కృష్టవిషయముల గుఱించి గంటలు లెక్కలేక నిరుపమానముగఁ బ్రసంగించును. మఱియొకప్పుడు ఉన్మాదునివలె మెలఁగును: కాని, నేఁటియంత దారుణముగ నెన్నఁడు

రేఁగలేదు. ఆతని మత మెవ్వఁడేని యధిక్షేపించినచో, తత్క్షణము నితాంతకుపితస్వాంతుఁ డగును. అరబ్బు లొకసారి మొఱకులై యాతని నిలయము జొచ్చి, పవిత్రవంతమగు వేదిక నాశనపఱచిరి: తదవసర రౌద్రోద్రేకమున హుమ్మని హుంకరించి, బలిష్ఠదండము ధరించి, మోఁది, సన్యాసి వారి ప్రాణములు గొనెను. ఈ యమానుష కృత్యము దయమ్మున వ్యాపించెను. ఇట్టి భయానకఖ్యాతియు, దైవ ప్రేరితుఁడగు హామాకో యగుటయును ఈతని రక్షించుచును,—అనాగరికజాతులు గూడ భయభక్తియుతులై ఈతని జోలికిఁ బోకుందురు. మహమ్మదీయ సార్వభౌముఁడగు 'సలాఉద్దీను' శ్రవణపర్యంత మీతని యశము ప్రాఁకుటచే,—ఎంగాడీసన్యాసి గౌరవనీయుఁడు, రక్షణీయుఁడని—ఆ మహనీయుఁడు శాసించెను. అట్లు శాసించుటయేగాక, సలాఉద్దీను కుతూహలాయత్తచిత్తుఁడై—కుతూహలమే గాదు—ఇట్టి హామాకో భావికాలరహస్యము లెఱింగియుండునని కూడ నెంచి అనేక సారు లీతని చెంత కరుదెంచెను: ఉత్తను మహమ్మదీయ ప్రభువులు కూడ సందర్శింప నరుదెంతురు: సారసేనుఁడు మఱియు నిట్లు వక్కాణించెను—"ఈ యోగి నక్షత్రపరీక్షకై—ముఖ్యముగ గ్రహచలన పరిశీలనార్థము—ఒక సమున్నతాగారము నిర్మించెను. మానవుని చర్యలు గ్రహసంచారము ననుసరించి యుండుననియు, దాన రాఁగల విషయములు ముందుగ నరయనగుననియు మన మందఱము—క్రైస్తవులు, మహమ్మదీయులు, గూడ విశ్వసింతుము."

అమీరు పేరు చెప్పిన సారాంశ మయ్యది. కాని, సన్యాసి మతిభ్రంశము విపరీత మతావేశసంజనితమా, లేక, కేవలము తదుచిత లాభ సంగ్రహణార్థము తాల్చిన కపటప్రవర్తన మగునా, యని కణతుఁడు సంశయాకులుఁ డాయెను. ఐనను, మూర్ఖచిత్తులగు మహమ్మదీయు లాతనియెడ నంత సహనముగ నుండుట ఆశ్చర్యముగ నుండెను.

సారసేనుఁడును సన్న్యాసియు పరస్పరము చూపిన చనవు నిక్కముగ నధికతరమై యుండవలయునని క్రైస్తవుఁడు గ్రహింపఁజాలెను. మహమ్మదీయుని సన్న్యాసి మఱియొక నామమున సంబోధించెఁ గదా. ఈ సంగతు లన్నియు గమనించిన కణతుఁడు తాను భద్రముగ మెలంగవలయుననియు, తీవ్రపడి తన రహస్యము సన్న్యాసికిఁ దెలుప రాదనియు నిశ్చయించెను. అనంతర మాతఁ డిట్టు లనెను—"సార సేనా! భద్రము. ఈ సన్న్యాసి ఇతరవిషయములతోఁ బాటు నామములు గూడ తాఱుమాఱు చేయునే. నీ నామధేయము—షేరు కాఫు—మఱచి, ఇంకొక పేరున సంబోధించెఁగదా."

సారసేనుఁ డిట్లు బదులాడెను—"నా జనకుఁడు నన్ను 'ఇల్దరీము' అని చీరువాఁడు. ఈ నామధేయమె చాల ప్రసిద్ధము. నేను సమర కుశలుఁడ నగుటచే, 'షేరుకాఫు' అను అధిక నామము సంక్రమించెను—ఇయ్యది సైనికశ్రేణులందుఁ బ్రసిద్ధము—మాటాడకుము—హామాకో వచ్చె—మన మిఁక విశ్రమింపవలయునని హెచ్చరించును—రేయి యాతఁ డొనరించు ప్రార్థనాదికముల నెవ్వరు జూడ రాదు."

సన్న్యాసి నిజోరఘటితభుజుఁడై యరుదెంచి, వారిముందల నిలిచి, గంభీరస్వరమున నిట్టు లనెను—"నానాకార్యసంకీర్ణమగు దినము వెంట ప్రశాంతరాత్రము రావించిన ఆ పరమాత్ముఁడు, అలసి సొలసి యుండు శరీరమానసము లూఱట గాంచునట్లు నిశ్చల నిద్రాధీనుల నొనర్చు నా పరమాత్ముఁడు వందనీయుఁడు!"

వీరు లిర్వురు 'తథాస్తు' అనిరి. సన్న్యాసి తన హస్తచాలనమున సన్న యొనరించి సగౌరవముగ వెనుదిరిగెను. వా రంత శయ్యాపరులగు ప్రయత్న మొనరింపఁ దొడగిరి.

తన సహచరుఁడగు సారసేనుఁడు సాహాయ్య మొనరింపఁ జిత్ర

కలాంఛనుఁడు భారతరకవచమునుండి విముక్తుఁ డాయెను. వీరజన సామాన్యమగు మృదుల 'షామో' చర్మనిర్మితవస్త్రములు మాత్ర మాతని దేహమున కంటియుండెను. క్రైస్తవుఁడు కవచధారియై యుండినపుడే ఆశ్చర్యచకితుఁడైన సారసేనుఁ డాతని వివిధాంగసౌష్ఠవము, అమేయమగు నా శరీరపటుత్వమును గాంచి మఱియు నక్కజపడెను. అట్టులే క్రైస్తవుఁడు నిజమిత్రబాహ్యవస్త్రవిసర్జనకార్యమునఁ దోడ్పడి, ఆతని యల్పశరీరము గాంచి, అట్టివాఁడు తనతోడి కలహమున నంతటి జవసత్వము లెట్లు జూపింపఁజాలెనో యని వెఱగందెను.

వీరు లిరువురు దైవమును సంస్మరించుకొని, అనంతరము శయ్యలఁ జేరఁబోయిరి. మహమ్మదీయుల కత్యంత పవిత్రవంతమగు 'కాబా' దిక్కు మోము ద్రిప్పి, సారసేనుఁడు మంద్రస్వరమునఁ దన దైవప్రార్థన మొనరించెను. మ్లేచ్ఛుని చెంత నుండుట దోషావహమని తలంచి క్రైస్తవుఁ డొకింత దూరమునకుఁ దొలఁగి, సిలువవంటి పిడిగల తన మేటిఖడ్గము నిలువబెట్టి, అదియొక ముక్తిసాధనమో యన నాప్రమోల మోఁకరించి, తద్దినప్రమాదపరంపరస్మరణ ప్రవర్ధమాన భక్తిపారవశ్యమున జపమాల ద్రిప్పెను. అనంతరము, మార్గాయాసమునఁ దూలిన యోధులు రయమ్మున గాఢనిద్రాపరు లైరి.

## ౪

తా నెంతకాలము మైమఱచి నిద్రించెనో స్కాచిశూరుఁ డెఱుంగఁడు. అంత నాకస్మికముగఁ దన యురము క్రుంగినటు లాయెను; తోడనే యాతఁడు మేల్కాంచెను. తా నొక బలాఢ్యునితోఁ బోరి రోఁజు

చుండినటు లాయెను. కల కావలయు కాని హృదయపీడన మింకను నడంగకుండుటచే నది స్వప్నమని యూరకుండఁజాలక యెవ్వరని ప్రశ్నింపఁబోయి యంతలోఁ గనువిచ్చి చూచునంతనే యెంగాడీ స్వామి భీషణాకృతి భయంకరముగ నాతనికిఁ గాన్పించెను. స్వామి దక్షిణహస్తము శూరుని వక్షముపై నుండెను; వామహస్తమున నొక వెండిదీపముండెను. కణతుఁడు వెఱగందిచూడ నాతఁ డిట్లు హెచ్చరించెను—

"మాటాడకుము. ఆ మ్లేచ్ఛుఁడు వినరాని విషయము నీకు జెప్పవలయు."

'క్రూసేడు' లనఁబడు మతయుద్ధము లొనరించుటకై ఐరోపాఖండమునందలి నానాదేశస్థులు, నానాభాష లాడు జనులు మహమ్మదీయదేశమునకరుదెంచుచుండిరి. కావున నాయాదేశస్థులును మహమ్మదీయులునుగూడ గురుతింపఁగల యొక సామాన్యభాష క్రమముగా నేర్పడెను. వారందఱాప్రాంతమునఁ గూడునప్పు డాసామాన్యభాషయందే పరస్పరము భాషింతురు. అంతవఱకు నాభాషతోడనే ప్రసంగించిన సన్యాసి ఇపుడు ఫ్రెంచిభాషలో మాటాడెను. ఆతఁడు మగుడ నిట్లు లనెను— "లెమ్ము. పెదవి గదల్పక ఉత్తరీయము వైచుకొని నిశ్శబ్దముగ నావెంట రమ్ము."

కణతుఁడు తోడనే లేచి ఖడ్గముదాల్ప సన్యాసి ఇట్లు వారించెను. "శస్త్ర మనవసరము. మనము పోవుతావున జ్ఞానశస్త్రములు గావలసియుండు. భౌతికాయుధములు కేవలము నిరర్థకములు."

శూరుఁడు ఖడ్గము వీడియే ఆ వింత సన్యాసిని వెంబడించెను. తదపాయమయదేశమున నెప్పుడు వీడని బాకుమాత్ర మాతఁడు ధరించియుండెను.

అంధకారమున నిశ్శబ్దముగ స్వప్నభవ వ్యక్తియో యన నల్ల

నల్లనఁ బ్రాఁకు సన్యాసివెంటఁ గణతుఁడు నట్టులే పోయెను. నిద్రాధీనుఁడగు మ్లేచ్ఛుఁడు లేవలేదు. ఒక వేదికయు సిలువయు నున్న మొదటి గదియందు రక్తసిక్తమగు నొక చబుకుండెను. ఆహా! ఆ కొరడా సన్యాసి కఠిన ప్రాయశ్చిత్తమునకు నిదర్శనము! వాడియైన పరుషశిలాఖండము లొకచో నుండెను. తాను ధ్యాననిమగ్నుఁ డగు నపుడు నిర్బాధకముగ నుండరాదని యెంచి కాఁబోలు ఆతఁడు వాని మీఁదనే మోఁకరించును. ఎంగాడీ ప్రకృత మట్టులే యచట మోఁకరించి శూరునిఁగూడ నట్టులే నియోగించి ప్రార్థించి తదవసరావేశమునఁ బాష్పలోచనుఁడై నిట్టూర్పులు పుచ్చుచు తీవ్రప్రకంపమానశరీరుఁడై మూఁడు ప్రాయశ్చిత్తపూర్వకగీతములు పాడెను. తానుగూడ ప్రార్థన సలుపుచు నా చర్య యంతయుఁ గలకించు కణతునియభిప్రాయము మాఱవలసివచ్చెను. ఆతఁ డొక ఋషిసత్తముఁడుగావలయునని కణతుఁడు తలంపవలసినవాఁ డాయెను. తాము నేల నుండి లేచినంతనే ఆతఁడు గురువర్యు ప్రోలనుండు శిష్యునివలె భక్తిపురస్సరముగ వినమ్రుఁడై సన్యాసి యెదుట నిలుచుండెను. ఆసాధువు మాటాడక కొన్ని నిముసము లట్టులె యుండి అనంతరము దవ్వున నున్న యొకమూల జూపి యిట్టు లనెను—కుమారా! ఆ గూటియం దొక తెర యుండు, గొని రమ్ము."

ఒకమూలఁ జిన్న తలుపువలె నమరియున్న యొక్క తడకయుండెను. తదంతరవివరమున నున్న తెరదీసి పీఁకుఁ డాతని కొసంగెను. అయ్యది జీర్ణించి నల్లని డాగులతో నిండియుండెను. దానిం గాంచినంతనే అతఁడు దురంతచింతాప్రకంపితుఁడై వారింపఁ గడంగియు తద్దుర్భరోద్రేకము పూర్తిగ వారింపనేరక ఒక్కసారి మూల్గెను—

"కుమారా! ఈ భూమిపైఁ గల నమూల్యధనము నీవు దర్శింపఁ గలవు. నేఁ బాపాత్ముఁడ. నా నయనము లంతటిభాగ్యము నోచుకొన

లేదు. ఆహా! పథశ్రమమున సంకటపడు పాంథునకు సురక్షిత విశ్రామాగారము జూపుటయేగాని ఈ హతభాగ్యుఁడు నిరంతర మవ్వలనే యుండవలయు. చొరరాని శిలాంతరములు జొచ్చితి—ఈ నిదాఘ వాలుకాగర్భమునకుఁ బాటితిని—వృథాశ్రమ—!"

సన్న్యాసి యొక నిముష మూరకుండి స్థైర్యము వహించి ఒకింత నిశ్చలస్వరమున నిట్లు లనెను—"ఆంగ్లేయ నృపాలుఁడు—రిచర్డ్—ని న్నంపెఁగదా?"

"ఆర్యా! నేను క్రైస్తవరాజన్య సభానియుక్తుఁడ. రిచర్డు స్వస్థత సెడియుండుటచే నా మహనీయుని యనుజ్ఞ వడయఁజాలకపోతిని."

"సాంకేతికము?"

సన్న్యాసి యట్లు ప్రశ్నించినంతనే కణతుని చిత్త మొక్కసారి గతానుమానఘూర్ణితమాయెను. ఆతని తొల్లిటి యభావచేష్టలు వీరుని మానసమున వడివడి బరువెత్తెను. ఐనను ప్రకృతప్రవర్తన సర్వోత్కృష్టముగ నుండుటచే నాతఁడు శంకవీడి తన యథార్థత తెలియునట్లు సంకేతపద మిట్లు తెలియఁబఱచెను—"రాజులు అర్థి నర్థించిరి."

సన్న్యాసి సంతసించెను—"బాగు. కుమారా! నిన్ను నే నెఱుంగుదు; ఐనను దౌవ్వారికుఁడు మిత్రుని శత్రునిఁగూడ బ్రశ్నింపవలయు". అట్లుపలికి రజతదీపహస్తుఁడై దారి జూపుచు దాము మగిడినగది నాతఁడు మగుడఁ బ్రవేశించెను. సారసేనుఁడు గాఢనిద్రాపరుఁడై అట్టె పడియుండెను. ఐనను సన్న్యాసి యట నిలిచి వంగి తురుష్కునిఁ బరికించి సందేహము దీర్చుకొనెను—"ఈతఁ డీయంధకారమున నిద్రించువాఁడు. లేపరాదు."

అనంతర మాసన్న్యాసి వేదికవెనుకఁ బోయి ఒక మర నొక్కెను. అయ్యది నిశ్శబ్దముగ విరియ నందొక యినుపతలుపు గోచరించెను.

ఎంతయో సపరిశీలనముగ జూచినగాని ఆ లోహకవాటము కాన రాదు. తెలుచునప్పుడు సవ్వడియగునని వెఱచి తన దీపమునందలి తైల మాత్రఁడు రెండు బిందువులు గ్రంథులఁ బోసి త్రోలెను. వివృత ద్వారమున శిలాసోపానపరంపర గోచరమాయెను. అంతఁ దన యను చరునిఁ గాంచి విషాదస్వరమున నాతఁ డిట్టు లనెను—

"నేఁ బట్టు తెరదాల్చి నా నయనములు బంధింపుము. నీ విపుడు గాంచు భాగ్యము నేఁ జూడరాదు."

కణతుఁడు మాఱాడక అట్టులే యొనరించెను. ఆ కారణమున నంధుఁడయ్యు జూచినట్టులే సన్యాసి మెట్టు లెక్కఁదొడంగెను. ఆతఁడు కణతునకు దీపము జూప నాతఁ డాసన్నని సోపానములు గడచు చుండెను. కొంతదూరమున నావగున యంతరింప నింకొక వంక నింకొక వరుస ప్రత్యక్షమాయెను. మూడవవంక నొక ద్వారము స్తంభయుతమై మోటురకపు నగిషీలతో నుండెను. అందుండు దిడ్డి అయోపరిరక్షితమై మేకులతోఁగూడ నిండి దిట్టముగ నుండెను. సన్యాసి తడఁబడుచు నంతవఱకు నేతెంచి యట నిలిచి ఇట్టు లనెను. పాదరక్షలు దీసివేయుము. ఈ తావు పవిత్రవంతము. దుష్టతలంపులు వర్జించి నిశ్చలచిత్తుఁడవు గమ్ము."

కణతుఁ డట్టు లొనరించెను. సన్యాసి యంతలో ధ్యాననిమగ్నుడై, వెండియు దెలివొంది ఆ దిడ్డిగుమ్మమున మూడుసారులు తట్టవలయు నని నియోగించెను. వీరుఁ డట్లు లాచరించినంతనే ఆ ద్వారము తత్క్షణము వీడిపోయెను. తలుపోకరు తెఱచినట్లు కానరాదు; తనంత దానే వివృతమైనట్టులు తోఁచెను. తదంతరమందిర సుగంధబంధుర దీపనిర్గతామలకాంతులు తోరంబుగఁ బైకొన శూరుఁ డోహటించెను. అంతదనుక నంధకారమునఁ బొరలాడిన నయనములు సహజముగ మిఱుమిట్లు గొనెను.

ఒకటిరెండు నిమిషములలోఁ గండ్లు నేదదేఱ కణతుఁడు మందిరాంతర్గతుఁ డాయెను. అదియొక ప్రార్థనాగారము. వెండిదీపము లనేకములు రజితరజ్జువుల వ్రేలాడుచు మనోహరసౌరభములు వెదజల్లుచు దేదీప్యమానముగ వెలుంగుచుండెను. ఆ మందిరముగూడ కఠిన ఘన శిలాఖండము దొలచి తయారుచేసినదె. కాని బాహ్యాంతరనిర్మాణములకు వ్యత్యాసము లేకపోలేదు. మొదటిప్రదేశమునందలి పనితనము మోటుగ నేదియోయొక విధమున నుండెను. ఈమందిర మటుగాక తన్నిర్మాత శిల్పనైపుణ్య మింపుగ వ్యక్తపఱచుచుండెను. అందలి పండ్రెండు స్తంభములు రెండు వరుసలుగ నేర్పడియుండెను. ధనుర్మయమగు కప్పు సముచితాలంకృతమై అపూర్వ శిల్పకళానిలయమై కడు శోభాయమానముగ నుండెను. స్తంభములుగూడ దర్శనీయములు. ప్రతి కంబమునందు నొక విశాలవివర మేర్పడి అద్భుత శిల్పముతో నిండి ఒక్కొక క్రీస్తు శిష్యవిగ్రహమున కాలవాలమై యుండెను.

తదాలయమునఁ దూర్పుదెస నొక వేదిక కలదు. ఆ వెనుక బెరసియూదేశపు వెలలేని పట్టుతిరస్కరిణి సాంద్రతర కనకవల్లరీ విరాజితమై యొక గూడు నంటియుండెను. అందొక పరమపవిత్ర విగ్రహముండవలయు—తదాలయమున నారాధించు మూర్తి కావలయు. కణతుఁ డట్టులే భావించి ఆ దివ్యపీఠము డాసి మోఁకరించి అధికతరావేశమునఁ బ్రార్థన మొనరింపుచుండ నచటి కాండపట మెట్టులో యొక ప్రక్కకుఁ దొలఁగెను; కణతుఁడు చలించెను. తెర యెట్లు సడలెనో ఎవ్వరైనఁ గదల్చిరో తెలియకుండెను. గూటియందు వెండిమయమగు నల్లని బీరువ యొకటుండెను. దానికి రెండు మడత తలుపులమరి అంతయు నొక సూక్ష్మదేవాలయమువలె నుండెను.

శూరుఁడు తిచ్చవడి చూచుచుండ నా కవాటములుగూడ విడి

పోయెను. అందు ‘నిక్కంపుసిలువ’ యని చెక్కిన దారుఖండము దృగ్గోచరమాయెను. ఆ ముహూర్తముననే దైవగీతాలాపమగ్న వనితాజనకంఠస్వనము వీనులఁ బడియెను. పాట ముగిసెను. తోడనే ఆ తలుపులు మూఁతవడెను. ఇంకను వంగియే యున్న శూరుఁడు తాఁ గాంచిన పవిత్రచిహ్నము సంస్మరించి నిశ్చలముగ బ్రార్థన సాగింప వచ్చెను. తా నొక పవిత్ర గంభీరసత్య మొండు జూచితినని దృఢముగ విశ్వసించి ప్రార్థన ముగించి లేచి యాతఁడు సన్యాసికొఱకు జుట్టును బరికింప సాహసించెను. సన్యాసి ద్వారముచెంతనే యట్టులే యంధప్రాయుఁడై దండితతాడితశ్వానమువలె దైన్యముగఁ బడియుండెను. అపారభక్త్యనుతాపము లానిస్సంగునియందుఁ గాన్పించుచుండెను. ఎంగాడీస్వామి దుర్భరచింతాభరమ్మునఁ గ్రుంగిపోయినటులుండెను. అట్టిబలోద్ధతుఁడు, అట్టి యున్నతచిత్తుఁడు, అట్టితీవ్రస్వభావుఁడత్యధిక నిర్వేదావమాన పశ్చాత్తాప సంక్షుభితుఁ డైనగాని యిట్టి విపరీతదైన్యావస్థకుఁ బాల్పడఁడని కణతుఁడు భావించెను.

ఏమియో మాటాడువానివలె శూరుఁ డాతని డాసెను. వసననిబద్ధశిరస్కుఁడగు సన్యాసి జాడగట్టి దుప్పటి గప్పిన ప్రేతమువోలె నూపిరిరాని మర్మరస్వరమున నవ్యక్తముగ నిట్లు లనెను—“భాగ్యవంతుఁడా! నిలు. నిలు—దివ్యదృశ్య మింకను గలదు.” సన్యాసి తోడనే లేచి లోపున నమరిన మఱచే మందిరము ప్రతిధ్వనించి బిగియునట్లు కవాటము వైచెను. తత్కవాటాకార మావంతయుఁ గానరాకుండుటచే నేకాకియగు కణతుఁడు విస్మయపరవశుఁ డాయెను. ఆ తలు పంత చక్కగ నమరిపోయెను. కణతుని చెంత నొక బాకుతప్ప ఇతరాయుధములు లేవు: పవిత్రచింతనము అప్రతిహత ధైర్యమును మాత్ర మాతని సహచరులు.

అట్టి విపరీతప్రదేశమున నింక నేమి సంభవమగునో యూహించు

టసాధ్యము. ఏమైనను గనిపట్టియుండవలయునని నిశ్చయించి కోడి కూయుకాల మాసన్నమగువఱకు నాతఁడప్రమత్తతతో నా నిర్మానుష్యాలయమున నట్టిట్టు తిరుగాడెను. నిశ యుషఃకాలము నొరయు నాసమయమున నెటునుండియోగాని ఆకస్మికముగ వెండి చిఱుగంట యూతని వీనులం బడెను. సమయము స్థలము నట్టి వగుటచేత నాతఁడు వెఱపెఱుఁగని వీరుఁడయ్యు నా ముహూర్తమున నొక మూలకుఁ బోయి అనంతర మేమగునో చూడఁగోరెను.

అచిరకాలమునఁ బొల్లిటి పట్టుతెర మగుడ సడలెను. ఆ పవిత్రాక్షరపంక్తియు గోచరమాయెను. కణతుఁడు భక్తిపరుఁడై మ్రొక్కరించినంతనే నారీజనగీతారవము మగుడ శ్రవణపేయముగ వెలువడెను. ఆ కంఠము లొక్కతావుననే నిలిచియుండక ఉచ్చతరమై క్రమముగ సమీపించుచుండెను. తాను ప్రవేశించిన ద్వారమువంటి కంటికిఁ గానరాని కవాట మాయెదుట వివృతమాయెను. తోడనే ఆ గానారవము ధనుర్మయాలయము జొచ్చి వెల్లివిరిసెను.

తన్నిలయమోచితముగ మ్రోఁకరించి చింతానిమగ్నుఁడై యూకమ్మనిసవ్వడి గనిపట్టు కణతుఁడు అట్లు సంభవ మగు ననియే యోచించి ఊపిరి తీయరాని తత్తరపాటున దృష్టి నటు నిగిడించియుండెను. సుందరాకారులగు నల్వురు బాలురు వెలువడిరి. అనాచ్ఛాదితములగు నా బాలభుజకంఠకరములు సహజధవళిమవీడి ప్రాచ్యదేశప్రభావమునకు సాక్షీభూతముగఁ గపిలవర్ణమున నలరారుచుండెను. వారు తాల్చిన హిమసన్నిభవస్త్రములవలన నావర్ణలోపము మఱియు వ్యక్తముగ నుండెను. ఆ డింభకులు రెండు జతలుగ వచ్చిరి. మందిరాంతరసుగంధములు మఱియు నతిశయించునట్లు ముందువరుస బాలకులు మనోహరధూపహారతులుత్రిప్పుచుండిరి. రెండవజతివారలు పుష్పములు వెదఁజల్లిరి. ఆవెనుకఁ బండ్రెండుగురు స్త్రీలు సక్రమగంభీరగమ

నమునఁ బ్రవేశించిరి. అం దాఱుగురు కోమలాంగులు ధవళవస్త్రములు దాల్చి ఆపైని నల్లని ముసుఁగులను వహించిరి. వారు నిస్సంగసన్యాసినీ జనము గావలయు. మిగిలినవారి ముసుంగులుగూడ వస్త్రములవలె దెల్లగనే యుండుటచే గరిసనన్యాసినీ వ్రతావలంబనార్థము వారు కొ్రొత్తగ నరుదెంచియుందురు: లేదేని మొక్కిన మొక్కులు సెల్లించుకొనుట కేతెంచియుండవలయు. సన్యాసినులు జపమాలికా కీలితహస్తలు: ఇతర తరుణీకదంబము శ్వేతారుణ రోజాపుష్ప మాలికాదీపితపాణులు. వారందఱు నాలయమునఁ బ్రదక్షిణ మొన రించిరి. తద్వనితాజనచేలాంచలములు శూరుననుఁ దగులునంత దగ్గఱగఁ బోయినను వా రాతనిఁగాంచినట్లు తోఁపకుండిరి. కణతుఁడు విచారాయత్తచిత్తుఁడై తా నొక యభిజాత్యకన్య సన్యాసినీమఠమున నుంటినేమొ యని భ్రమించెను. అట్టి ఆలయములు పాలస్థానమునఁ బెక్కు లుండినను మహమ్మదీయులు విజృంభించినపిదప నంతరించెను. ఐనను కొందఱు పాలకుల నెట్టు లెట్టులో ప్రసన్నుల నొనరించుకొని కొన్నింటిని నిలుపఁజాలిరి. కాని కణతుని చిత్తము ప్రకృత మింకొక తీరునఁ బోయెను. నిశ్శబ్దనిర్మానుష్యపవిత్రస్థలంబున మెఱపు మెఱసిన చందమున నుదయించి కలస్వనమున గీతాలాప మొనరింపుచు తనుఁ గానక పరిభ్రమించువారలు అమరాలయమున జరించు మేళము గా నొప్పునని యాతఁడు తదవసరవిపరీతవిస్మయాతి రేకమున భ్రమించెను.

ఆ స్త్రీలు నడచునట్లు కానరాకుండిరి. వారు నడవకనే యల్లన నరుగుచుండినట్లు కణతున కా ముహూర్తమునఁ బొడగట్టెను. ఆతఁ డింకను మోఁకరించియే యుండెను. అంతలో వారు రెండవసారి ప్రదక్షిణించిరి. ఆసమయమున—.ఆ వీరుని దాఁయు ముహూర్తమున నొక పూర్ణశ్వేతాంబరి తన మాలికయందలి యొక్క మొగ్గ దీసి యచట జారవిడిచెను. అయ్యది అప్రయత్నముగ సంభవించెఁ గాఁ

బోలు. ఏమైనను ఆ రోజామకురము తన పాదమునఁ బడ, శూరుఁడు శరహతునివలె నగరెను. చిత్తము చింతావేశపూరితమగునప్పు డెంతటి యల్పవిషయమైనను ఆకస్మికముగఁ దటస్థమగునేని, అట్టు లధీరమగుట సహజముగదా. అదియొక క్షణికము. ఆ రెండవక్షణముననే యాతఁడు తెలివొంది సహజగాంభీర్యము వహించెను.

మూఁడవ ప్రదక్షిణము ప్రారంభమాయెను. మొగ్గ విడిచిన మగువ వెంటనే కణతుని దృష్టి పోవుచుండెను. దృష్టియేగాక ఆతని మానస మువాఁడ నట్టులే పాఱుచుండెను. ఆకాంత పదము, వదనము మూర్తియు నితరస్త్రీలతో మేళవించి అచ్ఛముగ నొక్కతీరున నుండుటచే నొక వ్యక్తిత్వము తోఁపకుండెను. ఐనను, నిజహృదయప్రేరణమున, ఆ రెండవ శ్రేణియందలి రెండవవ్యక్తి, ఇతరులకంటె మాత్రమే గాక, స్త్రీజాతి యందఱికంటెను గూడఁ దనకుఁ బ్రియతరమని శూరుఁడు గ్రహించెను. అట్లు గ్రహించిన కణతుని హృదయము తదభిప్రాయమును ధృవపఱచుకొనుటకై పంజరము ఛేదించుకొని పోఁ జూచు పక్షివలెఁ దత్తరపడెను. ప్రేమయును చిత్రవిచారమునకు భక్తియును దదుచితముగ దోహదమగును. ఆ రెండును బరస్పరవినాశకరములు గాక, పరస్పర ప్రవర్ధమానములై యుండెను. శూరధర్మము పూర్ణముగ వెలసిన యాకాల మట్టిది. ఆ తావునఁ బ్రదక్షిణ మొనరించు కాంతారత్నములలో నెయ్యది రోజామకురము బడవైచెనో యాపె తనయునికి స్పష్టతరమగునట్లు మగుడ నొక నిదర్శనముం జూపునని శూరుఁడు విశ్వసించెను. ఆతని విశ్వాసమె దృఢతరమై, మతావేశసన్నిభముగ నుండెను. శూరుని మొదలంతయు నితాంతోత్సాహ ప్రకంపిత మాయెను. అంతలో నా యింతుల తృతీయపరిభ్రమణము ప్రారంభమాయెను. రెండవ ప్రదక్షిణ మైనంతనే మూఁడవది ప్రారంభమైనను, కణతున కొక యుగమువలె నుండెను. ఎట్టకేల

శావనితాకదంబము సన్నిహితమాయెను. కణతుని చిత్తమును గలంచు జవ్వని యితరకాంతలవలెఁ బూర్ణవసనాచ్ఛాదితశరీరయై యుండెను. ఐననేమి? శూరుని డాసినంతనే యా మోహనాంగి మనోహరకరాబ్జము గ్రీష్మనిశామేఘనిర్ముక్తశీతలసుధాకరకిరణము భాతిఁ దెరనుండి వెలువడి, మగుడ నొక గులాబీముకురము బడవైచెను.

ఈ మొగ్గయుఁ బ్రమాదవశమునఁ బడియుండునా? అసంబద్ధము. ఆహా! ఒకింత తోఁచిన యీ కమ్రతరకరాబ్జము తొల్లి తా నొకసారి యధరస్పర్శన మొనరించి, రహస్యముగ హృదయార్పణ మొనరించిన మోహనాంగి కోమలపాణి పల్లవమువలె నుండెను. మఱియొక నిదర్శనము వలయునేని, ఆ తుషారసన్నిభకరాంగుళదీపితాపూర్వపద్మరాగోర్మికచాలును. ఆ యున్నమిన్న మేలిముసుఁగున నడంగియున్న నల్లని నెఱికురులయం దొక్క నీలంపుటుంగరము భాగ్యవశమునఁ గానుపించినఁ జాలును,—మహత్తర సువర్ణపాశముకంటె నా మేల్బంతి కేశపాశ మొక్కటి శతాధికప్రియతరము. ఆమె నిక్కముగ శూరుని హృదయరాజ్ఞి! కాని, అట్టి కాంతామణి ఇట్టి నిర్జనారణ్యసీమ నుండనేల? జను లుండు నాలయములఁ బ్రార్థనలు చేయుటకు సాహసము చాలక ఇట్టి యేకాంతసీమల కేతెంచు కన్నెలతోఁ బాటు చరింపనేల? కణతున కేమియు దోఁపకుండెను. ఒక కలవలె నుండెను. కలయో నిక్కమో తెలియకుండెను. శూరుఁడు తాదృశాలోచనమగ్నుఁడై యుండ, నా స్త్రీకదంబ మరుదెంచిన ద్వారముననే మాయమాయెను. శూరుని చిత్తము గలంచిన జవ్వని యంతర్ధానయగు సమయమున, నాతనివంక నానన మొకింత త్రిప్పెను. ఆక్షణముననే ఆ మేలిముసుఁగు మఱి కానరాకుండ పోయెను; తోడనే శూరుని చిత్త మంధకారబంధురమాయెను. అంధకార మలంకారప్రాయము మాత్రమే గాదు— కణతుఁడు నిక్కముగ నంధకారనిర్మగ్నుఁ డాయెను. స్త్రీజన మంత

రించినంతనే తత్కవాటము పెద్దరవ మొనరించి మూసుకొనెను; గీతాలాప మంతరించెను; మందిరాంతర దీపకాంతియు నాక్షణమ యంతరించెను; అంధతమసమున శూరుఁ డొక్కఁడే యుండెను. కాని, ఆతఁ డయ్యంధకారాదుల నేమియు నెఱుంగఁడు. నిజాభిమాన సూచితచిహ్నములు వీడి యల్లనల్ల నంతరించిన స్వప్నసన్నిభసుమతీ స్మరణైకచిత్తుఁడై యాతఁ డన్య మెఱుంగఁడాయెను. ఆ కడానిబంతి జారవిడిచిన మొగ్గలకొఱకు చీకటియందుఁ దడిమి, కండ్ల కద్దుకొని, వానిని హృదయమునకు హత్తించి, మఱల మఱల నట్లు లొనరించి, ఆ కోమలచరణ మెట్టిన తావుల వెదకి వెదకి శీతలపాషాణముల మఱి మఱి ముద్దాడి, వీరుఁడు స్వీయమనోభవలోకమునఁ బొరలాడఁదొడగెను. ప్రేమోన్మత్తు లిట్టి యభావచేష్ట లొనరించుట సహజముగదా. ఏకాలమునందైన మానవస్వభావ మిట్టులే యుండు. కాని, శూరధర్మము ప్రబలియుండిన ఆయుగమున, శూరుఁ డెంత పరవశుఁడైనను, తత్కన్యాన్వేషణార్థము వెన్నంటియరుగుట పాడిగాదు; అట్టి ప్రయత్న మొనరింపఁ దలంచుట శూరధర్మవిరుద్ధము. ధ్యానపరుఁడగు తన భక్తునిపైఁ గరుణగొని యేకక్షణమాత్రదర్శన మొసఁగు దేవతను వలె, మంచి ముహూర్తమున నొక్క శుభకిరణము బర్వఁజేసి తోడనే తెలిమబ్బు తెరమఱుఁగున కరుగు దివ్యగ్రహమునువలె నాఁటి శూరుఁడు తా వలచు కన్యను విపరీతగౌరవముతోఁ జూచును. శూర హృదయపీఠము నధిష్ఠించు లావణ్యవతి కాన్పించునప్పు డాతఁడు సంతసించును. కానరానప్పుడు విషాదమగ్నుఁ డగును; ప్రసన్న యగు నప్పు డుత్సాహవంతుఁ డగును. క్రూరచిత్తయై కారించునప్పుడు దుర్భర విషాదావేశబాధితుఁ డగును — కాంత యీ తెఱఁగున హృదయ స్వాతంత్ర్యము పూర్తిగ ననుభవించును. శూరుఁ డెట్టి నిరోధమైనను గల్పింపనేరఁడు. శూరుఁడు నిరంతరము నిజహృదయరాజ్ఞీసేవాపరా

యణుఁడై, శస్త్రహస్తుఁడై, సాహసకార్యరచనాసమర్థుఁడై, తనకును, దాఁ బూజించు దేవతకుం గూడ యశోపార్జన మొనరింపవలయును.

నాఁటి శూరధర్మము లట్టివి—తదంతర పరమసూత్రమగు ప్రణయ తత్త్వము నట్టిది. కాని కణతుని బంగము మఱియుఁ జిత్రమైనది. తన ప్రణయకాంత కంఠస్వర మాతఁ డెన్నఁడు నాలించి యెఱుఁగడు. పలుసారు లామె సౌందర్యము మాత్రము గాంచి, యుప్పొంగెను. ఆకాంత సాధారణవంశోద్భవ కాదు. శూరశ్రేణికిఁ జెందువాఁడగు కణతుఁడు తద్గౌరవము బురస్కరించుకొని ఆమె కుటుంబవలయము డాయవచ్చును గాని, చన వూని కలసి మెలసి యుండ రాదు. సాహస పరాక్రమములం దాతఁ డెవ్వనికైనఁ దీసిపోవనివాఁడయ్యు నెంతటి రాజాధిరాజనందనునైన నాసింపఁజాలినవాఁడయ్యు, నాతఁ డాకాంతను దేవతనుబోలె దవ్వున నుండియే ఆరాధింపవలసినవాఁ డాయెను. కాని, కాంత ఎంతటి గర్వితమతియైనను, ఎట్టి మహోన్నతకులప్రసూత యైనను, హృదయ మర్పించి తదావేశమున సేవాపరాయణుఁడగు ప్రణయుఁడు హీనకులసంజాతుఁడని నిరసింపఁజాలునా? కణతశూర చిత్తాపహరణదక్షయగు నా సుందరీమణి, ఆతఁడు వ్యాయామక్రీడా రంగమునఁ బ్రదర్శించిన యద్భుత బలపరాక్రమములు గాంచి, రణ రంగమున నా మేటిమగఁడు జూపు శూరకృత్యము లాలించి, యలరి, తనకై సాహసము లొనరింపుచుఁ బెనఁగులాడు రాజన్యులను శ్రీమంత శూరజనంబులనుగూడ నాదరింపక, నిర్ధనచిత్రకలాంఛనునకై ప్రసన్నురా లాయెను. తొలుదొల్త నాకాంత హృదయ మయిష్టముగ, తత్త్సా వేశమున నటు పాఱియుండును; నిర్నిమిత్తముగ, దా నెఱుంగక పాఱియుండెను. కాని, ఆ శూరవరుని గాంచిన యనంతరము, కాంచి యాతని నిర్వక్రయోధకార్యకలాపము చారణులవలన నాలించిన యనంతరము మక్కువ నిక్కముగ నేర్పడెను. ఈ స్కాచివీరుని వీర

కథన మాలించు సమయమున నాంగ్ల సైనిక శిబిరమున నుండు సిబ్బితి కత్తెలు సహితము సిగ్గు నభినయింపక ఆతని సూపురేఖాభివర్ణనము విని సంతసింతురు. రాజులు సామంతులును చారణులకు విశేష ధన మొసంగుదురు: ఐనను, వారు స్వీయహృదయ స్వాతంత్ర్యము గోల్పోవరు. శూరుఁడు తమపై ధనవృష్టి గురిపింపఁజాలకపోయినను, అనితర సాధ్య సాహసకృత్యము లొనరింపఁ జాలునేని, వానినే యెక్కుఁడు నుతియింతురు.

ఆంగ్లేయనృపాలుఁడగు రిచర్డునకు 'మేరీ' కన్య సన్నిహితబాంధవి; ఇరువురు నేకవంశసంభవులు. రాజమందిరావాస మొనరించు నా కన్నియ తన పరిచారికలు నిరంతర మొనరించు ముఖస్తుతితోయ ములఁ దొప్పదోఁగి, విసిగి వేసారి, శూరకణతుని శూరకృత్యకలా పాలాపశ్రవణమున సేద దేఱెను. ఆయసాధారణశూరుని చర్యలే గాక, సామంతవంశజులగు శూరుల చెయ్దములు గూడ నామె యాలించును. కాని, కణతుఁడే స్మరణీయుఁ డాయెను. ఆతఁడును దనయెడ బద్ధాను రాగుఁడై, సేవాపరాయణుఁడై యుండెనని ఆమె అరయఁజాలెను.

మేరీకాంత ఉదారచిత్తయై తన హృదయము నాకర్షించిన వీరుని రహస్యముగఁ బ్రేమించెను. ఆతఁడు మాటాడకుండనే, మేరీ హృద యము రంజిల్లు సాహసకార్యములు నిరంతర మొనరించుచుండెను. ఆకాంత ఆనందించియు, విషాదానలతప్త ఆయెను. కారణ మేమి? ప్రణయిప్రణయు లన్యోన్యానురాగబద్ధులయ్యు, దేశకాలసాంప్ర దాయము లుల్లంఘింపనేరరు. రాజకన్యయగు మేరీ నిజవంశోన్నత పరివేషపరిరక్షితయై, పేద స్కాచివీరున కందని ప్రూనిపండై యుం డెను. ఇంద్రజాలకుఁడు లేపిన దయ్యము ఆతఁడు గీయు గిరిదాటి పో నేరని తీరున, ఈ కణతుఁడు సంప్రదాయపరికల్పిత పరివేషము ఛేదించి పోనేరఁడు. ఆ తలంపు మేరీకాంత మానసము నెరియింపఁ దొడఁగెను.

వినయమార్దవ గుణభారమున వెనుకవెనుకలనే యుండు నాశూరుఁడు నిజమనోరాజ్ఞీచరణ మొక్కసారి చుంబించుటకు నైనను, ఆవలయము జొరనేరఁడు. అంతటి మహద్భాగ్య మాతని కబ్బవలెనన్న, దానే సకరుణముగఁ దన చరణాగ్ర మాపరివేషము నొక్కింత దాటింపవలయునని తలంచి ఆమె చింతించెను. హంగరీదేశ రాజపుత్రి ఒక సాధారణశూరుని గారవించెనను విషయము స్మరణకుఁ దెచ్చుకొని, ఆమె యొక్కింత యూఱట గాంచును. ఐనను, మానినీసహజవ్రీడామయగర్వము—ప్రణయముపాలిటి శృంఖల మనఁదగును—రేకెత్తుటచేఁ దన మనోభావము నామె సముచితముగ వ్యక్తపఱుపఁజాలక పోయెను. అందులకు మఱియొక కారణము గూడఁ గలదు. కణతుఁడామె నొక దేవతనువోలెఁ బూజించుచుండెను: ఆమె దేవతావిగ్రహమువలెనే నిశ్చలముగ నుండెను. గౌరవమర్యాద లత్యంత మెఱింగిన ఆ శూరుఁడు తాము పరస్పర మట్టులే మెలంగవలయునని తలంచుననియు, తా నన్యథా ప్రవర్తించుట యాతఁడు సహింపనేరఁడనియు నామె తలంచెను.

కాని, భక్తుఁడు నిశ్చలభక్తిపరుఁ డగునేని, దేవతావిగ్రహము నిశ్చలముగ నున్నను, అందలి చలనము గుర్తింపఁగలఁడు. అట్టులే, మేరీ కాంతోద్దీపితనయన నిర్గతవీక్షణములు గాంచి, కణతుఁడు గుర్తింపఁజాలెను. తన హృదయవికారము మఱుగుపఱుప నెంత ప్రయత్నించినను, ఎంత గంభీరముగ నున్నను, నిజమనోవికారాకార మేర్పడు సూచన లెవ్వియో ఆమె చేసియే యుండును. అట్లు కాదేని, నిర్జనారణ్యమునందలి విపరీతప్రార్థనాగారమున నాకస్మికముగ మూర్తీభవించి, మనోహరకరాంగుళములు మాత్ర మొకింత ప్రదర్శించి, రెండు పుష్పము లాకాంత యల్లన జారవిడుచునంతనే కణతుఁ డెటులు గుర్తింపఁజాలును? అదియుఁ గాదేని, ఎట్టి నిగూఢసంజ్ఞల, వీక్షణ

ములు, చేష్టల నా యువతీయువకులు పరస్పర మెఱుంగఁజాలిరో, ప్రణయము పరస్పరహృదయగోచర మెటు లాయెనో సపరిశీలనముగ వర్ణింపఁజాలము. అట్టి ప్రేమసూక్ష్మములు తరుణనయనములకుఁ జెల్లుఁగాని, మాకు నసాధ్యము. వారు పరస్పరానురాగబద్ధులగుటమాత్రము తథ్యము. కాని, తమ ప్రణయ మపాయకరముగఁ బరిణమించునని యెంచి, నిజమనోరాగము వర్ధిల్ల తెర వరయక మేరీకాంత నిరోధించుకొనఁ దొడఁగెను. శూరుఁడన్ననో, ఏవియో యపురూపముగఁ దోఁచు విలోకనాది యల్పసూచనలు పురస్కరించుకొని తాను చరించుట యసమంజసమని భావించెను. తన యనురాగము సువ్యక్తమగునేని, తన వీరునకుఁ గష్టక్లేశములు ప్రాపించుననియు, తన శూరుఁడే తను దిరస్కరించుననియు నామె భీతిల్లి సంకుచితమానసయై, లేని యనాదరము వహించి, ఆతనిఁ గాంచనట్టులే మెలఁగఁ జొచ్చెను. అనురాగము వెల్లివిరిసినను, కణతుఁడు మాత్ర మన్యథా చరింపఁగలఁడా ?

౫

కణతుఁ డొక గంట కాలము గాఢతమ నిశ్శబ్దాంధకారనిర్మగ్నుఁడై యుండెను. దైవమునకు వందనములును, శుభవరప్రదాయినియగు తన హృదయరాజ్ఞికిఁ గృతజ్ఞతయు జపియించుచు నాతఁ డట్టులే మోఁకరించియుండెను. అంతవఱకు నాతఁడు తన ప్రకృతావస్థ గుఱించియు, భావిపరిణామము గూర్చియు నిరంతరము దలంచువాఁడు. ఇప్పుడో! అట్టియూహ యణుమాత్రమైనను గానరాదు: తదవసరభవాలోచన ప్రవాహమునఁ బడి, యాతఁడు కొట్టుకొనిపోవుచుండెను.

తన హృదయరాజ్ఞీసామీప్యమున నాతఁ డుండెను: పరమపవిత్రమగు తావున నుండెను: ఇతరప్రపంచము మఱచిపోయెను.

అట్టు లొకగంట యగునంతనే, ఒక యీల ఖంగుమని వినవచ్చెను. ఆ పవిత్రనిలయమున వినరాని కఠోరరవము వెలువడుటచేత, కణతుఁడు ధ్యానము చాలించి తత్క్షణ మప్రమత్తుఁడై కొంగారిపైఁ జేయివైచెను. అంతలో కిఱ్ఱుమని యొక మర తిరిగెను; నేలనుండి తలుపులోనికిఁ బోయి, యొక వివర మేర్పడెను; ఆతావున నొక దీపము లేచెను; ఆ దీపము దాల్చిన కరము కృశీభూతమై, ఎఱ్ఱని చొక్కాయి చేతిలో సగ మడఁగియుండెను. ఆవ్యక్తి క్రమముగా లేచెను. అబ్బా! అది యొక ఘోరతర కుబ్జాకృతి! తదీయప్రమాణాంగమునకుఁ దగని పెద్ద శిరము; శిరముపైఁ జిత్రమగు నొక టోపి; టోపిపై మూఁడు నెమలి పించెములు; వికృతాకారము మఱియు నెక్కుడగు నెఱ్ఱనిపట్టువస్త్రములు; తెల్లని పట్టుమొలకట్టు; అందు తళతళ మెఱయు బంగారు బాకు; ఒకచేతియందు దీపము. రెండవ కేలఁ జేఁపుకుకట్టు! తాను పూర్తిగ మందిరాంతర్గతుఁడై నంతనే, తన రూపము స్పష్టతరముగుటకుఁ గావలయు, నా దీపము వాఁడు తనముదితముగఁ ద్రిప్పెను. వాఁడు కురూపియైనను, జవసత్వములు లేనివాఁడు గాఁడు. ఆ వికృతాకారునిఁ గాంచినంతనే, కణతుని వీరహృదయము చలించెను. చీఁకటిగుహాలం దడఁగి భూమిపైఁ దిరుగాడు దయ్యము లానసమయమునఁ గలఁపునకు వచ్చెను. భూతము వేరూపున నుండునని ఆతఁడు భావించి యుండెనో, అట్టులే యీ వ్యక్తియు నుండెను. శూరుఁడు భయాక్రాంతచిత్తుఁ డాయెనని యనరాదు, కాని, అమానుషరూపములు ప్రత్యక్షమగునపుడు చిత్త మేతీరున విహ్వలించునో, ఆతని హృదయము గూడ నట్టులే విహ్వలించెను.

ఆ గుజ్జు మఱల నొక యీల వైచెను. వెంటనే ఆ బిలమునుండి

మఱియొక వ్యక్తి లేచివచ్చెను. వెనుకటివలెనే ముందొకచేయి, చేత నొకదీపము—క్రమముగా నొక ఆఁడుమూర్తి గోచరమాయెను. ఈ కుబ్జగూడ నెఱ్ఱని పట్టు దుస్తులు ధరించెను. ఆ యంబరము వింతగ వికారముగ చారచారలుగ హాస్యాస్పదముగ నుండెను. ఈమెయుఁ దన దీపము నిటునటు ద్రిప్పి ముఖసౌందర్యము బ్రదర్శించెను. అబ్బ! ఒకటికొకటి దీసిపోవని సోయగము! మొగము లెంత వికృతముగ నున్నను పూర్తిగ మందీభవించియుండక చుఱుకుఁదనము ఇంగితజ్ఞాన మును అత్యధికముగఁగాన్పించుచుండెను. అదియే సుగుణము. గుజ్జుగఁ బెరిఁగిన నల్లని కనుబొమలక్రింద నమరు నయనములు, కప్పకండ్లవలె మిక్కిలి కాంతివంతముగ నుండెను. ఈ లక్షణము వదనవికారము నొకింత పరిహరించునటు లుండెను.

కణతుఁడు మంత్రముగ్ధునివలె నిలిచియుండ నా విపరీతమిధునము తదాలయ మూర్ధ్వఁదొడఁగిరి. చేతులు మాత్రము గిరగిరఁ దిరుగు చుండెను. గాని భూమికి సంస్కారము జరిగినట్లు కానరాదు. ఒకచేత దీపముబట్టి, గంతులాడువారు ఎంతపని చేయఁగలరు? అట్టులే చేసి చేసి, వారు కణతుని సమీపించిరి. తోడనే, ఊడుపుమాని, ఒకరి ప్రక్క నొకరు నిలుచుండి, దీపములు ద్రిప్పి, తమ రూపురేఖలను మఱలఁ బ్రదర్శించిరి. వారు కణతుని కట్టెదుటనే యుండిరి. ఇంత వఱకు దవ్వున నున్న ప్రదర్శనము శూరున కిపుడు కడు సన్నిహిత మాయెను. ఆతఁడు సపరిశీలనముగఁ గాంచుట కవకాశ మాయెను. కాని, వారి వికృతాకృతి అణుమాత్రము భంగపడక, ఒక్కతీరుననే యున్నను, మిలమిల మెఱయు కన్నుల కాంతిమాత్రము దీపముల నీసడించుచు, కడు బ్రశంసనీయముగ నుండెను. వా రంతట దీపములు శూరుని మొగముపైఁ ద్రిప్పి, సూక్ష్మముగఁ బరిశీలించి, ఒండొరులు చూచుకొని, ఆతని చెవులు గింగురుమనునట్లు ఘల్లున నవ్విరి. తద

ఘోరవిలాస మాలించి దద్దరిల్లి, ‘పరమపవిత్రస్థలమున నట్టి యభావ చేష్ట లొనరించువా రెవ్వ’రని యాతఁడు రయమ్మునఁ బ్రశ్నించెను. అంత నా భయదాకారుఁడు తన రూపమునకుఁ దగిన కఠోరఘూక స్వరమున “నేను నకటబను నామధేయుఁడ” నని బదులాడెను. మఱింత కఠోరస్వరమున నాతని సహచరి యిట్టు లనెను—“నా పేరు ‘ఘనవీర;’ వాని హృదయరాజ్ఞిని.”

వారు నిక్కముగ మానవులే యగుదురా యని ఇంకను సంశ యింపుచు, “మీ రిచటకు రానేల?” అని పీరుఁడు ప్రశ్నించెను. వాఁ డంత, ఠీవియు గాంభీర్యము నభినయించి, ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను—

“నేను పంద్రెండవ ‘ఇమాము’ను—‘మహమ్మదు మొహదీ’ని—సత్యమతస్థులగు మహమ్మదీయులకు మార్గదర్శిని—నాకొఱకును, నా బృందముకొఱకును నూరుగుఱ్ఱములు పవిత్రనగరమున వేచియుం డును—ఆ విశ్రామనగరమునఁ గూడ నట్లులే వేచియుండును—ఎఱుం గుదుగదా!—ఇఁక, ఈపెరూ!—నా స్వర్గము నలంకరించు మంద యానలలో నొకతె.”

ఆ యమరసుందరి తన సహచరుని వారించి, మఱింత కఠోరముగ నిట్టు లనెను—“ఛీఛీ! నేను దేవకాంతను గాను—నీవు మ్లేచ్ఛుఁడవు గావు, మహమ్మదువు గావు—వాని సమాధికి గతులు లేకుండు గాక!—ఓరోరి, గార్దభరాయా!—నీ వెవ్వఁడ వనుకొందువు?—బ్రిటనుమహాదేశము నుద్ధరించుటకై యవతారమెత్తిన ‘ఆర్థరు’ రాజశేఖరుఁడవు; నేను నీరాణి ‘గనవేరు’ను.”

అంత నా వికృతపురుషుఁ డిట్టు లనెను—“మహనీయా! నిజమా లింపుము—క్రైస్తవలోకమున కెల్ల మిక్కిలి పవిత్రవంతమగు ‘ఎరూస లేము’ పట్టణరాజమును బాలించు ‘గాయి’ రాజును మ్లేచ్ఛులు వెడల

గొట్టినవఱకును, ఆతని సుఖముఁగునఁ బెరిఁగిన రాజన్యులము. ఆ దురాత్ములపైఁ బిడుగులు పడి నహించివేయుగాక!"

వాఁడట్లు పలికినంతనే, కణతుఁడు ప్రవేశించిన ద్వారమునుండి ఎవ్వరో యిట్లు మందలించిరి—

"చాలు! మూర్ఖులారా! మీ యూడిగము సరి—పొండు!"

ఆజ్ఞ వినినంతనే, ఆనద్రాంగులు కిచకిచ గుసగుస లాడి, దీపము లార్పివైచి, మాయమైరి. కణతుఁడు మరలఁ గమోసాగరగర్భస్థుఁడాయెను. కాని, అట్టి వికృతాంగులకంటె నంధకారమే ఆతనికి వాంఛనీయముగ నుండెను. వారి వేషభాషాకారములు గాంచిన వీరుఁడు వారిని గుర్తింపఁజాలెను. ధనవంతులు తమ వినోదార్థము మందబుద్ధులను వక్రదేహులను జేరఁదీయుదురు. వారి కురూపము నసంబద్ధాలాపములును సంపన్నుల కుల్లాసము గొలుపఁజాలును. నాఁటి యాచార మట్టిది. కణతుఁడు గూడ సంతోషించువాఁడే కాని, చిత్తమూనసమయమున గంభీరాలోచనాధీనమై యుండుటచే సహింపఁజాలకపోయెను.

కొన్ని నిముసము లటులు కడచిన యనంతరము, కణతుఁడు ప్రవేశించిన కవాటము మెల్లగ విడెను; అట నొక సన్నని దీప ముండెను. మినుకుమినుకులాడు నా యవ్యక్తదీపపుఁగాంతిలోఁ జూడ, నొక నల్లని మూర్తి ద్వారమున కన్నుల భూతలమున వ్రాలియుండెను. సన్యాసియే తాను గవ్యమందు ప్రవేశ మొనర్చినప్పటివలెనే యవనతశరీరుఁడై యింకను దైన్యముగ నట్టులే యుండెనని కణతుఁడు గుర్తించెను. అంతకాల మట్టులే యుండెను!

సమీపించుచున్న శూరుని గాంచి, సన్యాసి యిట్టు లనెను—

"పూర్తియైనది—ఇక నిందుఁ డయరాదు. ఓ యువ, భాగ్యవంతుఁడా! ధన్యాత్ముఁడా! నీవును, ఈ పరమదౌర్భాగ్య పాపాత్ముఁడును గూడ

నింకం బోవలయు. ఆ దీపము దాల్చి, నాకుం ద్రోవసూపుము—ఈ పవిత్రస్థలము నేం జూడరాదు.''

అద్భుతదృశ్యములు గాంచిన కణాతుండు పరవశాత్ముండై, వేఱు కుతూహల మెఱుంగక, గంభీరాననుండై, సన్యాసి చెప్పినచొప్పున నాచరించెను. మార్గ మొక వ్యూహమువలెం జిక్కుగ నున్నను, ఆతండు లవమాత్రము మఱవలేదు. వా రట్లు క్రమముగా, ఎంగాడీ నిలయాంతర బాహ్యఖండము బ్రవేశించిరి.

"ఆ పరమగాంభీర న్యాయమూర్తి సకాలమునం దగిన దండన విధించువఱకును, శిక్షాపాత్రుండగు కంటకుం డనుదినము నొక్కసారి వెలికివచ్చుచు, మఱలం దన కూపమున నడంగుచు, నికృష్టముగ దినములు వెళ్లంబుచ్చవలయు''—సన్యాసి యట్లులాడి, కండ్లకుం గట్టిన గంత దీసివైచి, నిరోధింపనేరని నిట్టూర్పు పుచ్చి, ఆ తెర దిలకించి, మగుడ నా గూటిలో భద్రపఱచెను—"కుమారా! పొమ్ము! పొమ్ము! విశ్రమింపుము! నీ వింక నిద్రింపవలయు—నిద్రింపంగలవు—నేనో! పరుండంజాలను—పరుండరాదు.''

సన్యాసి దుర్భరప్రకంపమానశరీరుండై యట్లు పలికినంతనే, వీరుండు రెండవగదిలోనికిం బోయెను. లోని కేగుచు వెనుదిరిగి చూడ, సన్యాసి ఉన్మాదవేగమునం దన యంగీ తీసివేయుచుండెను. శూరుండా రెండు గదులనడుమ నుండు బక్కతలుపు మూయునంతలో, కొరడాదెబ్బల పెళపెళ రవములు, మూలుగులును దుస్సహముగ వినవచ్చెను. అయ్యది సన్యాసి నిరంతర మొనరించు ప్రాయశ్చిత్తకలాపము! చేతులార తన శరీరమంత దారుణముగం గారించుకొను సన్యాసి ఎంతటి మహాపాతక మొనరించి యుండునో, చిత్త మెంత పరితాపానలతప్త మాయెనో యని కణాతుండు చింతించి జల్లున వడంకెను. సారసేనుండు నిశ్చలముగ నిద్రాసౌఖ్యము జూరగొనుచుండెను. భక్తిపరుండై శూరుండు జపమాల

ద్రిప్పి, నాఁటి యహోరాత్రములు సంభవమైన విశేషములచే విశేషముగ డస్సిన కారణమునఁ గన కఱకుసెజ్జపై వ్రాలినంతనే, పసిబాలకుని చందమున, మేను మఱచి నిద్రించెను. ఉదయమున నాతఁడు మేల్కాంచిన పిదప సన్న్యాసితోఁ గూడి ముఖ్యాంశముల గుఱించి సంప్రతించెను. ఫలిత మేమన, మఱి రెండు దినము లాతఁ డచటనే యుండవలసినవాఁ డాయెను. తీర్థయాత్రాపరుఁడగు నా క్రైస్తవుఁడు స్వీయమతధర్మానుగుణముగ సకాలమునఁ గర్మము లొనరింపుచు నందు విడిసియుండెను. కాని, మగుడ నా దేవాలయప్రవేశము మాత్రము ప్రాప్తము కాలేదు.

## ౬

ఇఁక నీ నిర్జనవాలుకారణ్యసీమనుండి మఱలి మఱియొక రంగము గాంచవలయు. క్రైస్తవ ప్రజాకంటకులగు మహమ్మదీయుల మద మడంచి పరమపవిత్రధామమగు 'యెరూసలేము' నగరరాజ మాక్రమింప సంకల్పించి యరుదెంచిన ఆంగ్లరాజేంద్రుఁడు 'ఏకరు'* నగర ప్రాంతమున శిబిరము లేర్పఱచికొని, స్వీయసైన్యపరివృతుఁడై విడిసి యుండెను. సింహపరాక్రముఁడని పేర్వడసిన ఆ మేటిమగఁడు తన్మహాత్కార్యము సాధింపవలసినదె. కాని, యూరపుఖండమునందలి ప్రసిద్ధ నృపాలురు పెక్కండ్రు తదాశయబద్ధులై యరుదెంచిరిగదా. వారందఱు సంక్షోభవించి సాధింపవలసిన దగుటచేత, నా కష్టకార్యము మఱియుఁ గష్టమాయెను. ఇతర భూపాలురు పరస్పరవైషమ్యములు బాటింపక ఏకనాయకత్వమునకు దోసిలియొగ్గి మెలంగిరేని, ఆంగ్ల

* పాలస్థానతీరమునందలి యొక నగరము.

నృపాలుఁడు—రిచర్డు—సంకల్పసిద్ధుఁడై యుండెడువాఁడు. ఆతఁడు ఎంతటి బలాఢ్యుఁడైనను, ఇతరరాజులు గూడ సమాన స్వతంత్ర రాజ్యాధికారములు గలవారలె. కాని, రిచర్డు ఆమాట దలంపఁ డాయెను. ధైర్యసాహసాది సమస్త వ్యాపారములందు వారు పేదలని యాతఁడు తృణీకరించును. అట్టి తృణీకార మసంబద్ధముగ వ్యక్తమగు చుండుటచే, స్వాతిశయమునకు లోటులేని ఇతర క్రైస్తవ దేశపాల కులు సహజముగ సహింపఁజాలకపోయిరి. అందు, ముఖ్యముగ ఫ్రెంచి రాజు చాల విముఖుఁడాయెను. వారి పరస్పర విభేదములు ముదిరిన కొలఁది కార్యసాధనము సన్నగిల్లెను. రిచర్డు ధూర్తుఁడయ్యు, కార్య శూరుఁడు. ఆతని యాలోచనలు శీఘ్రజయసంపాదన సమర్థములు; కాని, ఇతరులు వానిని బాటింపక, ఏవియో యడ్డంకులు గల్పించు చుండిరి. క్రమముగా సైనికుల సంఖ్య క్షీణింపఁ దొడగెను. విజయ మట్టి పరిస్థితులం దనుమానాస్పద మగుటచేత, సైనికులు తమంతఁ దా మంతరించుటయే గాక, తద్విభాగములను శాసించు నాయకులు గూడఁ బోఁ దొడగిరి.

శీతలోత్తర దేశముల నుండు క్రైస్తవులకు మహమ్మదీయ దేశ వాతావరణము దుస్సహముగ నుండెను. సైనికులాకారణమున దుర్బ లులై రోగార్తులై మరణింపఁ జొచ్చిరి. దానికిఁ దోడు, మతయుద్ధ దీక్షాపరులై సగర్వముగ సిలువలు ధరించి యరుదెంచిన పాశ్చాత్య సైనికులుతమ సిలువను పవిత్రాశయముం గూడ మఱచి, దుష్టదుర్వ్యవ సాయములకు వశంవదులై, దుర్బలులై మఱియు సుళువుగా మరణమున కాహుతి యగుచుండిరి. ఈ రెండునుగాక, శాత్రవఖడ్గధారయు నొక ప్రబలకారణ మాయెను. మహమ్మదీయ సైన్యములను శాసించు నా ప్రసిద్ధపురుషుఁడు—సలాఉద్దీను—తమకును వైరికినిగల తారతమ్యము చక్కఁగ గుర్తించెను. లోహకవచరక్షితులై, మహత్తరఖడ్గశూలా

యుధహస్తులై, భీకరాకారులై యుండు క్రైస్తవశూరులను సమీ పించుట అపాయకరమని ఆతఁడు గ్రహించెను. అందు, బలసాహస యశోవిఖ్యాతుఁడగు రిచర్డు మఱియు నసాధ్యుఁ డనియు, భయ కారణుఁ డనియు గూడ నాతఁ డెఱింగెను. మహమ్మదీయుల రణోప కరణములు లఘుతరములు. కావున, వైరులను సమీపించి తాఁకుట వారి కసాధ్యమాయెను. యుద్ధమున మహమ్మదీయులు పెక్కండ్రు గ్రుగ్గుచుండిరి. హతశేషులు పలాయన మొనరించి ప్రాణములు దక్కించుకొనుచుండిరి. ఐనను, వారి సేనాబల మనంతమగుటచేత, నా లోపము కానరాకుండెను.

క్రైస్తవ సేనావాహిని తీసిపోవుకొలఁది, సలాదీను మఱియుమఱియు నిబ్బరముగ వైరిని గారింపఁ దొడంగెను. సంకులసమరమున కుదృ మింపక, దవ్వుదవ్వులనుండియే మహమ్మదీయులు బాధించుచుండిరి. తుదకు, యుద్ధమున జయము గడింప నరుదెంచిన పాశ్చాత్యులు రిపు సేనామేఘావృతులైరి. మహమ్మదీయూశ్వికదళములు కందురీఁగల దండులవలె నుండెను. ఈ కందురీఁగలు తమ చేతికిఁ జిక్కునేని, క్రైస్తవవీరులు నలిపివేయఁజాలుదురు: కాని, మహమ్మదీయాశ్విక ములు ఱెక్కలు గలిగి, ఆకస్మికముగఁ బైఁబడి, పాశ్చాత్యవీరగాత్ర ములు తూఁట్లు పడునట్లు కఱచి కారించుటకుఁ జాలియుండెను. స్థానములకొఱకును, ఆహారపదార్థములు సమకూర్చుటకొఱకును నిరంతర మిట్టి పోరాటములు జరుగుచుండెను. అందుఁ బాశ్చాత్య ప్రాణనష్టమునకుఁ దగిన ప్రతిఫలము కానరాదాయెను. సంభారములు గొనివచ్చువారు మార్గమధ్యమున నిహతులగుచుండిరి: ఇతరప్రపం చముతోడి సంబంధము తెగిపోవుచుండెను.కొన్ని ప్రాణములు పోయిన గాని మిగిలిన ప్రాణములు మిగులుట అసాధ్యమాయెను. నీరము కఱవయ్యెను—రక్తము వెలయిచ్చి, నీరము గొనవలసివచ్చెను.

కాని, ఆంగ్లేయనృపాలుఁడగు రిచర్డు సుస్థిరసంకల్పధురీణుఁడై, శ్రమకష్టాదులు దలంపక, నిరంతర మశ్వారూఢుఁడై, తనుబోలు యోధులతో నెల్లెడలఁ దిరుగాడుచు, సుమహన్మదీయసైనికులు నిక్కముగ విజయము గాంచవలసిన యవసరమున నాకస్మికముగ వారిపైఁ బడి చెండాడి, తనవారల నుద్ధరించుచుండుటచేతఁ గొంత యనర్థము తొలంగుచుండెను. ఆ సింహపరాక్రముని శరీర మయోమయమని చెప్పఁదగును. ఐనను, దుష్టవాతావరణప్రభావముచేతను, నిరంతర శరీరమానసికాయాసముచేతను, సింహబలు నారోగ్యము చెడిపోయెను. దుర్బలుఁడై, జ్వరపీడితుఁడై, మొకట నశ్వారోహణము సలుపఁజాలక, తుదకు, క్రైస్తవనాయకు లప్పుడప్పుడు సమావేశమగు సభలకుఁ గూడ నాతఁడు పోఁజాలకపోయెను. తత్సభాసదు లొకనాఁడు—రిచర్డు పరోక్షమున—కూడి, సలాదీనుమొక్క యనుమతిపై ముప్పదిదినములు యుద్ధవిరామము గాంచవలయునని తీర్మానించిరి. జవసత్వము లుడిగి జడునివలె నింట నడఁగి ఘూర్ణిల్లు నాంగ్లనృపాలుఁ డీ తీర్మాన మెఱింగినచో మఱియుఁ గటకటం బడెనో, లేక, సంతసించెనో చెప్పఁజాలము. మహాత్కార్యసాధనాయత్తచిత్తున కాలస్యము దుస్సహము: కాని, తాను శయ్యాగతుఁడై యుండు సమయమునఁ దన సహచరులు రణరంగమున విక్రమించి ఘనయశోమండితులు కాఁజాలరుగదా యని ఆతఁ డొకింత సంతసించెను.

ఆంగ్లనృపాలుఁడు రోగార్తుఁడైనంతనే, క్రైస్తవసైనికుల కార్యోత్సాహము సన్నగిల్లెను. యుద్ధవిరామసమయమున లోటులు పూటుచేసుకొనవలయుఁగదా: చెదరిన సైన్యములను మగుడఁ జేరదీసుకొని, ధైర్యోత్సాహములు పెంపుచేసుకొని, రణ మారంభమగునంతనే పరాక్రమించి, రిపుసేనాకాంతారము దహించి, విజయము గాంచుటకు సంసిద్ధులై యుండవలయును. వా రట్టి ప్రయత్నములు సలుపక, శత్రు

రాజు భూరిబలసమేతుఁడై భయంకరముగ నగుదెంచునో యన, స్వీయ రక్షణము మాత్రము దలంచి, తదుచితసన్నాహము లొనరింపుచుండిరి. పరిచారకుల కిష్టములేకున్నను, వారా సమాచారములను దమ నృపాలుఁడగు రిచర్డునకు మెల్లమెల్లగ నివేదించిరి. ఆ మహాశూరుఁడు సహజముగ నాగ్రహపరవశుఁ డాయెను.

ఆంగ్లనృపాలు నాగ్రహము వర్ణనాతీతము. తన యాహారము నవ్వలఁ గాంచు పంజరబంధితమృగరాజువలె నాతఁడు ఘూర్ణిల్లెను. స్వాభావికముగ నాతఁడు తీవ్రఘూర్ణప్రవర్తనుఁడు. ఇపు డయ్యది స్వయంప్రవృద్ధమాయెను. ఆతని పరిచారకులేగాక, తత్కాలోచిత ముగ రోగిని శాసింపవలసిన వైద్యులుగూడ నాతనిగాంచి భయపడు చుండిరి. విశ్వసనీయుఁడగు నొక్క ప్రభువు మాత్రము వెనుదీయక మెల్లమెల్లగ తేని మంగళింపఁజాలియుండెను. అట్టి రోగార్తు నాగ్ర హమునకు గుఱియగుట ప్రమాదకరము. అపాయకరము. ఐనను ప్రభుభక్తిపరాయణుఁడును అమేయాభిమానపూరితచిత్తుఁడునగు నా ప్రభువు రాజకృపాకటాక్షము తొలంగునని తలఁపక స్వీయప్రాణా పాయకరమనియైన భయమందక ధాత్రీకృత్యమునం దారి తేఱిన యాఁడుదానివలె నిరంతర మచటఁ గాచుకొనియుండెను.

ఈతనిని సాధారణముగ 'లోయ' ప్రభువని యందురు. క్రమ ముగా నాతఁడు గొప్ప భూస్వామియైనను మొదట లోయలే తద్వంశ భూసంపద యగుటచేత నాతఁడు లోయప్రభువని పేరు గాంచెను. ఈతఁడు మహాయోధ. తన జమీందారి స్కాట్లండు దేశమునకు దగ్గ ఱగ నుండెను. ఇంగ్లాండు స్కాట్లండు దేశములకు నిరంతరము జరుగు పోరాటములలో నాతఁడు నిరంతరము పాల్గొనియుండెను. తన దేశము నందలి యంతఃకలహములందుఁ గూడ నెప్పుడు జేయుచేసుకొనువాఁడు. లోయప్రభువు నిరుపమాన రణకోవిదుఁడనియు ధైర్య సాహసాది

యోధగుణసాంద్రుఁడనియు ఖ్యాతి గాంచెను. కాని సంఘమున నాతఁడు కలసిమెలసి యుండక ప్రజాహిత సరసప్రవర్తన మెఱుంగక సంకుచితమనస్కుఁడై మూతి ముడుచుకొనియుండును. నిజముగ నాతఁడట్టి మూర్ఖుఁడు ధూర్తుఁడు గాఁడనియు రాజాభిమత మెఱిఁగి తదనుగుణముగ మెలంగు తంత్రజ్ఞుఁడనియు గొందఱు విశ్వసించిరి. ఎట్టివాఁడైనను ఆతని జోలికిఁ బోవుటకు సాహసము చాలక ఎల్లరు మిన్నకుండిరి. మఱియు రిచర్డు మహాసత్వసంపన్నుఁడు, ధూర్తుఁడు; ప్రియతమరణరంగమునకుఁ బోఁజాలక రోగతల్పుఁడై వివువున నత్యుగ్రుఁడై యున్న మహావీరుఁడు; కనుసన్నమాత్రమున సర్వజనులను శాసింపఁజాలియు రోగకారణమున స్వాతంత్ర్యవిరహితుఁడై యున్న మహారాజు. అట్టివానిచెంతకు లోయప్రభువు తప్ప మఱి యెవ్వరు పోఁగలరు? కావున ఇతరాస్థానసభ్యు లాతనిపై నీసుజెందియు నూరకుండిరి. సైనికులుమాత్ర మట్టి కుటిలాభిప్రాయ మెఱుంగరు. సమరభూమిపై శస్త్రఘాతమున నేలఁగూలు సైనికునకు సహాచరుఁ డెట్టు లుపచారము లొనరించునో తాకృశముగనే లోయప్రభువు అవ్యాజోదార మనస్కుఁడై తమ నృపాలునకుఁ బరిచర్య సలుపుచుండెనని ఆంగ్లసైనికులు తలంచిరి.

ఒకనాఁడు సూర్యుఁ డస్తంగతుఁ డగుసమయమున రిచర్డు తల్పమున వ్రాలియుండెను. రోగశయ్య శరీరమానసములకు సమానముగ ననసహ్యాకరముగ నుండెను. సహజముగఁ గాంతివంతమై అత్యంత శోభాయమానముగ దీపించు నీలంపుఁగన్నుగవ నిర్వేదోష్ణములచేత మఱింత మిలమిలలాడుచు సంస్కారవిహీనములై వదనమున వ్రేలాడు బంగారుకురుల నడుమ నడగి యాసన్న ఝంఝూసమయ మేఘముల నుండి విస్పష్టముగ నల్లన వెలువడు సువర్ణసూర్యకిరణ శోభతో నలరారుచుండెను. పురుషలక్షణయుతమగు నా దీర్ఘకాయుని శరీరము

రోగప్రభావమునకు సాక్షీభూతముగ క్షీణించియుండెను. ఆకారణముననే మీసము గడ్డము దట్టముగఁ బెరిగి వదనముంజాలవఱకుఁ గప్పివైచెను. నిరంతరవ్యాయామక్రీడానిమగ్నుఁడగు నాబలశాలి శయ్యపై బడియుండఁజాలక మేనినిటునటుఁ ద్రిప్పుచు దుప్పటుల గట్టిగఁ బట్టుచు పట్టినవాని నట్టె విడిచివేయుచుఁ గడు నారాటపడుచుండెను.

లోయప్రభు వాచెంగటనే నిలుచుండెను. ఆతని యమానుష దీర్ఘకాయము, ముఖవికాసము, మూర్తి గాంభీర్యమును రోగార్త రాజపుంగవుని దైన్యావస్థను మఱియుఁ బెంపు చేయఁజాలియుండెను. వాని శిరోజములు దట్టముగ గుజ్జుగఁ బెఱిగి శిరస్త్రమున నడఁగియుండు తెఱంగునమాత్ర ముత్తరింపఁబడియుండెను. ఆతని కపిలవర్ణ విరాజమాన విశాల నయనములు రిచర్డు రాజు బాధితుఁడై విలవిలలాడు నప్పుడుమాత్రము కొంచెలపడుచుండెను. వదనము మచ్చలువడి వికృతముగానున్నను పూర్వము చక్కఁగనే యుండవచ్చును. నల్లని కపిల వర్ణముగల మీసము పెదవిపై నిండుగనుండి శిరోజముల పర్యంతము విస్తరిల్లెను. శిరోరుహములుగూడ నల్లగనే యున్నను ఒకింత పాండురముగూడ గాన్పించుచుండెను. పార్శ్వములు పలుచగను, వక్షము విశాలముగను బాహువులు దీర్ఘముగను, అవయవములు పుష్టిగ నుండి విదేశాహారవిహారములను నిరసింపఁదగియుండెను. మూఁడుదినముల క్రిందట ధరించిన 'తోలు కోటు' విసర్జించుట కవకాశము లేక మేను మఱచి నిద్రించుటకునైన వీలు చిక్కక ఆ ప్రభువు మూఁడు రాత్రులు తన రోగార్తరాజవరునిఁ గనిపెట్టుచుండెను. పత్యపానము లిచ్చుటకును ఔషధము లొసఁగుటకునుగూడ నితర పరిచారకులకు ధైర్యము చాలకపోయెను. తదుపచర్యలుకూడ లోయప్రభువే సలుపవలయును. కఱకుఁ గరవాలము బూని రణరంగమున స్వైరవిహార మొనరింప వలసి జోదు దాదియై సేవ యొనర్చుట వింతగ వికృతముగ నున్నను

ఆప్రభువు పూర్వాభిమానముతో నందు నిమగ్నుఁడాయెను.

రిచర్డు విడిసియున్న నిలయము రాజధానమువలె వైభవసమన్వితమైయుండక వీరలకుఁ దగినటు లుండెను. ఆకాల మట్టిదగుటయే గాక ఆనృపాలుఁడు గూడనట్టివాఁడు. కావున రాజసదనము బహువిధశస్త్ర విరాజితమైయుండెను. కంబములుగూడఁ గ్రొత్తక్రొత్త ఆయుధములతో నలరారుచుండెను. ఎక్కడ జూచినను ఆయుధములు కాన్పించుచుండెను. వేఁటాడి చంపినమృగముల చర్మములు వ్రేలాడుచుఁ గ్రిందగూడఁ బఱచియుండెను. అట్టి యొకచర్మరాశిపై మూఁడు జాగిలములుండెను. అంతటి పెద్దజంతువులెచ్చటను గానరావు. వేఁటయం దవిపడు శ్రమమునకు నిదర్శనముగా వానిమొగములు గాయములు పడియుండెను. త న్నిలయాంతర నానామృగ య్యాజినములు వానిసహాయ్యమునకే లభియించియుండెను. తమ ప్రభువులేచి వేఁటాఁడక శయ్యాగతుఁడు కానేలయని వెఱగంది ఖేదపడునటు లాశ్వానములప్పుడప్పుఁ డాతనివంక సాభిప్రాయముగా నిక్కి చూచుచుండెను. మంచముప్రక్క నొకబల్లపై మూఁడు సింగములు లాంఛనముగాఁ గల యుక్కుడాలు ముక్కోణముగ నమరియుండెను. రక్తవర్ణరంజితమగు మొగమఃఖ పనులతో దీపించు కనకకిరీటముగూడ నచటనేయుండెను. అయ్యవి ఆంగ్లేయ రాజచిహ్నములు. వాని కెట్టియపాయము వారయకుండ రయంబున రక్షించుటకోయన, సింహబలుఁ డొక్కఁడు మాత్రము పాలింపఁగల యుద్దండపరశువుగూడ నాచక్కినుండెను.

ముంగలిగదియందు నిరువురు ముప్వురు రాజోద్యోగులు విషాదాయత్తచిత్తులై యుండిరి. తమ రా జేమగునోయను తత్తర మొకవంకను, అనంతరము తమగతి యేమగునోయను భయ మొకవంకను వారిని బార్తిగఁ గలంచి వైచెను. అవ్వలఁ గాపుండు నాయుధీయులు గూడ భయానుమానబాధితులై, ఖిన్నులై, అవనతవదనులై యట్టిట్టు

దిరుగుచు, నొక్కొక్కప్పుడు విగ్రహములవలె నట్టెనిలచి పోవుచుండిరి.

రిచర్డురాజు కొంతతడవు లోలోనఁగుంది, ఇట్టులనెను. "లోయ శూరా! ఇది గూ నీసమాచారము! ఆహా! వీరులు వనితలైరి. వనితలు విరాగినులైరి. యూరపుఖండాంతర దేశదేశాగత ప్రసిద్ధశూరజన సంభృతమయ్యు, నీమహాశిబిరమున శూరచర్యలు మచ్చునకైనను గానరాకున్నవే!"

లోయప్రభు విరువదిసారు లిచ్చిన సమాధానమే మగుడనిటు జెప్పెను. "ప్రభూ! యుద్ధవిరామ దినములుగదా ఇవి—మనము కార్య శూరులవలె జరించుటకు సమయముగాదు. ఇక నారీమణుల గురించియా!—అందు నేనంత ప్రవీణుఁడనుగాను. నేనుధరించు లోహాజినములువీడి, కాంతాజనంబుల కింపగు సువర్ణాదిభూషణములను మనోహర వస్త్రములనుదాల్చి యెఱుంగను. రాజా! నాకుఁదెలియు విషయము నివేదింతు—శ్రీమహారాజ్ఞియు రాజపుత్రియును అపూర్వ సుందరీకదంబవేష్టితులై, భవదీయ బాధానివారణార్థము దీక్షమెయి ఎంగాడీస్వామి ఆలయమునకుఁ బ్రయాణమైరి."

రిచర్డు సక్రోధముగ నిట్టులనెను. "ఏమీ! అంతఃపుర కాంతలీ తెరంగున భయదారణ్యసీమల విహరింతురా? ఈమహామ్మదీయులు దైవ భక్తియు, మానవ విశ్వాసముగూడ నెఱుంగరే! ఎంతప్రమాదకరము!"

"రాజా! తురుష్క సార్వభౌముఁడగు సలాదీను సెలవుగలదు. వారు నిరపాయముగ యాత్ర సలిపిరాగలరు."

"నిజము, నిజము. తీవ్రపాటున సుల్తానుగురించి యన్యథాతలంచితి. అందుల కుచితపరిహారము సలుపవలయు. ఆహా! క్రైస్తవ మహామ్మదీయ సేనామధ్యస్థుఁడనై మచ్ఛరీరముతో నట్టు లాచరింపగల బలము భగవంతుఁడు ప్రసాదించుగాక!"

అట్లుపలికిన ఆంగ్ల రాజు తదవసరావేశమున నిజానాచ్ఛాదిత

భుజము నవ్వాలకుఁద్రోసి, బాధమరచి రయమ్మునఁ గూర్చుండి, తన హస్తమున నాయుధ ముండెనని భ్రమించి, సలాదీనుసుల్తాను తనసమక్షమున నుండినట్లుగూడ భ్రమించి, తదూహాజనిత ప్రత్యర్థి శిరముపైఁ దనముష్టి వడివడి సారించెను. ధాత్రీకార్యభారము వహించిన లోయ ప్రభువున కాతని వారించుట కడుంగడు కష్టముగనుండెను. మఱియొకనికిఁ గేవల మసాధ్యమె. తన భుజబలముగూడ గొంత ప్రయోగించి, తనరాజు నాతఁడు పరుండఁబెట్టి, ధూర్త బాలకుని సాఁకు తల్లివలె నాతఁ డపారప్రేమతో రిచర్డు భూరిభుజ కంఠములను గప్పెను. నృపాలుఁడు వారింపనేరక సహించి, భయంకరహాస మొనరించి యిట్టులనెను.

„లోయా! అభిమానమునకు లోటులేదుగాని, నీవుకడుదుడుకు దాదివి. కాని, నీవంటిదాదిని, నావంటి శిశువును గాంచు బాలకులు భయభ్రాంతు లగుదురు సుమా!"

ఆంగ్లప్రభువంత సరసముగ నిట్లుబదులాడెను.—„రాజా! తొల్లి మనలనుగాంచి పురుషులు భయ విహ్వాలులైరి గదా! మగుడ నటులొనరింపఁ జాలుదుము. ఈజ్వరమెంత? సహించియుందుమేని, శీఘ్రతరముగఁదొలగును."

„జ్వరమా!—ఔను. నాకుజ్వరమే యగుఁగాక:—ఇతరనృపాలురకేమి దాపురించెను? ఫ్రెంచిరాజులేఁడా? మందుఁడగు నాస్ట్రియా రాజునకేమివచ్చెను? ఆ 'మాంటిసరాటు' ఆమతశూరులు—వీరందఱికేమిమూడెను? మాంద్యమా? పక్షవాతమా? ఈ రాజాధములు ప్రసిద్ధశూరజనోచిత యుదార ధైర్యస్థైర్య మతావేశములను గోల్పోయిరి! పౌరుషము, దైవచింతయు మంటఁగలసెను! ఛీ!—"

ఆతని యావేశము మఱలింపనెంచి, లోయప్రభు విటుల నెను. „మహారాజా! ఇంతటి యుద్రేకము వలదు. అవ్వాల నెవ్వరైన

నుందురు. తోడినృపాలు రాలింతు రేని, మన పరస్పరసఖ్యము భంగ పడును. నీవు జ్వరపీడితుఁడ వగుటచేత, మన మహాదుఃఖ్యము కుంటువడెనని యెఱుఁగుము. ఆధారభూతమగు మరలేకున్నను, యంత్రము తిరుగవచ్చును. కాని, ఈ క్రైస్తవ మహాసేనా యాంత్రము రిచర్డు రాజు తిరుగకుండ నెట్లుతిరుగును?''

రాజు తద్భావము గ్రహించి, సంతసించి, తొల్లిటివలె వేగిరపడక శిరం బుపధానమున నుంచి ,, లోయా! నన్నుఁబొగడుచు బుజ్జగింతువు.'' అని పలికెను. ఆప్రభువు రాజసాన్నిధ్యమున నిరంతరము జరించువాఁడయ్యు నదుచిత సరసాలాపములు నేర్చినవాఁడు గాఁడు. క్రోధవివశుఁడైన నృపాలున కుల్లాసము గల్గించిన ఆయొక్క సరసంపుఁ బలుకైనను కేవల మప్రయత్నముగ వెలువడినదే. కావున, తేఁడు తనకొండలపాటు పూర్తిగమఱచునట్టు లాధోరణి సాగింప నేరక యూరకుండెను. భూపాలుఁడీలోపున నిజమనోభావాలోచనా బాధితుఁడై కనలి తీక్ష్ణముగ నిట్టులనెను.—,, ఛీ! రోగిని బుజ్జగించుటకై యిట్టులందువు. ఏమి! ఒక్క ఆంగ్లరాజు లేనికారణమున, ప్రసిద్ధ క్రైస్తవ రాజశ్రేణి యొక్క పోవునా? శూరనికాయము లన్నియు నిర్వీర్యము లాయెనా? రిచర్డు నొచ్చిననేమి, చచ్చిన నేమి?—తత్సమానవీరులుముప్పది వేలమంది కార్యముసాధింపఁజాలక, అచేతనులుగా నేల? దుప్పులగుంపును శాసించు పెద్దమృగము దెబ్బతిని చచ్చునేని, తోడనే మరియొకటి నాయకత్వము వహించునేగాని తెగిపాఱిపోవు; ఖగమొక బకమును బొలియించునేని, మఱియొక టాపిండును గొంపోవును. అట్టులే ఈమానవాగ్రగణ్యు లొక్కయెడగూడి మఱియొక నాయకు నేలగొంచరు?"

,,దేవా! రాజనాయకులట్టి యాలోచనలు చేయుచున్నారని విందును.

"ఆఁ!"—రిచర్డుచిత్తమున మత్సరము రేకెత్తఁ దదుద్రేకమున నిట్లులనెను—"నేను జీవించియున్నను, నామిత్రులు నన్ను మఱచిరా? లేక మరణించితినని యే భావింతురా? కాదు, అట్లులనరాదు. వారి వర్తనము బాగుగనే యున్నది. ఓయీ! వా రెన్నుకొను నాయకుఁ డెవ్వఁడు?"

"రాజ్యాధికార గౌరవములు గమనింప ఫ్రెంచిరాజు తగునని తోఁచును."

"హాఁ! బాగు. 'ఫ్రాన్సు' 'నావరీ' రాజ్యభార ధురంధరుఁడు! ఇంకను వేనినో పాలించును. బిరుదులకు లోటులేదు. ఉచ్చరించినచో నోరునిండిపోవును! కాని, ఒక్క పరిహాసము గలదుసుమా—సేనా ముఖంబున నిలిచి, వైరి నురుమాడుటకుమాఱు వెనుదిరిగి తన రాజ ధానికి మనలను గొంపోవునేమో. మనపవిత్ర సమాధికొఱకు దుష్కులతోఁ బోరాడుటకంటెఁ దన సామంతులను బండి పీడించుటయే, తన మిత్రులను దోపిడీచేయుటయే లాభకరమని ఆ తంత్రజ్ఞుఁడు గ్రహించి యున్నవాఁడు."

"ఆస్ట్రియా దేశపురాజు నామోదింపవచ్చును."

"ఏమీ! నీవలె స్థూలశరీరుఁడని నాయకుఁ డగునా? ఆతఁడు గూడ నీవంటి మందబుద్ధియే గాని, నీకుఁగల ధైర్య సాహసములు లేవు. ఛీ! వాఁడొక నాయకుఁడే! ఒక కడివెడు మధురసము ముందు బెట్టుదువేని, వాని నాయకత్వము బయల్పడును."

ఈ ప్రసంగమునన్నైనఁ దనరాజు స్వీయజ్వరస్థితి మఱచునని యెంచి లోయప్రభువు మఱియొకనామ ముదహరించెను—"మతశూరని కాయ మును శాసించు నామహా నాథుఁడు గలఁడుగదా! నేర్పరి, నిర్భయ ముగఁబోరాడు వీరుఁడు. ఆలోచనలందుఁగూడ దొడ్డవాఁడు. తన కొక రాజ్యము లేకుండుటచేత నధికతరదీక్షాపరుఁడై నాయకత్వము

జయప్రదముగ సాగింపఁగలఁడు."

"ఈ 'అమూరీ' మహానాథుఁడు యోధుఁడనుట తథ్యము. రణరంగమున సైన్యమును త్రిప్పఁజాలును; తాను సేనా ముఖముననే నిలచి సమర మొనరింపఁగలఁడు. కాని, ఈతఁడు క్రైస్తవుఁడయ్యు, మహమ్మదీయునికంటె నధమాత్ముఁడు. సలాఉద్దీను జాతమున మ్లేచ్ఛుఁడయ్యు నుదారచిత్తుఁడు. వీఁడో! అధమాధముఁడు—విగ్రహారాధకుఁడు, పిశాచారాధకుఁడు, మాంత్రికుఁడు—నిగూఢస్థలములందు నిగూఢతరముగ పాపిష్ట దారుణ కార్యము లాచరించు హంతకుఁడు. ఉదారస్వభావుఁడగు సుల్తానును జయించి, మన పవిత్రభూమి నిట్టి మానవాధముని హస్తగత మొనరింప వలయునా ?

"రెండవమత శూరశ్రేణీనాథుఁడు నిక్కముగఁ దగును. మాంత్రికుఁడు గాఁడు, పిశాచారాధకుఁడు గాఁడు."

"ఔఁగాక, కాని, వాఁడు పరమలోభికాఁడా! బలవంతుఁడయ్యు మ్లేచ్ఛులను దండింపఁజాలియు మన పవిత్రనగర సమీపముననే యుండియు వైరు లొసగు లంచములు గుడిచి వారి దుండగము లుపేక్షించును! వానికి సైన్యాధిపత్య మొసంగుటకంటె సైన్యమును వర్తకులపా లొనరించుట శ్రేయస్కరము."

"అట్లులైనచో, 'మాన్ట్సెరాటు' దేశాధిపతియగు 'కాన్రేడు' నాయకత్వము వహింపఁజాలు;—వివేకి, యోధ—సరసుఁడు."

"వివేకి!—కుటిలుఁ డనుము. నీటుకాఁడే యగు—కాంతామందిర మునసుమా. ఈ వేషధారి నెవ్వ రెఱుంగరు? ఒక క్షణము తలంచు నట్టు లింకొక క్షణము తలంపని చపలచిత్తుఁడు—మోసఁగాఁడు—యోధ? అశ్వారోహణ మొనరించునపుడు మూర్తి దర్శనీయమె. ఖడ్గములు సునిశితధారాగ్రవిరహితము లగునేని శూలములు వాడిమి చెడి దారుమయము లగునేని, శూరజన వినోదరంగమున నొయ్యార

ముగ రాజిల్ల గలఁడు. లోయూ! నీ విపుడు నాయండ నుంటివిగదా? ఆ 'కాౘ్రేడు' తేఁడును మనమును గలసి విహరించునపు డొకసారి దవ్వున గొండొక వైరియూధము గాంచి యిట్టు లంటి 'అల్లదె యిఱువదిమంది సారసేనులు! మనము మువ్వరము క్రైస్తవశూరులము. ఒక్కని కిరువదిమంది మ్లేచ్ఛులగుదురు—ఏమందువు?"

"రాజోత్తమా! జ్ఞాపక మున్నది. ఆతఁ డిట్లు బదులాడెను. 'నేను రక్తమాంసములు గల మానవుఁడనుగాని లోహశరీరుఁడను గాను. మానవునకు మానవహృదయము తగునుగాని మృగహృదయము తగదు. ఆ మృగము మృగరాజే యగుగాక." కాని ఇఁకఁ బర్యవసానము చెప్పెద చిత్తగింపుము. రిచర్డునృపాలుఁ డారోగ్యవంతుఁడై మగుడ నాయకత్వమువహింపవలయు; అంతవఱకు మన యుద్యమము విరమింపవలయు."

లోయప్రభు విట్లు సరసముగఁ బలుక, రిచర్డు పకపకనవ్వెను. అట్టి హృదయాహ్లాదము నాతఁడు చిరకాలమునుండియు నెఱుంగఁడాయెను. "మనస్సు ఎంత వింతయైనది! నీవంటి రసహీనుఁడు నా తప్పిదము నాకుఁ జూపఁజాలెను! వారు నాపై నీసువహింపనప్పుడు నేను వారిపైఁ గినియనేల? నాసంకల్పమున కడ్డు తగిలినగదా నే నాగ్రహింపవలయు! లోయూ! నీపలుకు నిక్కము. రిచర్డును మించిన నాయకు లుందురు. అందొకని నాయకునిగా నేర్పఱచుకొనవలయు—కాని" అంతలో నా యుద్ధప్రియుఁడు దిగ్గున లేచి కూర్చుండి మునుఁగు నిట్టట్టు గదల్చుచు, తానురణోన్ముఖుఁడై నట్టులు తదవసరావేశమున నయనములు దీపింప నిట్లులనెను—"కాని వైరియూధములను జెండాడి కృతకృత్యుఁడగు వాఁడు తదనంతరము నాతోడ ద్వంద్వయుద్ధ మొనరింపవలయు. ఈ నికృష్టరోగముచేత బలము సెడి నే నిటుఁ బడియుండు సమయమున మదీయ నాయకత్వము వహించి నాకీర్తి హరించువాఁడు చూప

వలసిన పరిహార మయ్యెదె? ఆః!—ఏమది!—ఈ కాహళధ్వానము నకు గతం బేమి?"

"ఫ్రెంచినృపాలుని వాద్యములు కానోపు."

"లోయరూ! నీవు బధిరుఁడవు గావలయు,"—రిచర్డు లేవఁ బోయెను.—"ఆయుధముల కణకణధ్వానములుగూడ నాలింపవా? దైవమా! తురుష్కులు మనశిబిరము జొచ్చిరి—వారి 'లైలా' రణ గీతికకూడ నాశ్రవణపుటముల బడుచున్నది!"

దుర్భరావేశమున నారాజకంఠీరవుఁడు మగుడ లేవఁబోయెను. లోయప్రభువు తానొక్కఁడు వారింపనేరక, బహిర్మందిరమున వేచి యుండు నుద్యోగులనుగూడఁ జీరి, వారిసాహాయ్యముగూడఁ గైకొన వలసినవాఁడాయెను. రిచర్డు క్రోధవివశుఁడయ్యు ననివార్యబలంబు నకు లోఁబడి రోజుచుఁ దల్పమున మేనుజేర్చి, సాభిప్రాయముగా నిట్టులనెను.—"నీవు రాజద్రోహివి! ఆహా! నాకీసమయమున బల మల వడునేని, మదీయప్రచండపరశువుబూని, నీ శిరం బీక్షణంబ తుత్తునియ లొనరింతును!"

"రాజోత్తమా! నీకంతటిబలము కలుగవలయుననియే వాంఛింతును. ఈలోయుఁడు విగతాసుఁడైనను లోటులేదు.—కాని, రిపుకుంజరకంఠీరవుఁడగు ప్రసిద్ధరిచర్డు నృపాలుఁడు శస్త్రహస్తుఁడు కాఁజాలు నేని, క్రైస్తవాన్వయమునకు విజయము తథ్యము."

రిచర్డు హృదయ మంతలో దయార్ద్రమాయెను: సాభిప్రాయముగ హస్తముజాపి, ఇట్టు లనెను.—

"ఓయి, స్వామిభక్తి పరాయణా! నీస్వామి యాగ్రహము సైరింపుము. నీపైఁ గినిసి తూలనాడునది యుగ్రజ్వరప్రభావము గాని, దయాంతరంగుఁడగు నీతేఁడు రిచర్డుకాఁడు. కాని, నీవు రయమునఁ బోయి, ఆనూతనాగతులెవ్వరో యరసిరమ్ము. ఆతూర్యాదివాద్య

ములు క్రైస్తవులవి కావు.''

రాజాజ్ఞ ననుసరించి, లోయప్రభువు వెడలెను. స్వామి హితాభిలాషియగు నాసేవకుఁడు శీఘ్రముగ నే తేరవలయునని లోలోన నిశ్చయించి, ద్విగుణీకృతశ్రద్ధాళుఁడై కావలి యుండవలయునని పరిచారకులను, దౌవారికులను హెచ్చరించి, యెట్టిలోపము గాన్పించినను వారిపని బట్టింతునని బెదరించి, యావలకుఁ బోయెను.

౭

ఇంగ్లాండు స్కాట్లాండు దేశము లేకద్వీపఖండములయ్యు, బూర్వము రెండును రెండు ప్రత్యేక దేశములవలె నుండెను. స్కాట్లండు దేశమును జయింపవలయునని ఇంగ్లాండు దేశమును, తన స్వాతంత్ర్యము నిలుపుకొనవలయునని స్కాట్లాండు దేశమును చిరకాలము—కొన్ని శతాబ్దములు హోరాహోరి బోరాడెను. తుదకు, మూడు శతాబ్దముల క్రిందట నాంగ్లేయరాజవంశ మంతరించుటయు, స్కాచినృపాలుఁడే సన్నిహిత జ్ఞాతియగుటయు సంభవమాయెను. అట్లు "జేమ్సు" నామధేయుఁడగు నాస్కాచిరాజు ఇంగ్లాండు రాజధాని కరుదెంచి, తద్దేశసంప్రదాయానుగుణముగ సక్రమముగ మూర్ధాభిషిక్తుఁడాయెను. నాటఁగోలె నింగ్లాండు స్కాట్లండు దేశము లేకరాజ్యాంగబద్ధములై 'గ్రేటుబ్రిటను' అను ప్రసిద్ధనామము దాల్చెను.

కాని, ఈక్రూసేడుల—మతయుద్ధముల కాలమున స్కాట్లండు దేశమును 'విలియము' అను స్వతంత్రరాజు పాలించుచుండెను. ఆ రెండు జాతులవారును నిరంతరకలహ నిమగ్నులై మనుచుండిరి. అందు నింగ్లాండు దేశోత్తరభాగము స్కాట్లండుదేశ దక్షిణభాగమున కంటి

యుండుటచే, నాయూప్రాంతస్థులు ముఖ్యముగఁ బరస్పరద్వేషపూరితులై, తటస్థమగు నవకాశము లూరక పోనీయక, బలపౌరుషములతోఁ బోరాడుచుండిరి. మనలోయప్రభు వుత్తరమండలాధీశుఁ డగుటచేత, స్కాచిప్రజపై మఱియు ద్వేషము వహించియుండెను.

ఐనను, పోరాటములులేని సమయములందు నాయూదేశస్థు లుదారమనస్కులై, పరస్పర గౌరవసఖ్యములకుఁ బాత్రులగుచుండిరి. వారేకమతబద్ధులుగూడ నగుటచేత, నిరువురుగలసి తమసామాన్యవైరిని దాఁకునపుడు పరస్పరవైషమ్యములు దలంపక, ఒకరికంటె నింకొకరు లెస్సగ విక్రమింపవలయునని మాత్ర మాసించియుండిరి.

ఉదారచిత్తుఁడగు రిచర్డురాజు పక్షపాతబుద్ధిలేక ధైర్యసాహసములు జూచియే సైనికుని గౌరవించువాఁడగుటచేత, నాతఁ డన్యదేశాధీశుఁడని గణింపక, స్కాచిసైనికులు కొందఱు మతయుద్ధదీక్షాపరులై యామహాశూరునితో నరుదెంచిరి. కాని, రిచర్డు వ్యాధిగ్రస్తుఁడైనంతనే పరిస్థితి మాఱిపోయెను. దేహ మారోగ్యముసెడి స్రుక్కునపుడు, ప్రాఁతపుంస్లు బయల్పడును: అట్టులే, ఆంగ్లనృపాలుఁడు రోగార్తుఁడైనంతనే తొల్లిటి స్పర్ధలు పునరుద్ధృతము లాయెను.

స్కాట్లండు దేశము నిస్సారమైన దగుటచేత నా దేశస్థులు సామాన్యముగ నిర్ధనులు. ధనమునబేదలయ్యు, వా రత్యంతపౌరుషవంతులు. సకల క్రైస్తవరాజన్యసభాభిప్రాయఫలితముగ ముప్పదిదినముల యుద్ధవిరామము ప్రాపించినంతనే ఆంగ్లేయ స్కాచిజాతులను గట్టియుంచిన బంధము తెగిపోయెను. క్రైస్తవ పవిత్రధామము నాక్రమించిన దుష్టమహమ్మదీయ సంఘాతసంఘర్షము విరళమైనంతనే వార లన్యోన్యద్వేషపూరితులైరి. తా మింకను శత్రుదేశమున నుంటిమని గుర్తింపక సైనికులును నాయకులునుగూడ బరస్పర నిందారోపణ మొనరింపఁ దొడగిరి. అట్టులే ఆంగ్లేయులు, ఫ్రాన్సు జర్మనీదేశస్థులు, తదిత

రులనుగూడ నొకరినొకరు సహింపఁజాలకుండిరి.

లోయప్రభువు స్కాటులపై మఱియుఁ గనలియుండునని చెప్పియుంటిమిగదా. తన దేనియెడ నాతనికిఁ గల యభిమాన భక్తి విశ్వాసము లపారములు. ఆ సద్గుణము లెంత యపారములో స్కాటులపైఁ గల ద్వేషభావముగూడ నంత యపారమె. స్కాటులు కుటిల క్రూర నరాధములని యాతఁడు విశ్వసించెను. ఒక స్కాటువీరునిపై నాంగ్లేయనృపాలుఁ డొక కరుణావీక్షణము బ్రసరించునేని లోయప్రభువు లోలోన మిక్కిలి తల్లడిల్లును. స్కాటుల సంపర్కముగల తమ యుద్యమము సఫల మగునా యని చింతించి యాతఁడు కుపితుఁడగును. అట్టి విపరీతవిరుద్ధాభిప్రాయబద్ధుఁడగు నాప్రభువునకు వైరులగు మహమ్మదీయులును, మిత్రులై తమునను సరించి యరుదెంచిన స్కాటులును ఇంచుమించుగా నొక్కతీరుననే గాన్పించుచుండిరి. స్కాటులు సాధారణముగ నాగరకసూక్ష్మము లెఱుఁగక మోటుగ వర్తింతురు: కాని, పరదేశావాసమునను, తమమిత్రులగు ఫ్రెంచివారిని గాంచియు, దమమొఱకుఁదనము దొలఁగి వారు సరసముగనే మెలంగఁ దొడగిరి. అట్టి పరివర్తనము మంచిదయ్యు, లోయప్రభువునకుమాత్రము దుస్సహమాయెను. ఆంగ్లేయులను ధారాళముగ జయింపఁజాలక వారట్టి కుటిలవర్తనమునకుఁ బూనుకొనిరని, ఆయాంగ్లప్రభువు విపరీతముగ భావించి, మఱియు నుగ్రుఁడాయెను.

ఐనను, మతయుద్ధదీక్షాపరులై యరుదెంచిన క్రైస్తవులు తమలోఁదాము కలహించుట తగదని యెఱింగిన లోయప్రభువు తనయాగ్రహమును వెలిపుచ్చక, వారి సహవాసము నపేక్షింపక, విధిలేక వారినిఁ గలయునపుడు తిరస్కారముగఁజూచుచు నెంతయో బాధపడుచుండెను. మానవంతులగు స్కాచిశూరులకట్టి ప్రవర్తనము దుస్సహముగ నుండెను. ఆంగ్లప్రభువున కంతటి యసహనమున్నను, ఔదార్యము

లేకపోలేదు. ఆతఁడు ధనవంతుఁడు. తనవారలకేగాక, పేదలగు స్కాటులకుఁగూడ నౌషధములను ఆహారపదార్థములను నిగూఢముగ నంపువాఁడు. మిత్రుని తరువాత శత్రువే ముఖ్యముగ గణనీయుఁడని ఆతని యభిమతము. మిత్రులును శత్రులును గాని సామాన్యుల నాతఁడు లెక్కచేయఁడు. లోయప్రభువు గుణదోషము లిట్టివి.

లోయప్రభువు రాజావాసమువీడి నాలుగడుగులు వైచినంతనే, రిచర్డు నృపాలుననుమానము సత్యమని తెల్లమాయెను. దవ్వున సారసేనులు తమ వాద్యములు వాయింపుచుండిరి. దీర్ఘగ్రీవములగు నుష్ట్రము లనేకములుండెను. వారి నిడుపుబల్లెములు, తెల్లని పాగాలు, వాద్యములును నిక్కముగ మహమ్మదీయులని వ్యక్తముచేయుచుండెను. పనిపాటులులేని వివిధదేశక్రైస్తవ సైనికులాచుట్టును మూఁగియుండిరి. అందు శిరస్త్రాణోపేతులగు శూరులుగూడఁ గాన్పించిరి.

వైరులగు సారసేనులు క్రైస్తవశిబిరాంతరప్రదేశము చొరనేల? వారేదైనఁ గార్యార్థ మరుదెంతురేని, అవ్వల వేచియుండవలయును. లోయప్రభువున కేమియుఁ దోఁపకుండెను. కావున నెవ్వనినైనఁ బ్రశ్నించి యరయవలయునని చూచుచుండ, నొకశూరుఁడు కానవచ్చెను. ఆతఁడు చిత్రకలాంఛనుఁడగు కణతుఁడే కాని, స్కాచిదేశస్థుఁడుగదా—"ఈతఁడు శూరుఁడు: యుద్ధమున దనదేశీయునివలెఁ గాక, ప్రశంసనీయముగఁ బోరాడెను;—కాని స్కాచివాఁడు."

శూరుఁడైనను స్కాచిజాతివాఁడగుటచేతఁ గణతుని బ్రశ్నింప నొల్లక ఆంగ్లప్రభు వింకొకని కొఱకు వెడలనుండెను. కాని, ఆతని సంకల్పము భగ్నమాయెను. ఆ స్కాచిశూరుఁడే రయమ్మున నెదుర్కొని, సముచితాభివందనము లొనరించి, యిట్లులనెను—"లోయప్రభూ! నీతోడ మాటాడవలసి యున్నది."

"హా! నాతో?—అదేదో సెలవిమ్మ—పెంపుచేయక, సంగ్రహ

ముగ జెప్పుము—నేను రాజాదేశమును వహించి పోవువాఁడను.”

“నాకార్యము గూడ రిచర్డు నృపాలునకు సంబంధించినదే. రాజున కారోగ్యము దెచ్చువాఁడను.”

ఆంగ్లప్రభువు సందేహ విచలితనయనుఁడై స్కాచిశూరునిఁ దిలకించి యిట్లులనెను. “రాజున కారోగ్యమా? శూరుఁడా! నీవు వైద్యుఁడవుగావే. చాలు, రాజునకు ధనరాశి దెచ్చితినంటివి కావు.”

స్కాటుల పేటికతము విదితము. అంగ్లేయుఁడా తెఱఁగున నవహసించుటచేతఁ గినిసియు, గణుతుఁడు సహించి, సమయోచితముగ నిట్లు బదులాడెను.—“రిచర్డు నృపాలుఁ డారోగ్యవంతుఁ డగునేని, క్రైస్తవాన్వయము నిక్కముగ భాగ్యవంతమగును.—కాలవిలంబనము వలదు. అయ్యా! అనుగ్రహింపుము. రాజును జూడఁదగునా?”

“తగదు. ఎంతమాత్రమును దగదు. నీసందేశము ముందు నేనె ఉుంగవలయును. ఇయ్యది రాజాగారముగాని, సత్రముగాదు. ఇచ్చకు వచ్చు వారందఱు నిందుఁ బ్రవేశింపరాదు.”

లోయప్రభువట్లు కఠినముగఁ బలుక, శూరుఁడిట్లు బదులాడెను. “ప్రభూ! నీపలుకులు దుస్సహములు. కాని, నేనును నీవలెనె సిలువ దాల్చి, యేకాశయబద్ధుఁడనై యురుదెంచితిని. మఱియు, బ్రకృతాంశము కడు ముఖ్యము. రిచర్డు నృపాలున కారోగ్య మీయఁగల మహమ్మదీయ వైద్యునిఁగొనివచ్చితిని.”

“మహమ్మదీయుఁడా? వానినెట్లు విశ్వసింపఁగలము? ఔషధమిచ్చునో, విషమిచ్చునో?”

“అయ్యా! సంశయము వలదు. వాఁడు తల యిచ్చును.”

“వానితల మనకేల? నిశ్చల చిత్తముతోడ వధ్యస్థానమున కరుదెంచు నరాధముల నెందఱనో కాంచి యుంటిని. వీఁడొకఁడు కావచ్చును.”

"ప్రభూ ! మనవైరియగు సుల్తాను నౌదార్యము నిరుపమానము గదా. ఆమహనీయుఁడే యీ హకీమును సముచితపరివారముతోడ నంపెను. దాన నీవైద్యుని గౌరవాతిశయము స్పష్టము. శతసహస్ర యోధజనముఖమునఁ దాను విచ్చుకత్తిం జేఁబూని యురుదెంచునపుడు రిచర్డున్నృపాలుఁ డుచితస్వాగత మీయఁగలందులకు శీఘ్రముగ నారోగ్యవంతుఁడు గావలయునని సుల్తాను ప్రార్థించువాఁడు. కావునఁ లోయప్రభూ ! బహుళోపాయనభారధురంధరములగు సుల్తాను లొట్టియలను గమనింపుము. ఈమహమ్మదీయ వైద్యవిద్యావిశారదుఁ డుచితస్వాగతము గాంచగల యేర్పాటులు చేయింతువా?"

"బాగు! సలాద్దీనుమాటపై మనకు నమ్మకమేల ? అందులకెవ్వగు జబాబుదారు? సుల్తాను దౌష్ట్యము తలంచెనేని, దాన రిచర్డున్నృపాలుఁడు మరణించునేని, సుల్తానునకే చాల లాభముగదా."

"నేను బాధ్యతవహింతును. సలాద్దీనుమాట విశ్వసింపవేని, మదీయప్రాణార్థగౌరవములు కుదువఁబెట్టెదను."

"ఎంత విపరీతము ! తురుష్కునకు స్కాచిదేశస్థుఁడు బాధ్యత వహించును!—శూరవర్యా! నీ వీవ్యవహారమునఁ జొచ్చుకొనుటకుఁ గతం బెద్దియో సెలవిచ్చెదవా?"

"నేను యాత్రాపరుఁడనై పోతిని. ఆసందర్భమునఁ బూజ్యుఁడగు ఎంగాడీ స్వామి కొకసందేశముగూడఁ గొనిపోవలసి వచ్చెను."

"ఆసందేశ మెద్దియో, ఆస్వామి యేమనెనో గూడ నేను వినరాదా!"

"ప్రభూ! వినరాదు."

లోయప్రభు వాగ్రహించి సగర్వముగ నిట్టులనెను.—"నేను ఆంగ్లేయరహస్యసభలోని వాఁడనని యెఱుంగవా? నాయెఱుంగని రహస్యము లుండవు."

"ఔఁగాక. నే నాంగ్లేయుఁడను గాను—ఆంగ్లరాజపాలిత ప్రజా

కోటిలోనివాఁడను గాను. నేను స్వతంత్రస్కాచిదేశస్థుఁడను; కేవలము మదిచ్ఛానుసారముగ నీయుద్ధమున రిచర్డునృపాలుని నాయకత్వమున కొడఁబడి యరుదెంచి యుంటిని. లోయప్రభూ! ఈమహామతయుద్ధబద్ధరాజన్యాది నాయకబృందము నన్ను నియోగించెను. వారు మాత్రము నాసందేశ మాలింపవలయు."

"హా! ఏమంటివి? సకలరాజన్య కార్యభార దురంధరా! వినుము. లోయప్రభునాజ్ఞలేకుండ, జ్వరపీడితుఁడగు రిచర్డుచెంత కేవైద్యుఁడును బోరాదు. తద్విరుద్ధముగఁ బ్రవేశింప గడంగువారు దుష్టసంకల్పురని తలంతును."

లోయప్రభు వటులు కటువుగఁ బలికి తదుచితగర్వాతిరేకమున వెనుదిరిగి నంతనే, స్కాచిశూరుఁడు ముందునకుఁబోయి, ఆతని కడ్డుగ నిలిచి సగర్వముగనే యిట్టులనెను.—"ప్రభూ! నేను గౌరవనీయుఁడనగు శూరుఁడనని తలంపవా?"

"స్కాటులందఱు జాతిము వలననే గౌరవనీయు లగుదురు."—

లోయప్రభు వట్టులెక్కసక్కెములాడినంతనే, కణతునివదన మాగ్రహారుణ దీపితమాయెను. అంతలో ఆంగ్లేయుఁడు తెలివొంది, మగుడ నిట్టులనెను. "నీవు నిక్కముగ ప్రసిద్ధశూరుఁడవు. నీదు బలధైర్యములు గాంచిన వారము నిన్నొక్కని మాత్ర మవహసింప నేరము."

ఆంగ్ల ప్రభు వట్లు ధారాళమనస్కుఁడై పలికినంతనే స్కాచిశూరుఁడు సంతసించి, తన వంశగౌరవము మీఁదను తన గౌరవము మీఁదను, తాను ధరించు సిలువమీఁదను ప్రమాణము లొనరించి, తాను రిచర్డు నృపాలు క్షేమమరయు వాఁడనే యని నచ్చఁజెప్పి, తాఁగొని వచ్చిన హకీమును విశ్వసింప వలయునని కోరెను. ఆంగ్లేయున కాతనిపై సహజముగఁగల జుగుప్సయు నవిశ్వాసమును దొలంగెను.—

“ శూరుఁడా ! నీ కీమహమ్మదీయునిపై విశ్వాస ముండుఁగాక.— నిన్ననుమానింపను. ఐనను, ఈదేశము తీరు నీవెఱుంగనిది కాదు. విషప్రయోగ మిచ్చట సర్వసాధారణము. కావున, క్రైస్తవాన్వయమునకుఁ బట్టుకొమ్మయగు రిచర్డు నృపాలు నొక మహమ్మదీయున కప్పగించుట పాడియగునా ? ”

“ ప్రభూ ! చిత్తగింపుము. నాపరివారజన మంతయు యుద్ధముననో రోగమువలననో మరణింప, నాయనుచరుఁ డొక్కఁడు మాత్రము మిగిలెను. వాఁడైనను, రిచర్డు నృపాలుఁడు కుందు జ్వరమున కధీనుఁడై పరలోకాభిముఖుఁడై యుండ, నీయపూర్వ మహమ్మదీయ భిషక్కు దైవమువలె సమయమున కరుదెంచి చికిత్స యొనరించెను. రెండు గంటలలో నాయనుచరుఁడు బాధమఱచి, మేను మఱచి నిద్రించువాఁడు. కావున, ఈవైద్యుఁడు సమర్థుఁ డగుట నిక్కము. అమితోదారమనస్కుఁడగు సుల్తా నవశ్యము విశ్వసనీయుఁడు. మఱియొకటి:— ఈ హకీము కృతకృత్యుఁ డగునా, బహుమానము వడయఁగలఁడు. లేదేని శిక్షార్హుఁడగును. కాబట్టి అవిశ్వాస మనవసరము.”

ఆపలుకులు సమంజసముగ నుండెను. ఐనను విశ్వసించుటకు లోయప్రభు మానస మిచ్చగింపదాయెను. అతఁడు డోలాయమాన మానసుఁడై యవనత వీక్షణుఁడై, తు దకిట్లు ప్రశ్నించెను.—“ అయ్యా! రోగగ్రస్తుఁడగు నీయనుచరునిఁ గాంచవచ్చునా?”

కణతుఁడు తొట్రుపడి, మొగమొకింత జేవురింప, నల్లన నిట్టులనెను. “లోయప్రభూ! అవశ్యము దయచేయుఁడు; కాని, ఒక్కవిషయము మఱువరాదు; స్కాటుల సంపదవిదితము గదా—ఆంగ్లేయప్రభులవలెను, ఆశూరులవలెను స్కాచి శూరప్రభువులు ప్రశస్తభోజనము లారగింపరు. మృదులతల్పముల శయనింపరు. రమ్యమందిరముల విడియరు.”

స్కాచిశూరుఁడు పేదయగుటచేత, ధనవంతుఁడగు నాంగ్లప్రభువునుఁ దనవసతికిఁ గొంపోవుటకు సంశయించెను. ఐనను అప్పటి యవసరముబట్టి యాతఁడు సహించుకొని, లోయప్రభు సమేతుఁడై తనవిడిదికిఁ బోయెను.

లోయప్రభు వెంతటిగర్విష్ఠుఁడైనను, స్కాటులనెంత నిరసించువాఁడైనను, ప్రసిద్ధశూరుఁడగు కణతుని ధైర్యపాటుగాంచి సంతసించు హీనుఁడు కాఁడు—"శూరుఁడా! రిపుహస్తగతపవిత్రనగరసంపాదన సంకల్పబద్ధులై యరుదెంచు క్రైస్తవసైనికులకు భోగభాగ్యములేల? సౌఖ్య మపేక్షించువారు నింద్యులు. మనప్రకృతావస్థ ఎంతకఠినముగనైన నుండుఁగాక—శత్రుసంహార మొనరించి, మరణించియైనను సుస్థిరమగు యశము గాంతుము."

స్కాచిశూరుని శిబిరము సమీపమాయెను. తదావరణము కడు విశాలముగనుండెను. కణతుఁడు పేదయయ్యుఁ దనగౌరవమునకు లోటులేకుండ, సుమారు ముప్పదిసైనికులకు ముప్పది పటకుటీరములు నిర్మింపఁజాలు స్థలము వడసెను. వృక్షశాఖాతుండములు నిల్పి యాపై యాకులను బఱచియే వారు తమ యావాసములు నిర్మించుకొనిరి. వారందఱు మరణించుటచే నాజీర్ణకుటీరములు జనశూన్యము లాయెను. పక్షిపుచ్ఛలాంఛనదీపితమై ఆమధ్యనున్న గుడిసెయే కణతునిది. ఆకేతనము శూలాగ్రమున నెగురుచుండెను. చండభాస్కరు నాతపమున కోర్వఁజాలక వాడిపోయెనోయన, నయ్యది ముడుతలువడి నిశ్చలముగ నేలనంటియుండెను. కాని, ఆశూరుని యంతరము దెలుపుట కొక్కసైనికుఁడైన, నొక్కయనుచరుఁడైన, నొక్కపరిచారకుఁడైనను ఆచక్కిఁ గానరాకుండెను. నిర్ధనస్కాచిశూరపతాక యితరశూరరహితమై, కేవలము స్వీయగౌరవపరిరక్షితమై యుండెను.

శూరకణతుఁడు ఖిన్నుఁడై తనమందిర మొక్కపరిగాంచి, హృద

యూరాట ముడంచి, తనపేదకుటీరము జొచ్చి, లోయప్రభువు నాహ్వా నించెను. ఆస్థలముగాంచినంతనే ఆంగ్లప్రభువుచిత్తము కరుణార్ద్రమా యెను; అందొకింత నిరసనముగూడ గలసియే యుండును: ప్రేమవలె నిరసనభావముగూడ గరుణారసమునకు సన్నిహితమని చెప్పనగును. ఆసమున్నతగాత్రుఁ డంతట వంగి యాపల్లంపుదీనకుటీరము బ్రవేశిం చెను. ఆగది యాతనితోడనే నిండిపోయి నటులుండెను.

అందు రెండుతల్పము లుండెను. ఒకదానిపై నెవ్వరులేరు. మంచ ముపై నాకులును, ఆపైనొక లేడిచర్మమును బఱచియుండెను. ప్రక్కను ధనుస్త్రాణాదియోధపరికరములు, తలచెంగట వెండిసిలు వయు నుండుటజూడ, నాశయ్య మనకణతునిదే కావలయునని స్ఫురిం చును. రెండవశయ్యపై రోగి పరుండియుండెను. అయ్యది మొదటి దానికంటె మెత్తగ నమర్పఁబడి యుండెను. శూరుని వస్త్రము లందుఁ బఱచియుండుట, తనయనుచరునిపై నాతనికిఁగల దయాభిమానములు వ్యక్తపఱచుచుండెను. వాఁడు నడిప్రాయము మీఱినవాఁడు, దృఢ గాత్రుఁడు, మోటు మొగము గలవాఁడు. ఆపంచయందొక బాలుఁడు మాసిన వస్త్రములుదాల్చి, పెనముపై బార్లీరొట్టెలు తయారు చేయు చుండెను. మృతహరిణభాగ మొండొకరాటను వ్రేలాడుచుండెను. ఆమృగమును వేఁటాడి చంపిన భూరితరమగు భయంకరశ్వాన మాచెం తనేయుండి, తెప్పవాల్పక పెనమువంక గాంచుచుండెను. రిచర్డునృపా లుని వేఁటకుక్కలైనను అంత పెద్దవిగావు. వార లరుదెంచినంతనే సహజగుణానుగుణముగ నాజంతువు, దూరమున వినవచ్చెడు మేఘా నాదమువలె మొఱిఁగెను. అంతలోఁ దనయజమానునిఁ గాంచి యఱపుడిగి, తలవాల్చి, తోఁక యూడించుచు, రోగికి భంగము గలి గింపరాదని మొఱిఁగిన దానివోలె నాశ్వాన మూరకుండెను.

శయ్యప్రక్కనే తోలు పఱచియున్న దిండుపైఁ గణతుఁడు చెప్పిన

మహమ్మదీయవైద్యుఁడు తన దేశాచారము చొప్పున మఠము వైచుకొని కూర్చుండెను. వెలుగులేని కారణమున నాతనివదనము బాగుగఁ గానరాకుండెను. నల్లని గడ్డ మురమువఱకు వ్రేలాడుచుండెను. ఉన్నితోఁ జేసిన నల్లని టోపీయొకటి యెత్తుగ శిరముపై నుండెను. అతఁడు ధరించిన అంగీకూడ నల్లగనే యుండెను. నిరుపమానకాంతివంతములగు వాడినయనములు తళతళ దీపించుచుండెను. దుస్సహతరమగు పేదఱికమును స్కాచిశూరుఁడౌ నంతవంతలేక భరించియుండుట లోయప్రభువునకుఁ గడువింతగఁ దోఁచెను. ఆ రంగము దారిద్ర్యమగ్నమైయున్నను, ఆతఁడు నిరసింపక యుదారమనస్కుఁడాయెను. ఒక్క రిచర్డున్నపాలుని సభాగారము దప్ప మఱియేరాజమందిరము కంటెను గూడఁ గణతుని పేదగుడిసెయే లోయప్రభువునకు గౌరవనీయముగఁ గాన్పించెను. తన్మందిరాంతర జనులందఱును వివిధాలోచనాధీనులై మౌనము వహించుటచేత, రోగి క్రమోచ్ఛ్వాస నిశ్శ్వాసములు మాత్రము గట్టిగ వినవచ్చెను. అంత స్కాచిశూరుఁ డిట్టులనెను—
"ప్రభూ! ఈ యనుచరుఁ డాఱురాత్రులనుండి నిద్రయెఱుంగఁడు"

లోయప్రభువు తోడనే యాతని కరం బందుకొని, నిజహృదయాభిమాన మచ్చుపడునట్లు నొక్కి, యిట్టులనెను—"ఉదారచిత్తుఁడా! ఈ వైఖరి మాఱవలయు. నీ యనుచరుఁ డుచితాహారాది సదుపాయములేమాత్రము నెఱుంగఁడు."

తదవసరావేశమున నాంగ్ల ప్రభుకంఠము లేచిపోయెను. తోడనే, రోగి కలఁతజెంది యవ్యక్తముగ నిట్టులనెను—"ప్రభూ! కణతమహాశూరా! పాలస్థానము నందలి క్షారజలములు ద్రావవలసి వచ్చిన మన కీనదీతోయములు—మన సీమజలము లెంత హాయి గొల్పుచున్నవి!"

"లోయప్రభూ! నాయనుచరుఁడు తన దేశము గాంచుచు హాయిగ

నున్నవాఁడు.'' అట్లు కణతుఁడు మెల్లగఁ బలుకుచుండ నాచెంతనే యున్న హాకీము రయమ్మున లేచి తాను నాడిజూచు రోగి హస్తము మెల్లగనిడి, వారిరువురి భుజములు బట్టి యల్లన ద్వారము కడకుఁ గొంపోయి, హీనస్వరమున నిట్టులనియెను—

"అయ్యలారా! నేఁ బ్రయోగించిన యౌషధ మమోఘ మైనది. రోగి నిద్రకు భంగము వొరయరాదు. ఈ పట్టున మేను మఱచి యుండక మేల్కాంచునేని, మరణించును. లేదా, మతిభ్రష్టుఁడైన నగును. కావున, సూర్యాస్తమయ మగువఱకు నిశ్శబ్దముగ నుండవలయు. అనంతరము, యజమాని తన యనుచరునితో నొక్కింత మాటాడ నగును.''

'రోగియుండు తావు వైద్యుని రాజ్య' మనుసూక్తి నిక్కము. కావున, శూరు లందుల కెదురాడక ద్వారముచెంత నిలుచుండిరి. లోయ ప్రభువు సముచితముగ సెలవు నడసి వెడలునని కణతుఁడు భావించి చూచుచుండెను. ఏద్దియో కారణ ముండుటచేఁ గాబోలు, నాతఁ డటు లొనరింపక, అట్టె నిలచి యుండెను. శ్వాన మంతలోఁ దనయజమానుని చెంతకు టివ్వునఁ బాఱివచ్చి, ఆత్రముతోఁ దన శిరంబాతని హస్తమునఁ జేర్చెను. కణతుఁడు సకగుణముగ నొక్క పలుకాడి యొక్కసారి దువ్వినంతనే, జాగిలము కడుసంతసించి, వాలము నిగుడించి, శరవేగమున నట్టిట్టు పాఱి, ఆవరణ యంతయుఁజుట్టి, పవిత్రవంతమని గణించు దానివలె, దనస్వామి పతాకము చెంతకు మాత్రముబోక మగుడ నాతని యండకరుదెంచి, తన వక్రవక్ర పరిభ్రమణమునకుఁ దానే లజ్జించునదివోలె గాంభీర్యము వహించి, నిశ్చల చిత్తమై యచట నిలుచుండెను.

తనజాగిలముగాంచి కణతుఁడును, తదపూర్వరూపమును చేష్టలును జూచి లోయప్రభువును గూడ ముదమందిరి. ఆతఁడిట్టు లనెను.—

"శూరుఁడా ! ఇట్టి శ్వానము రిచర్డు నృపాలు చెంతనుగూడ లేదు. ఇంతటి పరుగునకుఁదోడు కార్యశూరత్వము గూడ నుండునేని, తప్పక ప్రశంసనీయము. కాని, ఒక్కమాట చెప్పవలయు—వినఁ బ్రార్థించెద. ఉత్తమప్రభు బిరుదాంకితులుతప్ప సామాన్యశూరు లెవ్వరు వేటకుక్కల నుంచుకొనరాదను ప్రకటన నీవెఱుంగవా? రిచర్డు నృపాలుని యనుజ్ఞ వడయకుండ నీవిట్టు లాచరింపరాదు. నీవట్టి యనుజ్ఞ గైకొనినట్టు కానరాదు. ఏమందువు?"

"ప్రభూ! స్వతంత్రస్కాచి శూరజనోచితముగ సమాధానమొసంగెద, గమనింపుము. మదిచ్ఛానుసారముగ నరుదెంచినవాఁడనుగాని, ఆంగ్లరాజపాలితుఁడనుగాను. మీచట్టములకు నేను బద్ధుఁడఁ గాను. మీయడవి చట్టములు మీదేశమున, మీప్రజలకుఁ జెల్లును,—నాకుఁ జెల్లవు. రణదుందుభిమ్రోఁగునంతనే రయమ్మున నశ్వారూఢుఁడ నగుదును—శూలాయుధుఁడనై రిపుచమూతండములు విరామ మరయక యురుమాడుదును. అంతియేగాని, రణరంగమునుండి మఱలి విశ్రమావాసంబులనుండు సమయములందు మాత్ర మాంగ్లరాజశాసనములు మదీయ వినోదాదిచేష్టల నరికట్టఁ జాలవు."

"ఐనను, రాజాజ్ఞ నుల్లంఘించుటయవివేకము. నాకధికారముగలదు గావున, నేనే తదాజ్ఞాపత్ర మంపువాఁడను. దాన నామిత్రునకు—జాగిలమునకు—విపత్తు ఘటిల్ల నేరదు." ఆంగ్లప్రభువట్లు సాభిమానముగఁ బలుకఁ, గణతుఁడు నిర్లక్ష్యముగ నిట్లు బదులాడెను.—

"కృతజ్ఞుఁడను. కాని, నాయావరణ యెంతగలదో నాజాగిల మెఱుంగును; ఈలోన నెట్టియాపదయైన రాకుండ నేనరక్షింపఁ గలను. కాని, ప్రభూ! మత్కృతసత్కృతుల కియ్యది ప్రతిఫలము! నీకు వందనములు. కాని నాఁరస్వాలు'—జాగిలము—ఒంటిపాటున రాజకింకరులకుఁ జిక్కవచ్చును. ప్రమాదము వాటిల్లవచ్చును. నేను

సహించి యూరకుండువాఁడఁ గాను. దాన ననర్థముప్పతిల్లనగును."— కణతుఁ డంత మందహాసమొనరించి మగుడ నిట్లులనెను.—"ప్రభూ! చూచితివి గదా, మదీయ సౌభాగ్యమును, సేవక కదంబును! ఈ 'రస్సాలే' యస్మదాహార సంభారసంపాదనోద్యోగి. రిచర్డు సింహము, వేఁటాడి దొరకునంతయుఁ దానే గబళింపజూచు కథలోని సింహమువలె, వర్తింపఁడని భావింతును. ఈప్రాంతమున నితరాహారము దుర్లభము గదా. కావున, తను విశ్వాసముతోడ ననుసరించి పోరాడు శూరుఁడు వినోదమునకో, యవసరమునకో, వేఁటాడునేని, రాజు పాటింపకుండుగాక."

"శూరుఁడా! నీపలుకులెంతయు సమంజసములు. కాని, 'నార్మను' వంశజులు (రిచర్డునృపాలుఁడు నార్మనువంశజుఁడు) మృగయాపారవశ్యమున నన్యమెఱుంగరు గదా!"

"అట్టులే యగు. కాని, ఇంగ్లాండుదేశమున నడవిచట్టములు దుస్సహంబని రోసి, పెక్కండ్రుజనులు ప్రభుత్వాధికారము ధిక్కరించి, తగు నాయకులనుగూడఁ గాంచి, బలసియున్నారని చారణులవలన విని యుందుము. రిచర్డునృపాలుఁ డీదూరదేశమునఁ దనయడవిచట్టములమలుచేయుటకంటెఁ దనదేశమునగూడ మెలఁకువతోఁ దన్నిబంధనలు సడలించుటయే యుక్తమగును."

అట్టి ప్రమాదప్రసంగ మిష్టము లేనట్టులు భుజములెగురవైచి, యేమియో యవ్యక్తముగఁ బ్రలాపించి, ఆంగ్లప్రభు విట్టులనెను.— "సాయంసమయ ప్రార్థనకాలమున నేను మగుడ నరుదెంతును. ఇపుడు సెలవిమ్ము. రాజమందిరమునకు శీఘ్రముగఁ బోవలయు. నే నపుడు మ్లేచ్ఛవైద్యునితోఁ బ్రసంగించి చూతును. మఱియొకటి,— నీవు వేఱువిధంబునఁ దలంపవేని, ఉత్సాహజనకమగు పదార్థమొండు బంపఁగలను."

"ప్రభూ! నీకు వందనములు. కాని, అవసరము లేదు. నామిత్రుఁడు రాస్తాలు రెండువారముల గ్రాసము సిద్ధపఱచి యుంచెను. ఈదేశపు వేఁడిమి దుస్సహమై రోగప్రదముగూడ నైయున్నను, మాంసమెండుటకుమాత్ర మనుకూలముగ నున్నది."

వైరులవలెఁ గలసిన యోధులు మిత్రులవలె నెండ్రొరులు వీడిరి. లోయప్రభువు మ్లేచ్ఛభిషగ్వరవిషయము విపులముగఁ దెలిసికొని, సలాద్దీను సుల్తానంపిన యోగ్యతాపత్రము భద్రముగఁ దాల్చి, రాజావాసాభిముఖుఁ డాయెను.

౮

"లోయశూరా! నీసందేశము విపరీతముగ నున్నది. ఈస్కాటును విశ్వసింపఁదగునా?" అని రోగార్తుఁడగు రిచర్డునృపాలుఁడు ప్రశ్నింప, నాతఁడిట్లు బదులాడెను.

"స్కాటుల విషయము నేఁజెప్పఁ జాలను. నేను వారిదేశమునకు దగ్గఱగ నివసింతుఁ గదా. స్కాటులు దొరలు దొంగలుకూడ నగుదురు. కాని, శూరుఁడుమాత్రము గణనీయుఁడు."

"ఈస్కాటు శూరగుణగరిష్ఠుఁ డగునా?"

"రాజా! ఆపరిశీలన నీయది. యోధుఁడని నిబ్బరముగఁ జెప్పఁ గలను. జనశ్రుతియు నట్టులేయుండు."

"సందేహము లేదు. వీనిశౌర్యము నేఁ గాంచియుంటిని. మన యోధుల యుద్ధకౌశలముగాంచు కుతూహలముతోడనే నేను సేనాముఖమునఁ బ్రథమశ్రేణిలో నుందును. యశఃకాముఁడనై యట్టులొనరింతునని మూఢాత్ములు గొందఱు నన్ను నధిక్షేపింతురు. ఛీ!

హేయమగు జనస్తుతి గాంచవలయునని సాహసమొనరింతునా? మదా శయము మహత్తరము!"

రిచర్డున్నృపాలుఁ డావిధమున నెన్నఁడు భాషింపలేదు. ఆతని స్వభావ మట్టిది కాదు. యోధాగ్రేసరుఁడగు నామహానీయునకుఁ దత్ప్రశంస యెల్లప్పుడు ప్రీతికరముగ నుండెను. మరణ మాసన్నమగుట చేతనే తద్విరుద్ధముగ నాతఁడట్లు ప్రసంగించెనేమో యని లోయ ప్రభువు విచారించెను. కాని, క్రైస్తవాచార్యుఁ డప్పుడే రాజును దర్శించి వెడలెను. ఆవిషయము జ్ఞప్తికి వచ్చుటచేత వెఱ పుడిగి, లోయప్రభువు మిన్నకుండెను. రిచర్డు మగుడ నిట్టులనెను.—

"ఈశూరుని యోధకృత్యములు నేనెఱుంగుదు. తాదృశవిషయము గమనింపనిచో, నా నాయకత్వమేడ? మావితరణ మాతఁడు చవిజూచి యుండును: కాని, లోయప్రభూ! ఈశూరుఁడు తనయంతరము మఱచి, ధూర్తముగ సంచరించును సుమా."

నృపాలముఖవిలోకన మొనరించి, ఆంగ్లప్రభువు సమయోచితముగ నిట్టులనెను.—"రాజా! ఈశూరుని నేరము నేనొకింత సైరించి, మీయెడ నేర మొనరించితి"

"ఏమి! నీవా?"— రాజవదనము విస్మయాగ్రహసంకుచిత మాయెను. "వాని యపరాధము నీవు సైరించుటయా? అసంభవము."

"రాజపుంగవా! చిత్తగింపుము. మదుద్యోగాధికారము బురస్కరించుకొని, సద్వంశజులగు శూరులీదూరదేశమునం దొకటి రెండు జాగిలము లుంచుకొని వేఁటాడుట కనుజ్ఞ నొసంగఁ గలను. రాజా! ఈస్కాటుశ్వానము నెట్లు వర్ణింపఁగలను!"

"వానిజాగిల మంత శ్రేష్ఠమగునా?"

"రాజా! శ్రేష్ఠతమమని చెప్పవలయును."—ఆంగ్లప్రభువుగూడ వేఁటయం దాసక్తి గలవాఁడగుటచేత నుత్సాహవంతుఁడై, కణతుని

కుక్క నత్యుత్కృష్టముగ వర్ణించెను. నృపాలుఁడాతని యుత్సాహము గాంచి, హాసనాననుఁడై, యిట్లులనెను.—

“ఓయీ! వాఁడాజాగిల ముంచవచ్చునని సెలవిచ్చితివిగదా. చాలు. కాని, ఈశూరు లోకనాయకునకు లోఁబడక యథేచ్ఛగ విహరింతురు. వీరిని శాసించుట కష్టము. ఇట్టి యనుజ్ఞ యవిరళముగ నొసంగుదేని, మనము వేఁటాడుట కేమియు లేకపోవును. వానిమాట యటుంచుము. మ్లేచ్ఛవైద్యుని గుఱించి యేమంటివి? శూరుఁడు వాని నెడారియందుఁ గాంచెనంటివి గదా?”

లోయప్రభు విట్లు బదులాడెను.—“లేదు, రాజా! ప్రఖ్యాతపురుషుఁడగు ఎంగాడీస్వామినిఁ గాంచవలయునని శూరుని నియోగించిరట—”

లోయప్రభు వంతయు, జెప్పకమున్నె రిచర్డు నృపాలుఁడు దిగ్గునఁ గూర్చుండి, క్రోధఘూర్ణమానమానసుఁడై యిట్టులనెను.

“ఎవ్వరునియోగించిరి? ఎందులకు? అంతటి సాహస మొనరించునదెవ్వరు? మా రాణి మదీయారోగ్య సంప్రాప్తమునకై యటు యాత్ర వెడలెనే!”

“రాజా! మతయుద్ధ దీక్షాపరులను శాసించు క్రైస్తవ రాజన్యసభ్యు లాతని నియోగించిరి. కారణము మాత్రము నేనెఱుగను—చెప్పుట కాతఁడు నిరాకరించెను. రాజా! రాజ్ఞీ యాత్రారహస్య మేరికిందెలియదు. ఇతర క్రైస్తవ నృపాలురకుఁ గూడఁ దెలియదని యే భావింతును. ఈ వాతావరణము రోగవిషయ మగుటచేతఁ రాణి చిరకాలమునుండి బాహ్య ప్రదేశముల కరుదెంచుట లేదుకదా.”

“సరి. ఈస్కాటులు ఎంగాడీ నివాస ప్రాంతమున నొక సంచార వైద్యునిఁగాంచెను—గదా?”

“రాజా! అట్లు కాదు. ఈస్కాటు ఆస్థలమున మహమ్మదీయుని

ఒక అమీరునిఁ గాంచెనని యనుకొందును. ఇరువురును పరస్పర బల సాహసంబులు చవిజూచి సంచారశూర జనోచితముగా నిరువురు సుఖులై, యిరువురు గలసి ఎంగాడీ స్వామి నిలయము నకుఁ బోయిరట."

ఒకదీర్ఘ విషయము సంగ్రహముగ సూక్ష్మముగఁ జెప్పనేర్పు లోయ ప్రభువునకు లేదు. రిచర్డు నృపాలుఁడు విసిగి, "వా రీమహమ్మదీయ వైద్యునచట గాంచిరా?" యని ప్రశ్నించెను. అతఁ డిట్లు బదులాడెను.

"లేదు, రాజా! ఆయమీరు దేవరవారు విషరోగార్తు లగుట యెఱింగి, తానావిషయము తన సుల్తానునకు నివేదించి, సర్వరోగ నివారణ మొనరింపఁగల ఘనవైద్యు నాంగ్లరాజ సమక్షమున కంపు నేర్పాటు చేయింతునని పలికి పోయెనట. స్కాచిశూరుఁ డొక దినము వేచియుండెను. అంత భిషగ్వరుఁ డరుదెంచెను;—ముందఱ మంగళ వాద్యములు సెలఁగ, సామాన్య పరిచారకులేగాక ఆశ్వికపరి చారకులు గూడఁ జుట్టును గుంపు గట్టియుండ, వైభవాస్పదుఁడై తా నొక రాజువలె నేతెంచెను. సుల్తానొసంగిన యోగ్యతా పత్రములు గూడ నాతఁడు దెచ్చెను."

"మన ద్విభాషి వానిం గాంచెనా?"

"రాజా! కాంచెను.—ఇయ్యదె తదనువాదము." అని పలికి యాతఁడొక పత్ర మందీయ, నృపాలుఁడు చదువఁదొడఁగెను.

లేఖాముఖంబున నిటులుండెను. "జగదీశ్వరులగు అల్లావారియు వారి ప్రవక్తయగు మహమ్మదువారియు నాశీర్వాదములు!"—("ఛీ! ఛీ!" తదవసర నిరసనావేశమున నట్టులని రిచర్డు ఉమిసెను.) "రాజాధిరాజు, ఈజిప్టు సిరియా దేశములను బాలించు సుల్తాను, ప్రపంచమున కాధార భూతుఁడునగు సలాఉద్దీను ఆంగ్లదేశపరిపాలనా ధురంధర రిచర్డు నృపాలున కభివందన మొనరించి వ్రాయున దేమన,—

మా రాజ సోదరుఁడవు రోగార్తుఁడవై కుందుచుంటివనియు, అల్పజ్ఞులగు యూధక్రైస్తవ వైద్యులు చికిత్స చేయఁజూనిరనియు వినియుంటిమి: కాని, 'అల్లా' కరుణాకటాక్షమున్నగాని, మహమ్మదువారి దయ యున్నగాని, తెవులు మఱల నేరదు.——" ("ఛీ! ఛీ!" రిచర్డు మగుడ విసుగుకొనెను.) "ఆ కారణమున నస్మదీయ ప్రత్యేక వైద్య శిఖామణియగు 'అడంబేకు' హకీమును భవదీయ రోగనివారణార్థ మంపితిమి. ఈ హకీమును గాంచునంతనే, మృత్యుదేవత పక్షవిక్షేప మొనరించి రోగనిలయమునుండి తివ్వనఁబాఱిపోవును. ఈభిషగ్వరుఁడు వివిధశిలామూలికా గుణంబులను, సూర్యచంద్ర నక్షత్ర గమనంబులను నెఱింగి, మనుజుని నిజలలాట లిఖిత శాసనమునుండి తప్ప మఱెట్టి యాపదనుండి యైనను రక్షించు దక్షుఁడు. రాజా! ఇట్టి మహామహిమాన్వితుని సాహాయ్యమున నారోగ్యవంతుఁడవు గావలయునని ప్రార్థించువాఁడ. నీవు సకల ఫరంగీదేశ యశస్సాంద్రుఁడవు. మఱియు, మదీయాస్త్రధారకు గౌరవము దేఁగల మేటిశూరుఁడు నీచమానవునివలె వ్యాధిగ్రస్తుఁడై మరణించుట నేసహింపను. మఱియొక కారణమేమన, మీకును మాకునుగల వివాదముల నిరువురకు గౌరవ భంగము కాని క్రమమార్గమునకో, లేదేని, సక్రమరణరంగమునకో, పరిష్కారము గావలయుననియుఁ గూడ నాసింతును. కావున, పూజ్యుఁడగు మహమ్మ——"

"చాలు, చాలు! ఈప్రవక్త నింక సహింపజాలను! ప్రతాపశాలియగు సుల్తాను ఎన్నఁడో చచ్చిన వానియెడ విశ్వాసబద్ధుఁడై యుంట కరము సంతాపకరము. ఆతఁడంపు వైద్యునిఁ జూచెదఁగాక. ఈహకీము మదీయ శిథిల శరీరమునకుఁ జికిత్స సేయుఁగాక. సలాద్దీను నాహ్వానము ప్రశంసనీయము. ఆరోగ్య మలవడు నంతనే కృతజ్ఞతాపూర్వకముగా నాయుధము ధరించి యాప్రసిద్ధ వీరుని ఖండించెద.

లేదేని, యఘపూర్వ ప్రహారంబుల నొప్పించి యాతని బవిత్ర క్రైస్తవ మతస్థు నొనరింతును. దారుణ రణరంగముననే, తా నొనరించిన యఘములు దలంచుకొని, మదీయ శస్త్రాంతరములగు పరస్పర రక్త మయతోయములతోడ, జ్ఞానస్నాన మాచరించి సలాఉద్దీను క్రైస్తవు డగుంగాక. లోయా! ఇంక నేల తడయువలయు? ఈకార్య మానంద దాయకము—రయమునఁబోయి, హాకీమును గొనిరమ్ము!"

జ్వరబాధాధికమున రిచర్డు నృపాలుఁ డుచితానుచితములు మఱచి యుండునని యెంచి, లోయప్రభు విట్లులనెను.—

"రాజా! సలాద్దీను మ్లేచ్ఛుఁడు—మన కసాధ్యుడగు ప్రబలవిరోధి: నీవు నసాధ్యుఁడవు—" ఆతనివారించి రాజిట్లులనెను.—

"కావుననే, నేను తీవ్రవ్యాధిగ్రస్తుఁడనై మడియకుండ ఆతఁడు రక్షింపఁ జూచును. నేనాతని ప్రేమించుచుండుటవలన నాతఁడు నన్ను ప్రేమించునని యెఱుంగుము. ఉదారమనస్కులగు వైరులస్వభావ మట్టిది—సలాద్దీను ననుమానించుట పాపము!"

"ప్రభూ! ఐనను, వేగిరపడరాదు. ఈ హాకీము స్కాచివీరుని యను చరునకుఁ జకిత్స చేయుచున్నాఁడు: పర్యవసానముగాంచి మనమిటకు రప్పింతముగాక. రాజా! నాప్రాణ మొక చీకికిం గొనువాఁడనుగాను: కాని, అఖిలక్రైస్తవాన్వయనౌక శిలాభగ్నమగుట మాత్రము సహింపఁజాలను."

"లోయా! నీ వీపగిది ప్రాణాపేక్షాపరుఁడవై యెన్నఁడు వెనుదీసి యెఱుంగవే!" నృపాలుఁడట్లు నిందాగర్భితముగఁ బలుక, ఆంగ్లప్రభు విట్లు బదులాడెను.—

"ఇప్పుడైనను వెనుదీయువాఁడఁ గాను. నాకై యెన్నఁడు దత్తర పడను. కాని, నీ కపాయము వొరయరాదు."

"అనుమానగ్రస్తమానవా! కానిమ్ము.—పొమ్ము. చికిత్సక్రమ

మరసిరమ్ము. ఆహా! అవ్వల వీరధ్వానము లెగురుచుండ, నికృష్టరోగ పీడితవృషభముభాతి నిటఁబడియుంట దుస్సహము! ఈయౌషధ ప్రభావమున నారోగ్యవంతుఁడ నగుదుఁ గాక; లేదేని, రయమ్మున మరణింతుఁ గాక!"

లోయప్రభువు వెడలెను. ఆతనిచిత్తము మఱియొక యనుమాన మున కగ్గమాయెను. వైరియగు సుల్తానంపు హకీమును విశ్వసించుట యపాయకరమగుటయే గాక, మ్లేచ్ఛునిఁ జేరనిచ్చుట పాపావహము గావచ్చును. ఆవిషయము మతాచార్యునిఁ బ్రశ్నించి సంశయనివా రణ మొనరించుకొనవలయునని యూతఁడు నిశ్చయించెను.

లోయప్రభువు తదాలోచనాధీనుఁడై నడచుచు, దలయెత్తి పరి కించునంతనే యదృష్టవశమున 'టైరు' నగరప్రధానాచార్యుఁడు కాన్పిం చెను. ఆతఁడాంగ్లరాజ హితాభిలాషియని లోయప్రభువు సంతుష్టాం తరంగుఁడై తనయనుమానము వెల్లడించి, ఆయాచార్యుఁ డేమనునో యని ససంభ్రమముగ నిరీక్షించెను. ఆతఁడు లోలోన నవ్వుకొని, ఇట్టు లనెను.—

"ఔషధములు సాధారణముగా నికృష్టపదార్థభవములు; అట్టులే యౌషధజ్ఞులుగూడ నీచకులసంభవులగుదురు గాక: ఐననేమి? ఔషధ ములును, తద్విషయజ్ఞులును గూడ నక్కఱకు వత్తురు. అవసరసమయ మున మ్లేచ్ఛాదికు జనసాహాయ్యము వడయఁ దగును: అందులకే వారు జీవించియున్నారని తలంచుట కవకాశము గలదు. కావుననే, క్రైస్తవేతరజనంబులను బానిసలుగా స్వీకరింతుము. ఇందులకాధా రము మనమతగ్రంథములందుఁ గూడఁ గాన్పించును. మఱియొకటి గమనింపుము. యూదులుగూడఁ గ్రైస్తవమతేతరులే గదా; కావున, వారును మహమ్మదీయులవలె మ్లేచ్ఛులే యగుదురు: యూదులు మనశిబిరమునందు వైద్యము జేయుచునే యున్నారు. మహమ్మదీ

యులుమాత్ర మేల చేయరాదు!''

ఆచార్యుఁడు కొన్ని 'లాటిను' భాషాశ్లోకములుగూడఁ దత్సమయానుకూలముగఁ జదివెను. ఆతని పలుకులు సమంజసముగ నుండుటచే లోయప్రభువు సంశయముడిగి సంతసించెను. మన హైందవులకు సంస్కృతశ్లోకములువలెనే క్రైస్తవులకు 'లాటిను' భాషాశ్లోకములు పవిత్రభూయిష్ఠములు: ఆకారణమున, నాంగ్లప్రభువు తదర్థమెఱుంగనివాఁడయ్యుఁ, గడు ముదమందెను.

మతేతరుఁడగు నంతమాత్రమున మహమ్మదీయవైద్యుని నిరసింపరాదని యాచార్యుఁడు నిబ్బరముగ నాడినను, ఆతని చిత్తమింకొక యనుమానమునకు గుఱియాయెను. మహమ్మదీయవైద్యుఁడు దురాలోచనాపరుఁడై రాజున కపచార మాచరింపవచ్చును. ఆంగ్లప్రభువంతట సలాద్దీను పంపినజాబు నాతని కొసంగెను. ఆతఁ డనువాదమును మూలమునుగూడఁ గాంచి చింతించి చింతించి, తుదకిట్టులనెను.

"ఆంగ్లరాజాభిరుచి గుర్తించిన సలాద్దీను చక్కని యెరవైచెను. కుమతియగు సారసేనుఁడు విశ్వసనీయుఁడుగాఁడు. విషప్రయోగమునం దీజాతివారు కడు నిపుణులు. తద్విషప్రభావము వారముల పర్యంతము వ్యక్తముగాక, లోలోనఁ బనిచేయుచుండును. ఆ దుష్టాత్ముఁడీలోన సులభువుగాఁ దప్పించుకొనఁగలఁడు. వస్త్రమును, చర్మమును తుదకుఁ గాగితములనుగూడ విషపూరితములుగ నొనరింపఁగలరు. ఎంత ప్రమాదము! మూఢుఁడనై సుల్తానుపంపిన లేఖ స్పృశియింపుచుంటిని—ఉత్తమాంగము చెంతకుఁగూడ జేర్చుచుంటినే! లోయప్రభూ! నీ లేఖలు నీవగ్రైకొనుము!"

తద్విపరీతానుమానబాధితుఁడగు నాచార్యుఁ డట్లు పలుకుచుఁ బాపావహమగు మహమ్మదీయ లేఖవీడి, మగుడనిట్టులనెను. కాని, చిత్రకలాంఛనుని సదనమునకేగి వాని యనుచరుఁ డెటులుండునో

చూతము. అనంతరము హకీము రాజాగారమున కరుదెంచు విష యము వితర్కింతము. మఱచితి!—నా సుగంధచూర్ణము నిరంతర మాఘ్రాణింపవలయు— ఈ జ్వరములు సులభముగా నంటును. నీవు గూడ భద్రముగ నుండవలయు. చికిత్సావిధానము నాకును గొంత తెలియును.''

"ఆచార్యా! కృతజ్ఞుఁడను. ఇయ్యది యంటురోగమే యగునేని, నేను జాలకాలము క్రిందటనే జ్వరపీడితుఁడనై యుండువాఁడను. నేనెల్లపుడు రిచర్డు నృపాలుని చెంతనుందుగదా."

ఆచార్యుని మోము చిన్నవోయెను. రోగము తనకంటునను భయముచేతనే యాతఁ డింతవఱకు నాంగ్లరాజేంద్రునిఁ జూడలేదు.

ఆచార్యప్రభువులు స్కాచిశూరుని నికృష్టనివేశనము సమీపించిరి. అంత నాచార్యుఁ డిట్టులనెను—"ప్రభూ! ఈ ప్రదేశమెంత దరిద్రముగ నున్నది! స్కాచి శూరానుచరుల యవస్థకంటె మన కుక్కల స్థితి చాల మేలుగఁ గాన్పించును. ఈ శూరుఁడు యశోవంతుఁడని వినియుందుము. యుద్ధవిరామ సమయములందుఁ బ్రధానరాయబారభారధురంధరత్వమునకుఁగూడఁ దగినవాఁడగు. అట్టి మేటిశూరుని యనుచరుఁడు శ్వానముకంటెను హేయతరంబుగ నీ నికృష్టపు గుడిసెయందుఁ బడియుండెనే! స్కాటులు నీకు సన్నిహితులుగదా,—ఏమందువు?"

"తానెట్టి సదనమున విడిసియుండునో యట్టి యావాసమునే తన యనుచరునకుఁగూడ నొసంగు శూరుఁడు తప్పక మంచివాఁడే యగును."

లోయ ప్రభువట్లు సమంజసముగఁ బలికి ఆ గుడిసెయందుఁ బ్రవేశించెను. ఆచార్యుఁ డిష్టము లేనివాఁడయ్యుఁ జేయునదిలేక వెంట జొచ్చెను. ఆతఁడు సహజముగా నధీరుఁడుగాఁడు, కాని, తీవ్రపడినచో

నెట్టి ప్రమాద ముప్పతిల్లునో యని మాత్రము శంకించును. కాని, ఈ సమయము సాధారణమైనది కాదు. ప్రసిద్ధాంగ్ల రాజక్షేమము కొఱకు నరుదెంచిన యరబ్బీవైద్యుని ప్రావీణ్యము దప్పక పరీక్షింపవలయు నని గుర్తించి, సంశయముడక్కి, అతఁడు తనుగాంచు నంతనే వినయ వినమ్రుఁడు గాఁగల గాంభీర్యముదాల్చి, క్రైస్తవాచార్యుఁడు సగర్వ ముగ రోగమందిరప్రవేశ మొనరించెను.

గంభీరాకారుఁడగు నాచార్యునిమూర్తి నిక్కముగ దర్శనీయ ము. ప్రాయమున నాతఁడు మిగుల రూపసియునై యుండెను: ఇప్పుడు ప్రాయము మీఱినను, అట్టులే యుండఁగోరును. అతని వస్త్రధారణ ము నిరాడంబరముగ నుండక, వైభవసమన్వితమై, సవలక్షణ లక్షి తమై, మనోహరమై యుండెను. స్వీయకరాగ్రవిరాజితాంగుళీయ ము లపూర్వోజ్జ్వలములై, ఒక చిన్నరాజ్యము గ్రయము చేయఁదగు విలువగలిగి యొప్పారెను. వేసవియగుటచే శిరమువీడి వెనుక వ్రేలాడు టోపీ మేలిబంగారు సూనములతో మెఱయుచుండెను. వయస్సు కార ణమున నెరసిన గడ్డము వక్షమునకంటెను. ఒక శిష్యుఁడు పర్ణఛత్రి ముపైవ, మఱియొకఁడు నిజగురు తాపోపశమనార్థము బర్హిబర్హాచా మరము వీచుచుండెను.

టైరునగరాచార్యుఁడు ప్రవేశించినపుడు స్కాచి శూరుఁడగు కణ తుఁడందులేఁడు. అతఁడు గాంచ నరుదెంచిన మ్లేచ్ఛభిషక్కు, పెక్కు గంటల క్రిందట లోయప్రభువు వెడలినప్పు డెటులుండెనో, యట్టులే రోగిచెంత నొక ఆకులచాపపై నప్రమత్తుఁడై కూర్చుండియుండెను. రోగి గాఢనిద్రాపరుఁడై యుండ, చికిత్సకుఁ డాతని నాడిప్రాయిక ముగాఁ బరీక్షించుచుండెను. తనయంతటి మహనీయునిఁ గాంచునం తనే అరబ్బీవైద్యుఁడు వినమ్రుఁడై తదుచితస్వాగత మొసంగునని భావించిన యాచార్యున కాశాభంగమాయెను. అతఁడు రెండుమూఁడు

నిముసములు నిలిచివేచియున్నను, మహమ్మదీయుఁడు లేచి స్వాగత మీయకుండుటయేగాక, ఒక్క సాధారణవీక్షణము మాత్రము బఱపి మగుడ స్వీయకార్యపరతంత్రుఁ డాయెను. కావున, క్రైస్తవుఁడే యాతని సంబోధించి నమస్కృతి యొనరించెను. మహమ్మదీయుఁడు నిజదేశ సామాన్యాచారపురస్సరముగ 'సలా మాలేకుం' అని **మాఱు** పలికి మిన్నకుండెను. తాఁగృశావమానము సహింపనేరక, కనలి, ఆచార్యుఁ డిట్లు ప్రశ్నించెను.

"మ్లేచ్ఛా! నీ వొకవైద్యుఁడవా? ఆ విషయము నీ తోడఁ బ్రసంగింపవలయు."

"వైద్యము గుఱించి సుంతైన నెఱుంగుదేని, రోగు లుండు తావు వైద్యజనప్రసంగోచితరంగము కాదని యెఱింగియుందువు."— అంతలోఁ గణాతునిశ్వాసము రెండవగదినుండి మందమందముగ మొఱుఁగుచుండెను. మహమ్మదీయుఁడు మగుడ నిట్లులనెను.— "ఆలించితివి గదా! కుక్క యొక జంతువయ్యు, నీకు వివేకము గఱపఁగలిగియున్నది; కేవలము స్వాభావిక గుణప్రభావముననే, ఎలుగెత్తి మొఱుఁగరాదని యెఱిఁగి, మెల్లమెల్లగ నఱచుచున్నది. ఏమైన మాటాడవలయునేని, రమ్ము. అవ్వల కేగుదము."

తా నొక మహాపురుషుఁడ ననియు, సర్వజనవంద్యుఁడ ననియు విశ్వసించి యరుదెంచిన క్రైస్తవాచార్యు నట్టులాడిన మహమ్మదీయ వైద్యుఁడు సామాన్యవస్త్రములు దాల్చియుండెను. సమున్నతమూర్తి యగు నాచార్యునికంటె నాతఁడు హ్రస్వాంగుఁడు. ఐన నాతని వదనమనూనకాంతివంతమై యపూర్వముగ నుండుటచేత, నాచార్యుఁడు పరిభూతచేతస్కుఁడయ్యు నెదురాడనేరక మిన్నకుండెను. అవ్వలి కరిగినంతనే, తా నాతనితో నెట్లు ప్రసంగింపవలయునో యని గాఢముగ నాలోచింపుచు, నాచార్యుఁడు నాలుగైదు నిమిషము లాడంబేకు

వదనము ననిమిషనయనమునఁ దిలకించెను. వైద్యుని కురు లాతఁడు ధరించిన యెత్తగు టోపీయందుఁ బూర్తిగ నడంగెను. ముఖముగూడ గొంత మఱుఁగువడియున్నను, సమున్నతముగను, విశాలమగు చెక్కులవలె నునుపుగను గూడ నుండెనని కాన్పించుచుండెను. నయన తీక్ష్ణము ముందే ప్రశంసించియుంటిమి.

బేకు యాతావ్వనుఁ డనియుఁ గూడ గుర్తించి యాచార్యుఁడు ససంభ్రమముగ, "నీప్రాయ మెంత ?" యని ప్రశ్నించెను. వైద్యుఁ డిట్లు బదులాడెను.

"సాధారణ మానవప్రాయము ముఖరేఖలు గాంచి యరయఁదగు : జ్ఞానులప్రాయమో,—వారి విద్యలవలన మాత్రము దెలియవలయును. నేను శతసంవత్సరములు మీఱినవాఁడనని వక్కాణించుటకు సాహసము చాలదు."

ఆచార్యుఁడు భావగర్భితముగ శిరఃకంప మొనరించెను. బేకు పలుకులను స్థూలముగ గ్రహించిన లోయ ప్రభువు, కేవల మొక యువకునివలెఁ దోఁచు భిషక్కు నూరేండ్లవృద్ధుఁ డెట్లగునని వెఱఁగందెను. ఆచార్యుఁ డంతలో నధికారపూరిత స్వరంబున నిట్లు ప్రశ్నించెను. "వైద్యుఁడా! నీవిద్యాప్రావీణ్యమునకు నిదర్శనమెద్ది ?"

"మేటి సలాఉద్దీను సుల్తాను మాటగలదుగదా—" బేకు భక్తిపూర్వకముగాఁ దన యుప్షీష మంటెను.—"మిత్రుల యెడనైన, శత్రులయెడనైనను సరె, మాసుల్తాను మాట యమోఘము. క్రైస్తవుఁడా! ఇంతకంటె నీకేమి కావలయు ?"

"అట్లు కాదు. నీకౌశలము నేఁ గాంచవలయు ; నీ వపుడు రిచర్డు రాజసాన్నిధ్యము జేరఁగలవు !"

"రోగి పునరాయుష్మంతుఁ డగుటవలననే, వైద్యుఁడు యశోవంతుఁడగు. ఈశూరానుచరునిఁ జూడుము ! మాక్రైస్తవ శిబిరమును

దెల్లని కంకాళములతో నింపినై చిన విషజ్వరమునకుఁ జిక్కి, యీతఁడు శల్యావశిష్టుఁడై మృతప్రాయుఁ డాయెను. క్రైస్తవవైద్యము నిష్ప్రయోజనము: నేఁటి ప్రభాతముతోఁబాటు మృత్యుదేవత యిందుఁ బ్రవేశించెను: ఇఁక జీవితాశ సున్న. అంతట నేను బ్రవేశించితిని: మృత్యువున కిఁకఁ బలాయనము తప్ప గత్యంతరములేదు. ఇఁక నన్నుఁ బ్రశ్నలతో బాధింపక, యీయద్భుత పరిణామము గమనింపుము."

ఆడంబేకట్లు పలికి, కొంత డొక సాధనంబున వేళగట్టి, సాయంప్రార్థనావసరమాయెనని గ్రహించి, పవిత్రవంతమగు మక్కానగరము వంకఁ దక్షిణ మభిముఖుఁడై దైవప్రార్థన మొనరించెను. అట్టి ప్రవర్తనము క్రైస్తవాచార్యునకును నాంగ్లప్రభువునకును దుస్సహముగనుండెను. ఐనను, వారు సహించి యూరకుండిరి.

మహమ్మదీయుఁ డంతట లేచి, గదిలోనికిఁ బోయి, రోగినిడాసి, వాని నాసికయం దెద్దియో యొక్కచుక్క భస్మముగవైచెను. ఆతఁడు తోడనే తుమ్మి, తత్క్షణానంతరము మేల్కాంచి, భయభ్రాంతుఁడై యటిటు గలయఁజూచుచుఁ గూర్చుండఁ గడంగెను. రక్తమాంసరహితమగు వాని శరీరము చూచుటకు భయావహముగనుండెను. చర్మమసలే లేని యటులు, దేహమునందలి శల్యములును ఉపశల్యములును స్ఫుటముగఁ గాన్పించుచుండెను. మొగము నిడుపుదేఱి ముడుతలువడెను. తెలివి వచ్చునంతనే చూపు నిలుకడలేక పరిభ్రమించినను, క్రమముగా స్థిరపడెను. తన యెదుట నెవ్వరో, గౌరవనీయులెవ్వరో యుండిరని కొంచెము గ్రహించి, తొట్రిలి, వినయావ్యక్తస్వరంబునఁ దన స్వామి కొఱ కాతఁడు ప్రశ్నించెను. లోయప్రభువిట్లు లడిగెను.

"అనుచరా! మమ్మెఱుంగుదువా?"

"ప్రభూ! బాగుగఁ దెలియదు. కలలు గాంచుచు జాలకాలము నిద్రించితిని. ఐనను, ఎట్టి సిలువ గురుతు జూడ, నీవొకమేటి యాంగ్ల ప్రభుఁడవు గావలయు. ఈమహానీయుఁ డాచార్యుఁడు గావలయు— నేఁ బాపాత్ముఁడ—ఆశీర్వాదము దయచేయుము."

ఆచార్యుఁడు తోడనే ప్రసన్నుఁడై, రోగి చెంతకు మాత్రము బోక, దవ్వుననుండియే సిలువ నభినయించి, రోగార్తుఁడు సంతసించునట్లు దీవించెను. మహమ్మదీయ భిషక్కిట్టులనెను.—

"జ్వర ముపశమించెనని నీవు గ్రహించి యుందువు—రోగి కృతజ్ఞ స్మారకుఁడై శాంతముగ మాటాడెఁగదా—నాడియు నిదానముగ నున్నది—నీవు గూడఁ బరిశీలింపుము."

కాని, రోగియుండు తావున కరుదెంచుటకే ధైర్యము చాలక ఎట్టులెట్టులో వచ్చిన యాచార్యుఁడు భయంకర జ్వరపీడితుని నెట్లు స్పృశియింపఁగలఁడు? లోయప్రభు వట్టు లుపేక్షింపఁజాలక, రోగి చేయిబట్టి, జ్వర ముడిగెనని సంతసించెను.—"ఆచార్యా! ఆశ్చర్యకరము! ఈయనుచరుఁడు నిక్కముగ రోగవర్జితుఁడాయెను. ఈవైద్యు నికఁ రిచర్డు నృపాలు చెంతకుఁ గొంపోవలయు; ఏమందువు?"

అంత నామహమ్మదీయ భిషక్కిట్టులనెను.—

"తాళియుండుఁడు. ఈచికిత్స పూర్తి కానిండు; పిమ్మట మఱియొకదాని కుద్యమింపనగును. ఈదివ్యౌషధ మింకొక మోతాదు ఇచ్చి, నీతో రాగలను."

అట్లు పలికిన యాదంబేకు నిర్మల నీర మొకింత దీసి, తన పట్టు చిక్కము విప్పి, తన్నికటస్థులకుఁ గానరాని పదార్థము దీసి యాజలమున నుంచెను. వారు మాటాడక ఐదునిమిషములు నిరీక్షించిరి. నీరము కొంచెము పొంగినటులాయెను. వైద్యుఁ డంతట రోగి నుద్దే

శించి యిట్టులనెను.—“ ఈయౌషధము ద్రావి, సుఖముగ నిద్రించి, రోగవిముక్తుఁడవై మేల్కాంచుము.”

“ ఏమి ! ఈయల్పౌషధమే నృపాలునకుఁ గూడఁ బ్రయోగింతువా ? ” ఆచార్యుఁ డట్లు ప్రశ్నింప, మహమ్మదీయుఁ డిట్లు బదులాడెను.—

“నే నొక దరిద్రుని బ్రదికించితిఁ గదా. క్రైస్తవ నృపాలురు తమ యల్ప ప్రజాళివలెఁ గాక వేఱొక మట్టితో సృజింపఁబడిరా ? ”

లోయప్రభు విట్టులనెను.—“ ఈవైద్యు నీతుణమ నృపాలసన్నిధికిఁ గొంపోవలయును. ఈతఁడు నిక్కముగ సమర్థుఁడు. తన సామర్థ్యము జూపఁడేని, యీతని పని బట్టింతును.”

అనంతరము వారు లేవఁబోయిరి. రోగి యంతటఁ దనకు సాధ్యమగు విధమున నెలుఁగెత్తి, కడునాతురంబున నిట్టులనెను.— “ పూజ్యులారా ! మహనీయులారా ! దయయుంచి, నా స్వామి సమాచార మెఱిఁగింపుఁడు : ఆతని క్షేమవార్త వినులఁబడునేని, హాయిగ నిద్రింపఁగలను. ఆచార్యుఁ డిట్లు పలికెను.—

“ ఓయీ ! నీస్వామి మహాకార్యభారము వహించి దవ్వున నున్నవాఁడు. కొన్నిదినములలోఁ దిరిగి రాఁగలఁడు.”

లోయప్రభు వంత రయమ్మున నిట్టులనెను.—“ ఆచార్యా ! వానినట్లు బాధింపనేల ? పరిచారకా ! నీయజమానుఁడు సురక్షితముగ మఱలి వచ్చెను,—నీ విప్పుడే చూడఁగలవు.”

ప్రభుభక్తిపరాయణుఁడగు నాయనుచరుఁడు చెప్పరాని యానందము బొంది, కృశీభూతములైన కరములు కృతజ్ఞతా పూర్వకముగాఁ బైకెత్తి దైవమును సంస్మరించి, యౌషధప్రభావము వారింపఁజాలక తల్పమున వ్రాలి నిద్రవోయెను. ఆచార్యుఁ డిట్టులనెను.—

“ లోయప్రభూ ! నీవు నాకంటె నేర్పరివే ! ఔను, సత్యము బలికి రోగిని బాధించుటకంటె, నుచితముగ నసత్యమాడుటయేమంచిది.”

"ఆచార్యా! ఏమంటివి? ఇట్టివారలు పదిమంది చత్తురుగాక! అన్యుల నూడుదునా?"

ఆంగ్లప్రభువట్లు వాడిగఁ బలుక, నాచార్యుఁడు విహ్వాలించి యిట్లు లనెను.—"ఇపు డంటివి కదా—చిత్రకలాంఛనుఁ డరుదెంచెనని! వాఁ డింకను రాలేదే."

"రాకేమి? నే నాతనితోఁ బ్రసంగించియుంటిని. ఈవైద్యుఁ డాతనితోడనే యరుదెంచెను."

"హా! ఆవార్త ముందే యేల చెప్పవైతివి?"

ఆచార్యుఁడుప్రకంపితహృదయుఁడై యట్లు ప్రశ్నింప, నాంగ్లప్రభు విట్టులనెను.—

"చెప్పలేదా? ఐనను, మ్లేచ్ఛాగమనమునకును, రాజరోగనివారణమునకును స్కాచిశూరుని రాకతోడ నేమి సంబంధముగలదు?"

"కలదు, చాల కలదు." ఆచార్యుని చిత్తము సంక్షోభించెను. చేతులు బిగించి, యాతఁడు పుడమిం దన్ని, నిజహృదయాందోళన మచ్చుపడ నిట్టులనెను.—"ఈశూరుఁ డేమాయె? ఎందుఁ గాన్పించు? ఎంతటి ప్రమాదము వాటిల్లెను! దైవము రక్షించుఁ గాత!—"

లోయప్రభువు నిశ్చలముగ నిట్టులనెను.—

"అవ్వల నొక పరిచారకుఁడు వేచియున్నాఁడు. వాఁడు తన యజమాని యునికిఁ దెలుపవచ్చును."

కణతుని సేవకుఁ డొక బాలుఁడు. వానిని బ్రశ్నింప, దనకుఁ దెలిసియుఁ దెలియని భాషయం దేమియో వాఁడు చెప్పెను. అందలి సారాంశమియ్యది. ఆంగ్లరాజోద్యోగి యొకఁడు వారు రాకమున్నె యచటి కరుదెంచి, కణతుని రాజసాన్నిధ్యమునకు గొంపోయెను. తదాలాపమారుతాహతి నాయాచార్యహృదయపారావారము పూర్తిగ సంక్షోభించెను. లోయప్రభువు సహజముగ ననుమాన

స్వభావుఁడుగాఁడు. సూక్ష్మగ్రాహియుఁగాఁడు: ఐనను, ఆచార్యచిత్త విభ్రమ మాతనికిఁ గూడ వ్యక్తమాయెను. దుస్సహమగు నారాటము నాచార్యుఁ డడంపఁ బ్రయత్నించు కొలఁదియు నధికతరము గాఁ జొచ్చెను. ఆతఁ డాతావున నిఁకఁ బడయనేరక, వడివడి సెలవు గైకొని, రయమ్మునఁ బోయెను. లోయప్రభువు విస్మితుఁడై యటుఁ దిలకించి, యనంతరము మహమ్మదీయ వైద్యునితోడ రిచర్డు శిబిరమునకుఁ బ్రయాణమాయెను.

౬

లోయప్రభువు మందగమనమున రాజమందిరము సమీపించుచుండెను. ఆతని చిత్తము విచారసంక్షుభిత మాయెను. ఆతఁడు కేవల యోధయే గాని, యితర లౌకికవిషయములందు నేర్పరి కాఁడు. ఎద్దియైన నాకస్మికముగ సంభవమగునేని, ఆతఁడు నివ్వెరపడి చూచును. అంతటి మందబుద్ధికి సహితము టైరునగరాచార్యుని ప్రవర్తనము విపరీతముగ గాన్పించెను. మహమ్మదీయ వైద్యుఁడు తాము జూచుచుండ స్కాచిశూరుని యనుచరుని మృత్యువునుండి తప్పించెను. అట్టి నిపుణుఁ డాంగ్ల మహారాజున కారోగ్యము బ్రసాదింపఁగలఁడని భావింపనగు: చిత్తము తాదృశాలోచననిర్మగ్నమై యుండక, స్కాచిశూరుఁ డరుదెంచెనని వినునంతనే యాచార్యుఁడు విపరీతసంభ్రమాకులుఁడు గానేల? సకల దేశాగత శూరజనంబులలోఁ గణతునివంటి దౌర్భాగ్యుఁడు మఱి యొకఁడు లేఁడని లోయప్రభువు భావించును. అట్టి యల్పునిఁ దలంచునంతనే విగతస్మారకుఁడై యాచార్యుఁడు తొట్రిలనేల? ఆంగ్లప్రభువు గూడ సహజ మందజ్ఞత దొలంగి, అనుమాన బాధిత మానసుఁ డాయెను. చిత్తము వివిధానుమానములచేఁ గలంగెను.

తుఁడాంగ్లప్రభు చిత్త మొక తీవ్రానుమానమున కగ్గమాయెను. ఎంత ప్రమాదము! ఖైబరునగరాచార్యుఁడు న్యాయాన్యాయములు గణింపని తంత్రజ్ఞుఁడని కొందఱు జను లందురు. అట్టి కుజను లందఱుం గలసి రిచర్డు నృపాలుని కిట్టి కుట్రలు పన్నుచుండిరి కాఁబోలు! శూరశిఖామణియై, సకలక్రైస్తవనాయకశిరోమణియై యఖర్వబలసాహసోపేతుఁడై యొప్పు తన తేఁడు కేవల మాదర్శప్రాయుఁడని లోయ ప్రభువు విశ్వసించెను. కాని దురదృష్టముగొలఁది నా మహాపురుషుఁడు దుర్బల దుష్టరాజన్యులకు మత్సరకారణుఁడై వివిధనాయకుల దూషణములకు గుఱియై యుండెనని కూడ నాతఁ డెఱుంగును. పలు దేశముల నుండి యరుదెంచిన క్రైస్తవదేశాధీశు లేకాభిప్రాయబద్ధులయ్యు, మహమ్మదీయుల నుక్కడఁగింపవలయునను పవిత్రాశయము మఱచి యసాధ్యాంగ్లరాజును భంగపఱచుటకు వెనుదీయరని లోయప్రభు వెఱింగి యుండెను. ఆతఁ డిట్లు చింతించెను.

"హకీము స్కాటిశూరానుచరుని వ్యాధి మఱలించి—నిజముగ మఱలించెనో, మఱలించినట్లు నటించెనో తెలియదు—మాకు నమ్మకము గల్గించి, కుటిలాత్ముఁడై రిచర్డునృపాలుని డాయఁ బ్రయత్నింపరాదా? స్కాటిదేశభవుఁడగు చిత్రకలాంఛనుఁ డందులకు దోహదమొసంగియుండును. ఆచార్యునకుఁ గూడ సంబంధ ముండవచ్చును."

కాని, అట్లు భావించుట కొక యంతరాయము బొడసూపెను. కణతుఁడును ఆచార్యుఁడును మంతన మొనరించియుండినచో, దా నరుదెంచునంతనే ఆ స్కాటిశూరుఁడు తన మిత్రు నేల దర్శింపఁడు? ఆచార్యుఁ డేల ప్రమాన్పడును? ఇయ్యది కొంత విరుద్ధముగ, నసందర్భముగ నున్నను, ఆంగ్లప్రభు ననుమానము తొలంగకుండెను. ఆచార్యుఁడు కుటిలుఁడు; స్కాటిశూరుఁడు వేషధారి; వచ్చిన వైద్యుఁడు మ్లేచ్ఛుఁడు: ఇట్టి గ్రహకూటమువలన మంచి ఫలము గలుగనేర

దనియు, దుష్టఫలమే ప్రాప్తించుననియు నాతఁడు విశ్వసించి, ఇట్టి విషమ పరిస్థితులందు సర్వము తన నృపాలున కెఱింగించుటయే శ్రేయస్కర మని నిశ్చయించెను.

ఆంగ్లనృపాలుఁ డెట్టు లుండెనో యరయవలయు. స్కాచిశూరానుచరజ్వరనివారణకార్యపరతంత్రుఁడగు హాకీము నైపుణ్య మరసి, యాతనిఁ గొనివచ్చుట కేగిన లోయప్రభువు ఱెక్కలు గట్టుకొని సత్వర మరుదెంచునని రిచర్డు భావించి నిరీక్షింపుచుండెను. ఆతఁ డట్లు శీఘ్రముగ రాకుండుటచేత నృపాలుఁడు విసుగుజెందెను. కాల మతిక్రమించుకొలఁది నాతని చీకాకు అధికతరము కాఁజొచ్చెను. దాన రోగబల మతిశయింపఁ జిరాకు గుఱియుఁ బెరిగెను. నిజహృదయారాట మడంచుకొనవలయునని యాతఁడు సర్వవిధముల బ్రయత్నించెను. సేవకులను వినోదములు గల్పింపఁగోరెను; ప్రార్థనగ్రంథము దెమ్మనెను; చిత్రకథ లాలింపఁ గడంగెను; గానశ్రవణ మాకాంక్షించెను. కాని, యట్టి యుపాయములవలనఁ బ్రయోజనము లేకపోయెను. మహమ్మదీయవైద్యుని ప్రావీణ్యము గుఱించి వినుటకుఁ దత్తరపడు చిత్తమున కితరమార్గములవలన నూఱట గలుగకుండెను. ఆతని హృదయతాపము క్షణక్షణప్రవర్ధమాన మగుచుండెను. నృపాలుఁ డికఁ దాళఁజాలక, స్కాచిశూరునివలన సర్వ మరయఁగోరి, యాతనిఁ గొని రావలయునని యొక పరిచారకు నంపెను.

కణతుఁ డనుజ్ఞాతుఁడై రాజసన్నిధి కరుదెంచెను. ఆతఁ డొక సామాన్యశూరునివలె నున్నను, రాజస్థానప్రవేశమున కలవాటుపడిన వానివలె స్థిరచిత్తుఁడై యుండెను. ఆంగ్లనృపాలున కాతఁడు పరిచితుఁడు గాఁడు. ఐనను, శూరశ్రేణికిఁ జెందియుండుటచేత నాగౌరవము బురస్కరించుకొనియును, తన హృదయాధిదేవతయగు మేరీకాంతను సంస్మరించియును గణతుఁ డాంగ్లరా జొనరించు శూరోత్సవములకుఁ

దప్పక పోవుచుండెను. రిచర్డునృపాలుఁడు తదేకధ్యానమునఁ జూచుచుండ స్కాచిశూరుఁ డాతనిమ్రోల నిమేషమాత్రము మోఁకరించి, రయమ్మున లేచి, సేవకజన సహజముగ వినయవినమ్రుఁడుగాక, యధికారోచిత గౌరవపురస్సరముగాఁ గట్టెదుట నిలుచుండెను. రా జిట్టు లనెను—"నీవు చిత్రకలాంఛనుఁడ వగు కణతుఁడవుగదా. నీకు శూరపద మెవ్వ రొసఁగిరి?"

"రాజా! సింహాభిముఖధుర్యుఁడగు స్కాచినృపాలుఁడు నన్ను శూరు నొనరించెను."

"స్కాచినృపాలుఁ డగు 'విలియము' శూరులను జేయుటకు దక్షుఁడు. తద్రాజనిర్మితశూరుఁడవగు నీవునుఁ దగినవాఁడవు. రణరంగములందు వెనుదీయక నీవు బలసాహసములతోడఁ బోరాడుట మేము గాంచియుంటిమి. కాని, ఇతరకార్యములపట్ల నీ యంతర మరయక ధూర్తుఁడవై వర్తించుటచే, నుచితబహుమానము వడయుటకు మాఱుగ క్షంతవ్యుఁడ వైతివని గ్రహింపుము. హా! ఏమందువు?"

ఆసమయమునఁ దన యుత్కృష్టప్రణయము స్మరణకు వచ్చుటచేతనే స్కాచిశూరుని నోరు కట్టువడెను. అందులకుఁ దోడు, ఆంగ్లనృపాలుని సునిశితవీక్షణ మాతని హృదంతరాళము భేదించుచుండినటు లుండెను. ఆతఁడు మాటాడఁ బ్రయత్నించినను మఱియు వ్యర్థమాయెను. రిచర్డు మగుడ నిట్టు లనెను—

"సైనికు లాజ్ఞాబద్ధులు; సేవకులు ప్రభుభక్తిపరాయణులై విధేయులై యుండవలయు: ఐనను, ధీరుఁడగు శూరుఁడు రాజశాసనవిరుద్ధముగ నొకజాగిలముం గల్గియున్నను, క్షమింతుము."

ఆంగ్లనృపాలుఁడు తన ప్రణయోదంతము దలపెట్టక తన శ్వానము గుఱించి మాత్రమే మందలించుటచేత స్కాచిశూరుఁడు సేద దేఱెను. తా నొకనేరము నిరూపింపక యాగ్రహించినంతనే యాతఁడు ప్రాన్స

డుటయు ననంతరము శునకప్రశంస దెచ్చినంతనే యాతఁడు నిశ్చల చిత్తుఁడగుటయుఁ గనిపట్టి రిచర్డురాజు మందహాస మొనరించెను. కణతుఁ డిట్టు లనెను—

"రాజోత్తమా! స్కాటుశూరులు పేదలు. వారి చెయ్దములు సహింపవలయు. దూరదేశము, ధనలోపము. ఆంగ్లప్రభువులు ధనవంతులు; వారికి ధనము లేకున్నను పరపతి కలదుగాన వారొక లోపము లేక హాయిగ నుందురు. మే మీదేశమునందుఁ గాయగూరలు, బార్లీధాన్యము సాధారణముగ భుజింతుము. అప్పుడప్పుడు వేఁటాడి మాంసభక్షణ మొనరింతుమేని తురుష్కులను దీవ్రతరముగఁ బ్రహరింపఁగలము."

"ఓయీ! మా యాజ్ఞకు విరుద్ధముగ నొక జాగిలము నుంచి యపరాధ మొనరించితివి. ఐనను మా లోయప్రభువు మన్నించి తదనుజ్ఞ నిచ్చెఁగదా. నీ వీఁక నన్నడుగఁ బనిలేదు."

ప్రసంగము సరసముగ నడచినవెనుక నృపాలుఁ డిట్లు ప్రశ్నించెను. "కాని శూరుఁడా! నీవు ఎంగాడీస్వామి చెంతకుఁ బోతివని విని యుందుము. ని న్నెవ్వరు నియోగించిరి?"

"మతయుద్ధదీక్షాపరులై యయిదెంచిన క్రైస్తవ రాజన్యసభ నియోగింప నేఁ బోతిని."

"ఎంత సాహసము! నే నల్పుఁడగానే!—నే నెఱుంగకుండ ఇంతటి యధికారము వహించుటకు వా రెట్లు సాహసించిరి!"

"రాజా! చిత్తగింపుము. అట్టి విమర్శన యొనరించుట నాపని కాదు. నేను క్రైస్తవక్షేమంకరుఁడనై పోరాడు సైనికుఁడను; ప్రస్తుతము భవదీయపతాకచ్ఛాయఁ బోరాడువాఁడను—ఇది మహాభాగ్యమని తలంతును—కాని సిలువ ధరించి క్రైస్తవ పవిత్రనగరసంపాదనాశయబద్ధుఁడ నగుటచేత తదధికారము వహించు నాయకసభాజ

నొందల ధరింపవలయును. నాకును క్రైస్తవాన్వయమునకునుగూడ విషాదకారణమగు నీ యనారోగ్య మచిరకాలమున దొలంగు ననియు క్రైస్తవరాజన్యమహాసభయం దగ్రస్థానము మగుడ నీ వాక్రమింతువనియు నాసింతును. ప్రకృతము నాయకత్వము వహించు నధికారుల యాజ్ఞ జవదాటుట యనర్థదాయకముగదా.''

"శూరుఁడా! నీ నుడులు సమంజసములు. నేరము నీయది కాదు; నిన్ను నియోగించినవారలది: ఆరోగ్య మలవడునంతనే వారి పని బట్టింతును. కాని నీ సందేశ మేమి?''

"రాజోత్తమా! చిత్తగింపుము. నన్ను నియోగించినవారలే తెలుపఁగలరు. సారాంశముమాత్రము నేఁ దెలుపఁగలను.''

"శూరుఁడా! నాతోడ నెక్కసక్కెము లాడెదవా? అపాయకరము సుమా!''

ఆంగ్ల రాజు సహజముగ నాగ్రహపరవశుఁ డాయెను. ఐనను స్కాచి శూరుఁడు నిశ్చలస్వరమున నిట్టు లనెను. "ప్రభూ! నా కపాయము ఘోరయునని తలంచువాఁడ గాను—మతయుద్ధ సమయబద్ధుఁడను. స్థిరమగు యశము నాకాంక్షింతుగాని అస్థిరభౌతికక్షేమము దలంపఁ జాలను.''

"ఓహో! నీవు ధీరస్వాంతుఁడవు! శూరుఁడా! స్కాచిజనులను ప్రేమింతును. చలము వహించి మూర్ఖచిత్తులైనను కష్టముల కోహటింపని సాహసవంతులు. రాజకీయముల సందర్భమున నొకప్పుడు కపటము వహింతురుగాక. నేను మీవారల కృతజ్ఞతాభిమానములకుఁ బాత్రుఁడనని భావింతును. మా యధీనముననున్న మీ రెండు దుర్గములు మీకిచ్చివైచితిని. మీకు వానిని భుజబలంబున గ్రహించుట యసాధ్యము. మఱియొకటి—మీ సరిహద్దులు తొల్లిటి యట్లు లొనరించితి: స్కాచినృపాలుఁడు మా సామంతుఁడువోలె నుండవలయు

ననుటమీాకు దుస్సహాముగ నుండునని యెంచి అట్టి హక్కు విడనాడితి."

కణతుఁ డంత సగౌరవముగ మస్తకము వాల్చి యిట్లు బదులాడెను—"రాజోత్తమా! మా నృపాలునితోడి సంధి ననుసరించి యిట్టు లెల్ల నాచరించితివి. ఆ కారణముననే నావంటి శూరులము తొల్లిటి వైరములం దలంపక నీ వన్యదేశనృపాలుఁడవని శంకింపక నీ నాయకత్వమున కొడఁబడి యరుదెంచియుంటిమి. లేదేని ఆంగ్లనృపాలుఁడు నిజసైన్యముతోఁ బాటు నింత దూరదేశమునఁ దడయు నప్పుడు చిరతరవైరులగు స్కాటులు యథేచ్ఛగా మీా దేశముపైఁ బడి యుందురు. ప్రకృతము మా స్కాటు లెరంగమున నత్యల్ప సంఖ్యాకు లగుదురేని, అయ్యది మా నేరము కానేరదు—రణదేవతకు రోగదేవతకును ఆహుతియై పెక్కండ్రు మరణించిరి."

"నిక్కము. ఐనను నే నొనరించిన యుపకారములు కావనఁ జాలవుగదా. మఱియు ఈ క్రైస్తవ నివహంబులకెల్ల నేను ప్రధాన నాయకుఁడ నగుటచేత, నితర నాయకుల రాయబారము నే నెఱుంగ వలయు. ఇతరుల పలుకులకంటె నీయవె సత్యతరంబులని విశ్వసింతును. కావున ధర్మపరుఁడవై, నీ యుదంతము దెలుపుము."

ఆజ్ఞాపింపవలసిన యాంగ్లనృపాలుఁ డట్లు సరసముగఁ గోరుటచేఁ గణతుఁ డిట్లు బదులాడెను.

"రాజా! అట్టు లగునేని, యథార్థము వక్కాణింతును. ఈక్రైస్తవ దండయాత్రయెడ నీయాశయము ధర్మబద్ధము, నిశ్చలము, ప్రశంసనీయము. ఇతరనాయకు లిట్టు లేకధర్మాశయబద్ధులుగారు. నా రాయబారముఁ జిత్తగింపుము. క్రైస్తవులకుఁ బూజనీయుఁడై మహమ్మదీయ సుల్తానునకుఁగూడ గౌరవనీయుఁడై నిర్జనారణ్యమధ్యమున నివసించు 'ఎంగాడీ'స్వామిని గాంచి ఆతని సాహాయ్యమున—"

"యుద్ధవిరామము నింకను బొడిగింపవలయుననియే !—సందే

హము లేదు.”

ఆంగ్లనృపాలుఁ డట్లు వడివడి బలుక స్కాచిశూరుఁడుడ మగుడ నిట్లు వక్కాణించెను.

“రాజా! అట్లుకాదు. శాశ్వతసంధి పొసగవలయుననియు, పాల స్థానమునుండి మన సైన్యములు దరలింపవలయుననియును—”

రిచర్డు విస్మయాక్రాంతుఁ డాయెను—“ఆహా! వారు గౌరవహీను లని యెఱుంగుదుఁగాని ఇంతటి యగౌరవమునకుఁ బాల్పడుదురని మాత్రము దలంపనైతి. శూరుఁడా! ఇట్టిసందేశము నీవెట్టిచిత్తముతోఁ గొంపోతివో చెప్పుము.”

“రాజా! నిశ్చలచిత్తుఁడనై కొంపోతిని. ఏ మహావీరుని నాయకత్వ మున విజయము సంపాదింపఁగలమని యాశించియుంటినో, ఆ మహ నీయుఁ డీతెఱంగున నాయెను. తన్నాయకత్వము వహించు దక్షుఁడు వేఱొకఁడు కానరాఁడు. ఇట్టి సంకటసమయమున నపజయము వారిం చుటయే యుక్తమని యెంచితిని.”

నిజహృదయ నిర్భిన్నమానమగు నాగ్రహము నడంచుట ఆంగ్ల నృపాలునకు బాధాకరముగ నుండెను.

“శాశ్వతసంధికొఱకు నీవు కోరిన షరతులెవ్వి?”

“ఆ వివరములు నాకుఁ దెలియవు. నాయకులు ముద్రవైచి నా కొసఁగినదానిని ఎంగాడీస్వామి కిచ్చితిని.”

“ఈ స్వామి యెట్టివాఁడు—మూర్ఖుఁడా? ఉన్మాదుఁడా? ద్రోహి యా? లేక నిస్సంగుఁడా?”

“రాజా! ఆతఁడు మూర్ఖునివలె నవివేకివలె వెఱ్ఱివానివలె వర్తిం చును. ఉన్మాదులు దైవప్రేరితులని మహమ్మదీయులువిశ్వసించి గౌర వింతురు. ఆ రహస్య మెఱింగియే ఆతఁ డట్లు మెలంగునని తలంతును. ఆతఁడు నిరంతర మట్లు చరింపఁడు—అసంబద్ధప్రవర్తన మప్పుడప్పుడు

కాన్పించును. కావున స్వాభావికము కానేరదు."

"యుక్తియుక్తముగఁ బల్కితివి."—శయ్యపై సగములేచిన భూపాలుఁడు మగుడఁ వ్రాలి, మగుడ నిట్లు ప్రశ్నించెను—"ఆ సన్న్యాసి ప్రాయశ్చిత్తముగుఱించి యేమి ?"

"ప్రాయశ్చిత్తము యథార్థమేయగును. ఎద్దియో భయంకరపాప కార్యమొనరించి, భ్రష్టుఁడనైతినని తలపోసి, పశ్చాత్తాపతప్తుఁడై, యాశారహితుఁడై, కడు కఠినప్రాయశ్చిత్తమొనరించునని భావింతును."

"వాని రాజకీయాభిప్రాయము ?"

"తనకువలెనే, పాలస్థానమునకుఁ గూడ ముక్తిలేదనియే యాతఁడు వ్యాకులపడును. ప్రసిద్ధాంగ్లరాజనాయకత్వవిరహితమగు క్రైస్తవసేన పాలస్థానము నాక్రమించుట కల్లయని తలంచును."

"ఛీ! ఛీ! దౌర్భాగ్యక్రైస్తవనాయకుల భీరత్వ మీసన్న్యాసికిఁ గూడ సంక్రమించెనే! ఈనాయకులం దలంచునంతనే, హృదయము భగ్గుమనును. నాయకులయ్యు, భూపాలురయ్యు, క్రైస్తవులయ్యు, జగత్ప్రసిద్ధశూరులయ్యు, యుద్ధసన్నద్ధుఁడగు తురుష్కుని, దాఁకఁ జాలక, వెనుకంజ వేయుటకుమాత్ర మంత నొక్కటియై, రోగార్తుఁడై పడియున్న తమమిత్రునిఁ దృణీకరింతురు! ఆహా! దుస్సహము!—"

"రాజోత్తమా! క్షమింపుము—దుస్సహరోగమునకు దోహదమగు నీప్రసంగము వర్జనీయమని భావింతును. మ్లేచ్ఛవైరిజనయూధములకంటె భవదీయజ్వరమే మనక్రైస్తవాన్వయమునకు భయకారణము."

తదవసరక్రోధావేశమున నాంగ్లనృపాలుని వదనము పొంగియెఱ్ఱవాఱెను. హస్తములు పిడికిలించి, భుజములు సాఁచి, దుర్భరాం

దోళితమానసుఁడై, మెఱపువలె వీక్షించు నారాజవరుఁడు చాల బాధపడుచుండినటు లుండెను. దుర్భరమగు మనోవ్యథ వ్యక్తమగుచుండెను. కాని, ఆమహాపౌరుషవంతుఁడు తచ్ఛరీరమనోవ్యథల నేవగించువానివలె మగుడ నిట్టులనెను.—

"శూరుఁడా! ముఖస్తుతియొనరించి తప్పించుకొనఁ బోకుము. నేనింకను వినవలయును. ఎంగాడీనిలయమున మా రాణిం గాంచితివా?"

"రాజా! నాకుఁ దెలియునంతవఱకుఁ జెప్పెదఁ గాంచలేదు."—కణతుఁడట్లు పలుకునపుడు తాను ఎంగాడీ నిగూఢాలయమున, నిశీథమునఁ దాఁ గాంచిన కాంతామణుల యుత్సవము స్మరణకువచ్చెను. ఆతఁ డాకారణమున మిక్కిలి తత్తరపడెను. నృపాలుఁడు కఠినస్వరమున నిట్లు ప్రశ్నించెను.—

"ఆంగ్లరాణి యితరనారీజన సమేతయై ఎంగాడీ ప్రార్థనాలయమునకు యాత్రవెడలెను. తదాలయమున నీవు వారినిఁ గాంచలేదా?"

"రాజా! యథార్థమెఱింగింతు, చిత్తగింపుము. ఆసన్యాసి భూగర్భస్థప్రార్థనాలయమునకు నన్నుఁ గొంపోయెను. అందుఁ గను పవిత్రవంతమగు విగ్రహ మొండుగలదు. నారీమణులు కొంగులు పింజకట్టియందుఁ బ్రార్థించిరి. వారివదనములు నాకుఁ గన్పడలేదు. ఆనారీమణు లేకకంఠమునఁ బాడిన దైవగీతములు వింటినిగాని, వారివారి స్వరము లెటులుండునో గూడ నెఱుంగను. ఆకారణమున, నాంగ్లరాణి యునికిగుఱించి తెలుపుట యసాధ్యము."

"నీవెఱుంగుకాంత యెవ్వతెయైన నందుండెనా?"

కణతుఁడు నిరుత్తరుఁడై యుండ, రిచర్డునృపాలుఁడు తల్పమునఁ గొంచెములేచి, మోఁచేయి నానుకొని, యిట్టులనెను.—

"ఓయీ! నీవు శూరుఁడవు, సచ్ఛీలుఁడవు; నీప్రవర్తనము తత్క్రమము తప్పరాదు—నిజమాడుము.—తత్సమాగత నారీజనంబులలో

నొక్కతెన్నైన నీవెఱుంగుదువా, లేదా ?"

కణతుండు కలవరపడి యిట్టులనెను.—"రాజా ! ఊహించి మాత్రము చెప్పఁగల—"

ఆంగ్లనృపాలుఁ డాగ్రహధురీణుఁడై కఠినముగ నిట్టు లనెను.—"నేఁ గూడ నూహింపఁగలను. చాలు! చిత్రకలాంఛనా! చిఱుతపులి సింహము జోలికిఁ బోవలదని యరసి భద్రముగ మెలంగుము. శూరుఁడా! వియత్తలమున విరాజిల్లు సుధాకరునకై యువ్విళులూరుటయే అవివేకము; కాని, తదపేక్షాపరుఁడవై సమున్నత సౌధాగ్రమధిరోహించి యుఱుకఁ గడంగుట యున్మాదము; ఆత్మహత్య ప్రాపించు సుమా!"

బాహ్యమందిరమున నంతలో సవ్వడియగుటచేఁ దనయుద్రేకమొకింత చల్లార్చికొని, రిచర్డు మగుడ నిట్టులనెను,—"చాలు—పొమ్ము—లోయప్రభువును మహమ్మదీయవైద్యునిఁ గొని శీఘ్రముగ రమ్మనుము. ఆహా! గుణవంతుఁడగు సలాద్దీను సుల్తాను నిజనికృష్టమతత్యక్తుఁడై పవిత్ర క్రైస్తవమతావలంబన మొనరించునేని, నేనాతనికిఁ దోడ్పడి ఫ్రెంచి ఆస్ట్రియను మొదలగు క్రైస్తవమానవాధముల నీదేశమునుండి తఱిమివేయనా?—సుల్తాను పాలించునేని, పాలస్థానము బాగుగనే యుండును."

చిత్రకలాంఛనుఁడు వెడలినంతనే, రాజోద్యోగి యరుదెంచి, రాయబారధురంధరులై క్రైస్తవనాయకులేతెంచిరని నివేదించెను. నృపాలుఁడిట్టు లనెను—

"నే నింకను సజీవుఁడనని తెలియుఁగదా—ఆ మహనీయులు, ఆ రాయబారు లెవ్వరు ?"

"సన్యాసి శూరనాయకుఁడగు 'అమారీ' యు, 'మాంటుసరాటు' పాలకుఁడును అరుదెంచిరి."

మా సోదరుఁడు ఫ్రెంచిరాజు రాలేదుగదా—ఔను, రోగుల నాతఁడు చూడఁజాలఁడు: కాని, ఆ 'ఫిలిప్పె' యొకవేళ రోగార్తుఁ డాయెనేని, సత్వరము నే నాతని చెంత కేగియుందును—పరిచారకా! తుపాను సమయమునందలి సాగరమువలెఁ గలఁగియున్న ఈ శయ్య సరిచేయుము—ఆ లోహదర్పణ మిటు దెమ్ము—దువ్వెనఁ గొని కేశ పాశములను గడ్డమును సంస్కరింపుము—ఇయ్యవి సింహకేసరములను బోలియుండును. జల మిమ్ము."

పరిచారకుఁడు భయాకులస్వరమున నిట్లు లనెను—"దేవా! శీత లోదక మపాయకరమని వైద్యు లందురు కావున—"

"వైద్యులా? దయ్యములు! రోగము మఱలింపనేరని యాచెనఁ టులు నన్ను బాధింపఁ గడంగినచో, నేను సహింతునా?" అట్లు సక్రోధముగఁ బలుకు నృపాలుఁ డాశీతలోదకమే యందుకొని, ముఖ క్షాళనమొనరించి, మగుడ నిట్టులనెను.—"ఇఁక నామహానీయులు, నా రాయబారులను గొనిరమ్ము."

సన్యాసిశూరశ్రేణికిఁ జెందిన 'యమూరీ' నామధేయుని శరీరము యుద్ధములందుఁ జివికి, పలుచనై సమున్నతముగ నుండెను. వాని వీక్షణము మందమైనను, నిశితము. ఆ క్రైస్తవాచార్యుఁ డొనరించిన సహస్రదౌష్ట్యము లాతని వదనమున నొకింత యేర్పడియుండెను. సన్యాసిశ్రేణికిఁ జెందువారలు పవిత్రాశయబద్ధులై స్వార్థరహితులై మనవలయును. ఈ యమూరీ సన్యాసిశూరుఁ డట్లుగాక స్వార్థపరుఁడై మతమును సంఘమునుగూడఁ దలంపక క్రూరకర్ముఁడై యుండెను. క్రైస్తవులు సహింపనేరని పైశాచమంత్రములందుఁ బ్రవీణుఁ డని యాతఁడు పేరు గాంచెను. మ్లేచ్ఛులను బ్రతిఘటించి జెరూసలేము నగరమందలి దేవాలయము నుద్ధరింప బద్ధుఁడయ్యు, నా సన్యాసి శూరుఁడు రహస్యముగ సుల్తానునకుఁ దోడ్పడుచుండెనని జను లను

మానించిరి. అట్టి దురాత్ముఁడు శ్వేతాంబరధారియై కాన్రేడుతోడఁ బ్రవేశించెను.

సరాటుదేశాధిపతి కాన్రేడు కుటిలస్వభావుఁ డగు అమారీవలెఁ గాక చూచుటకు సొంపుగ నుండెను. నడిప్రాయము మీఱిన ఆ నాయకుఁడు యుద్ధమున సాహసి; ఆలోచనయందుఁ గుశలుఁడు; యుత్సవాదులందు భోగపరాయణుఁడై యానందములఁ దేలియాడును. కాని, ఈతనియందు దుస్సహదుర్గుణ మొండు గలదని జను లాడుదురు. ఈతఁడు సర్వజనాపేక్షితమగు పాలస్థాన దేశక్షేమముకంటెఁ దన లాభమే యెక్కుడు లెక్కించువాఁడు. తన బల మధికతర మొనరించుకొని రాజ్యము బెంచి వైభవముతో రాజిల్లవలెనని యాశించెను. అట్టి యాశాపరుఁడు క్రైస్తవప్రజాకంటకుఁ డగు సలాద్దీనుసుల్తాను తోడనే రహస్య రాయబారములు సలుపుచుండెను. యుద్ధసన్నద్ధులై యరుదెంచిన క్రైస్తవరాజన్యుల కట్టి ప్రవర్తనము నష్టదాయకము గదా.

ఆ మహనీయులు ప్రవేశించి పరస్పరాభివందనము లొనరించిన యనంతరము కాన్రేడు తమ రాకకు గతం బెఱింగించుచు నిట్టు లనెను. "పరాక్రమశాలి, ఉదాత్తచిత్తుఁడు, తమ యనుంగు మిత్రుఁడు నగు నాంగ్లభూమీధవు నారోగ్యస్థితిం దెలిసికొనఁ దత్తరపడువారలై క్రైస్తవనాయకులు మ మ్మరసి రండని నియోగించిరి."

"క్రైస్తవనృపాలురు మా యారోగ్యమునకై యెంత తత్తరపడుదురో యెఱుంగుదుము. మేము పదునాల్గు దినంబులు శయ్యాగతులమైనను, క్రైస్తవనాయకులు తమ కుతూహలము పదునాలుగు దినములడంచికొని యుండిరి—తత్తరపడి యరుదెంచినచో మా రోగబలము మఱియు నధికమగునని వెఱచియుందురు."

ఆంగ్లనృపాలుఁ డాపగిది నిందాగర్భితముగఁ బలికినంతనే, కాన్రేడు

వాగ్ధోరణి కట్టువడెను. ఆతఁడు వెఱగంది మాటాడఁజాలకుండుట జూచి, అమారీ యిట్లు చెప్పఁ దొడఁగెను. "నృపాలా! మాసందేశము చిత్తగింపుము. నీవు తీవ్రపడి, మన వైరియగు సలాద్దీను పంపు మ్లేచ్ఛ భిషక్కు సేవ వడయవలదని ప్రార్థించువారము. ఇట్టి యాగంతుని విశ్వసింపరాదు. క్రైస్తవనాయకులు ముందు వీనిని బరీక్షింతురు: విశ్వసనీయుఁడును సమర్థుఁడు నగునేని, ప్రసిద్ధాంగ్లభూనాథునకుఁ జికిత్స సేయనగును."

"మహాపురుషులారా! మీ సందేశ మాలించితి. అవ్వలిమందిర మునకు దయచేసి వేచియుందురేని, సకల క్రైస్తవరాజన్యోపదేశ పరిణామము తెల్లమగు."

ఆంగ్లనృపాలుఁ డట్లు పలికినంతనే అమారీ కాన్రేడులు బాహ్య పటకుటీరమునకుఁ బోయిరి. ఐదాఱు నిమిషము లైనంతనే, లోయ ప్రభువు, కణతుఁడు, అరబ్బీవైద్యుఁడును కావలివాండ్ర కాజ్ఞ లొసం గుచు నాంగ్లప్రభు వింక నవ్వలనే యుండెను. స్కాచిశూరుఁ డరబ్బీ వైద్యసమేతుఁడై ప్రవేశించెను. తదంతర క్రైస్తవనాయకులను గాంచి, నిజదేశాచారానుగుణముగ హాకీము ప్రణామ మాచరించెను. కాన్రేడు సరసముగ నందుకొనెను: అహంభావపూరితుఁ డగు సన్యాసిశూరుఁ డటుగాక గర్వితనిర్లక్ష్యభావము బ్రదర్శించెను. లోయప్రభువు రాకుండ కణతుఁడు రాజసాన్నిధ్యమునకుఁ బోవుటకు సంశయించెను. ఒక నిముస మూరకుండి, సన్యాసిశూరుఁ డగు అమారీ హాకీము నుద్దేశించి కఠినముగ నిట్లు ప్రశ్నించెను—"మ్లేచ్ఛుఁడా! ఆంగ్లరాజ్యాభిషిక్త రాజపుంగవునకుఁ జికిత్స సలుపఁ బూనునంతటి సాహసము కలదా?"

"సత్యమతస్థుఁ డగు మహమ్మదీయుఁడును క్రైస్తవుఁడును గూడ 'నల్లా' వారిచే నిర్మింపఁబడిన మానవులే గదా."

"విశ్వాసశూన్యుఁడా!"—క్రైస్తవమతేతరులు మతరాహిత్య

లనియు, నీతిబాహ్యులనియుఁ గ్రైస్తవులు నిరసింతురు. అట్టులే మహమ్మదీయు లన్యమతస్థుల నేవగింతురు. కావున, నమారీ యిట్టు లనెను—“విశ్వాసశూన్యుఁడా! నీవు హాకీమువో, దుష్టసైతాను భావ ప్రభూతుఁడవో, మఱెవ్వఁడవో—కాని, నీవు క్రిందుమీఁ దరయక రిచర్డునృపాలునకుఁ జికిత్స సలుప సమకట్టితివి,—ఆంగ్ల నృపాలుఁ డొక వేళ మరణించునేని, నీ శరీరము వన్యమృగముల కాహారమగును సుమా! భద్రము!”

సన్యాసిశూరనాయకుఁ డట్లు భయంకరముగఁ బలుక, హాకీము నిశ్చలముగ నిట్టు లనెను—

“అట్టు లాడుట దురన్యాయము. నేను మానవుఁడను; తన్మాత్ర సాధన మొనరింపఁజాలుదు; పరిణామము దైవాధీనము.”

మహమ్మదీయుఁడట్లు పలుక, అమారీని ఉద్దేశించి కానేడిట్టుల నెను—“ మహనీయా! ఈ వైద్యవిశారదుఁడు మన క్రైస్తవసభ్యత యెఱుంగఁడు—వైద్యుఁడా! నీవు మేటి సాధకుఁడవే యగుదువు. కాని, కార్యక్రమ మరసి చరించుట వివేకము. ప్రఖ్యాత క్రైస్తవనా యక సభాసమక్షమున కరుదెంచి, నీ ప్రావీణ్యము బ్రదర్శింపుము. మా ఘనవైద్యులు హర్షింతురేని, నీ వప్పుడీకార్యమున కుపక్రమింపఁ దగు. ఈ మార్గము నిరపాయకరము. లేదేని, నీ కపాయము సంభవిం పవచ్చును.”

“ప్రభులారా! మీ సుదులు గ్రహించితిని. మీ సైనికకళయందు వలెనే, మా వైద్యకళయందుఁగూడఁ బ్రవీణులు, శూరులుంగలరు. మతావేశజనిత సంఘటనములందు నెందఱు మరణింపరు?—అట్టులే యొక్కొకపుడు వైద్యసందర్భమునఁగూడఁ గొందఱు శరీరత్యాగ మొనరింతురు. మా నృపాలుఁడగు సలాద్దీను సుల్తాను ఆంగ్లనృపా లునకుఁ జికిత్స యొనరింపవలయునని నన్నాజ్ఞాపించెను. దైవబలంబున

నే నట్టు లొనరింతును. నా ప్రయత్నమొకవేళ విఫలమగుగాక,—ఐననేమి? మహమ్మదీయ హృదయవిదారణాయత్తములగు ఖడ్గములు మీ చేతఁగలవు గదా. కాని, మహమ్మదు కరుణాకటాక్షలబ్ధవైద్య విద్యారహస్యముల గుఱించి తత్పరిచయములేని మీ బోంట్లతోడఁ బ్రసంగింపనొల్లను. కావున, కృతనిశ్చయుఁడనగు నా కిఁక నాలస్యము గల్గింపకుఁడు."

"ఆలస్యమా! ఎవ్వరది?"—అట్లు తీవ్రముగఁ బల్కుచు లోయ ప్రభువు ప్రవేశించెను—"ఇప్పటికే చాల యాలస్యమాయెను. కాన్రేడుప్రభూ! అమారీశూరాగ్రణీ! మీకు స్వాగతము. కాని, నేనీ ఘనవైద్యుని నృపాలుని చెంతకు సత్వరము గొంపోవలయు."

కాన్రేడు మెల్లగ నిట్టులనెను—"ప్రభూ! మారాకకుఁ గతం బెఱుగుదువా? మేము క్రైస్తవసభానియుక్తులము, మా సందేశ మాలింపుము. రిచర్డునృపాలుఁ డమూల్యపురుషుఁడు: ఆకస్మికముగ నరుదెంచిన మ్లేచ్ఛవైద్యుని విశ్వసింపరాదు: మీ నృపాలునకు వాని చేఁ జికిత్స జేయింపఁబూనుట ప్రమాదకరమనియు, తగదనియు హెచ్చరింప నరుదెంచితిమి. ఏ మందువు?"

ఆంగ్లప్రభువు మోటుగనిట్లు బదులాడెను.—

"మహనీయా! నాకుఁ బలుమాటలు తెలియవు,—వినుటకుఁగూడ నోపిక లేదు. మఱియు, నీ మ్లేచ్ఛుఁడు సమర్థుఁడని యెఱింగితిని. అనుమానములేదు. కాలమమూల్యము. ఆ దౌర్భాగ్యుఁడు మహమ్మదే యొకవేళ నీ హకీమువలెఁ గార్యసాధనాయత్తుఁడై యరుదెంచునేని, రాజసమక్షమునకుఁ దప్పక గొంపోదును, ఒక్కనిమున మాలసించుట పాపమగు. ప్రభులారా! మా కిఁక సెలవు."

"లోయప్రభూ! ఈ వైద్యునితోఁ బాటు మేముగూడ రావలయునని రిచర్డునృపాలుఁడు పలికెను."

అట్లు కాౘ్రనేడు చెప్పినంతనే, నిజానిజము లరయుటకుఁ గాఁబోలు, లోయప్రభువు రాజోద్యోగిచెవిలో నేమియో మాటాడి, యనంతర మిట్లు లనెను.—

"ప్రభులారా! మీరు శాంతచిత్తులరై యుందురేని దయచేయుఁడు; కాని, అనవసరముగా నీవైద్యుని బెదరింపఁ గడంగుదురేని మఱేవిధమునన్నైన వారింపఁ బూనుదురేని, మీ రెంతటివారలైనను సరె— సహించువాఁడ గాను. అవ్వాలకు సాగనంపుదు. ఈ భిషక్కు ప్రావీణ్యము నిరుపమానము—ఒకవేళ రిచర్డు నృపాలుఁడు వలదన్నను, ఈతనిచేత సాధనము చేయింతు ననియే తలంతును. హాకీమ్! నడువుము."

ఆదంబేకు తోడనే ముందు నడచెను. లోయప్రభు విరసప్రవర్తన గాంచిన అమారీ క్రోధఘూర్ణితవదనుఁడై తన యనుచరునివంకఁ దిలకించి, సత్వరము దెలివాందెను. వారిరువురు గూడ రాజమందిరము బ్రవేశించిరి. కణతుని రావలయునని గాని రావలదని గాని చెప్పిన వారు లేరు: కావున, నా పరిస్థితులు గమనించి, యాతఁడును లోనికేగెను.

విసువున నిరీక్షించుచున్న రిచర్డునృపాలుఁడు వారిని గాంచి యిట్టు లనెను—"ఓహో! రిచర్డు మూర్ఖచిత్తుఁడై చొరఁబూనిన ప్రమాదముం దిలకింప నరుదెంచిరా!—మంచి సాంగత్యము! మిత్రులారా! ఉదారహృదయులారా! అఖిల క్రైస్తవనాయక సభానియోజితులారా! స్వాగతము! ఆంగ్లనృపాలుఁడు సహజారోగ్యభాగ్య సమన్వితుఁడై తొంటియట్లు నాయకత్వము వహించును; లేదేని, జీవరహిత కళేబరమును సమాధిని జేర్పుఁడు. లోయా! నీప్రభువు సజీవుఁడై యున్నను, విగతజీవుఁడైనను, నీకుఁ గృతజ్ఞుఁడు. ఇందు మఱియొకనిఁ గాంతునే—అబ్బా! ఈరోగ మెంత దుస్సహము! నయన

ములు బలహీనములైనవి—నిచ్చెన లేకనే స్వర్గము నారోహింపఁ గడంగు సాహసి, సాటిశూరుఁడా? రమ్ము. హకీమ్! రమ్ము, రయమ్మున రమ్ము! కార్యము గానిమ్ము!"

నృపాలుని రోగలక్షణములు వైద్యుఁడప్పుడే గ్రహించియుండెను. ఆతఁడంతఁ దదేకధ్యానమున నాంగ్లభూపాలుని నాడి చిరకాలము బరీక్షించెను. ప్రేక్షకులెల్లరు గడు నిశ్శబ్దముగనుండిరి. అనంతర మామిషక్కు నిర్మలతోయము లొకగిన్నెకు దీసి, వెనుకటి విధమునఁ దన జేబునందలి దివ్యౌషధమునం దుంచి, కొంచెము సేపు తాళి, నృపాలున కందీయఁబోయెను. రిచర్డు వైద్యుని వారించి యిట్టులనెను—
"ఒక్కక్షణమాగుము. నా నాడి నీవు చూచియుంటివిగదా. నీ యది నేఁ బరీక్షింపవలయు. శూరుఁడఁగదా—ఇందు నాకునుఁ గొంతపరిచయము గలదు."

హకీము మాటాడక సమ్మతించెను. వాని కోమలకరము తోడనే పట్టి ఆంగ్లనృపాలుఁ డిట్టులనెను—"ఈ హకీము దేహమునందలి రక్తగమనము బాలకునిదివోలె గడునిశ్చలము. లోయా! మేము జీవించినను, సమసినను, ఈతఁడు రక్షణీయుఁడు—సగౌరవముగఁ బోనిందు. మిత్రమా! ఉదారహృదయుఁడగు సలాద్దీను సుల్తానునకు నా కృతజ్ఞత నివేదింపుము. నే నొకవేళ మరణించినను, మీ సుల్తాను సంశయింపఁదగినవాఁడు గాఁడు. బ్రతికియుందునేని, ఆ శూరశిఖామణినిఁ దదుచితవిధమున సత్కరింతును."

రిచర్డునృపాలుఁ డంతఁ దన తల్పమునఁ గూర్చుండి, మహమ్మదీయుఁడొసంగిన యౌషధపాత్రఁబట్టి, అమారీ కాస్రేడుల నుద్దేశించి యిట్టులనెను. "రాజసోదరులారా! మధుపాత్రములు బూని యిటులు బానచేయుఁడు—" మహమ్మదీయహస్తగతమగు జరూసలేమునగర ద్వారమునఁ బ్రప్రథమమున నస్త్రము స్థాపించు శూరాగ్రణికి! వెన్నిచ్చి

పాటు భీరుఁడు నిరంతరదుర్వ్యసనమగ్నుఁడగుఁ గాక!"

అట్లు పలికిన యాంగ్లనృపాలుఁ డౌషధము ద్రావి, యా పాత్ర వైద్యునకొసఁగి, యలసినవానివలె శయ్యపై వ్రాలెను. హాకీము మాటాడక యంగరక్షకులకుఁ బోవలయునని సన్నయొనరించెను. లోయ ప్రభువుతప్ప తక్కుంగల జనులు వెడలిరి.

౧౦

అమారీ కాన్రేడులు రాజపటకుటీరము వీడి, చుట్టును దిలకించిరి. కావలి వాండ్రు ధనుర్బాణములు దాల్చి యొకింతదవ్వునఁ గాపుండిరి. నిద్రాపరుఁడగు తమతేనికి భంగము వాటిల్లకుండ సైనికులు నిశ్శబ్దముగఁ జుట్టును నప్రమత్తులై యుండిరి. కవచధారణ మొనరించిన యాయుధీయులుగూడ నంతమైనను సవ్వడియొనరింపక, యధోముఖులై ప్రేత సంస్కారపరాయణులో యన విషాదఘూర్ణితమానసులై తిరుగాడు చుండిరి. వార లాకైస్తవనాయకులను గాంచినంతనే సముచితగౌరవ పూర్వకముగాఁ దమయస్త్రములు దింపిరి.

ఆంగ్ల రక్షకభటులను గడచిన యనంతరము అమారీ యిట్టులనెను—"మిత్రమా! ఈయాంగ్లేయు లెట్లు మాఱిపోయిరో చూచితివా! మల్లయుద్ధ మొనరించుచు, నాడుచు, బాడుచు, ద్రుళ్ళుచు, గేరుచు, సురాభాండములు బగులఁగొట్టుచు నిరంతరాయమానముగ వీరు వినోదోన్మత్తులై యుందురుగదా."

కాన్రే డిట్టు లనెను.—"శ్వానములవలె నాంగ్లేయులు విశ్వాసబద్ధులు. వారి నృపాలుఁడు వారితో సమానముగ నాడుచుఁ గేరుచు నా సైనికుల హృదయ మాకర్షింపఁజాలెను."

అంతట నమారీ యిట్లు పలికెను—

"ఈతని చిత్తవృత్తి యెల్లప్పుడు పరిభ్రమించుచునే యుండును. ఔషధము ద్రావు సమయమున నాడిన మాటలు వింటివిగదా."

ఔను. "సలాద్దీను కాఁబట్టి యదృష్టము బాగుండెను. గాని మఱి యొకఁ డాయనేని, ఆ సలాద్దీనే సామాన్య మహమ్మదీయుఁ డాయెనేని, ఈ యౌషధము వినా మఱియొక పదార్థ మేదియు నక్కఱలేకుండ పోయెడిది. ఈ మ్లేచ్ఛరాజు నిజ కులాచారసమ్మతముగఁ దన హద్దున నుండక, క్రైస్తవశూరునివలె నిష్కారణ గౌరవోదారవిశ్వాసములు వ్యక్తపఱచును. వీని కీదుర్గుణ మేల కలుగవలయు? ఈ సుల్తాను తనకుఁగూడ గ్రైస్తవ శూరశ్రేణియందుఁ బ్రవేశ మీయవలయునని రిచర్డును గోరెనఁట!"

"ఎంత విపరీతము! శూరబిరుద మత్యుత్కృష్టము. అట్టి పవిత్ర శ్రేణి మ్లేచ్ఛజన కళంకితమగు సమయ మగుదెంచెనేని అందుండి మనము తొలంగుట శ్రేయోదాయకమగు."

వా రట్లు సంభాషింపుచుఁ దమ హయములు నిలిచియున్న తావు సమీపించిరి. వారి పరిజను లచట వేచియుండిరి. కాన్రేడిట్లు లనెను.— "మన మీ యశ్వములు వీడి, సాయంసమయ శీతలమందానిల సౌఖ్య మనుభవింపుచు మన శిబిరమునకు నడచిపోదము." సన్యాసిశూరుఁడు సమ్మతించెను. బహు శిబిరసంకీర్ణమగు త న్నగరజన విహారపథంబు లల్లన వీడి, వారు క్రమముగా నిర్జనప్రదేశములవంకఁ బోజొచ్చిరి. రక్షకభటులుమాత్ర మచ్చటచటఁ గాన్పింపుచుండిరి.

సైనికవిషయముల గుఱించియు, రక్షకవిధానము గుఱించియుఁ గొంత తడవు వారు ముచ్చటించిరి. కాని, అట్టి ప్రసంగ మిరువురకును నసహ్యముగ నుండెను. తుద కాప్రసంగముకూడ నిలిచిపోవ నిరువురు మౌనముద్ర వహించిరి. కొంతకాల మట్లు లగుడు కాన్రేడు తత్క్షణ

నిశ్చితాభిప్రాయప్రేరితునివోలెం దన యనుచరుని శిలాసన్నిభ వదన మున నాకస్మికముగ దృష్టి నిలిపి యిట్లు లనెను—"మిత్రమా! భవ దీయ పవిత్ర తాశూరత్వములకు భంగము కలుగదేని, ముఖత్రాణము దీసి నిజరూపు జూపుము. మిత్రుండుం గదా!—మిత్రునితో భాషించు నపుడు వదనము మఱుఁగుపఱచుట యనుచితము."

అట్లు కాస్రేడు భావగర్భితముగం బలుక, సన్యాసి మందహాస మొనరించి సాభిప్రాయముగం నిట్లు బదులాడెను—"నాయదివలెం గొన్ని ముఖత్రాణములు నల్లగ నుండును. మఱికొన్ని ముసుంగులు చూచుటకు బాగుగనే యున్నను తద్విరుద్ధ ముఖలక్షణములను మాత్రము మఱుఁగుపఱచును."

వారి ప్రసంగము జూడ, నిగువురును విపరీతాలోచనాయత్తచిత్తులై యుండి, చూచుటకుమాత్రము గాంభీర్యము వహించినట్లు తెల్ల మగును. ముసుంగుదీసి పాఱవేయునటు లభినయించి, కాస్రే డిట్టు లనెను—"మిత్రమా! నావేషము దీసివైచితి. ఇంకం గార్యాలోచన మొనరింపవలయు. ఈ మతయుద్ధమువలన నీ సన్యాసి శూరశ్రేణికిం రాంగల లాభనష్టములు దలంచియుంటివా?"

"నేర్పరి వౌదువు. నిక్కముగ నీవు ముసుంగు దీయుటకాదు; మదీయరహస్యముమాత్ర మరయంజూతువు. ఐనను, గమనింపుము. తొల్లి యొక కర్షకుండు వర్షమునకుం బ్రార్థించి, సమయమునకు వర్షింపకుండుటచేం గినిసెను; అంతటి వేగిరపాటు వలదని బుద్ధి సెప్ప వలయునని యెంచి, దైవ మొక నదీప్రవాహము నావంకమఱలించెను. ఆ తెఱంగున నీరము కావలసిన కాంపు నీరమువలనే సర్వము గోల్పో యెను."

"నిక్కము. కాని, ఈ క్రైస్తవసేనావాహిను లీరంగమున కేల రావలయు? ఈ యీసైన్యము లన్నియు సముద్రగర్భమున మునింగి

పోయిన బాగుండునే. ఈ దేశము గనిపట్టికొని యున్న మనము మహమ్మదీయులతోఁ బోరాడియో, అసాధ్య మగునపుడు శిరము వాల్చియో పోయిగనుందుమే. కాని, క్రైస్తవమహాసైన్యము లొక్క-సారి ఉప్పెనవలెఁ దిరుగఁబడుటచే సలాద్దీను సుల్తాను సహజముగఁ గృతనిశ్చయుఁడై యున్నవాఁడు. ఈప్రాంతమున మన కిఁక దావుండ దని తలంతును. మహమ్మదీయ ప్రజాకంటకులమై పెచ్చుపెఱిగియున్న మనల నిందు నిలువనీయఁడు."

అమూరీ యిట్లు లనెను—"కాని, ఈ క్రైస్తవ మహాసైన్యము విజయము గాంచఁగలదు."

"దాన, మనకుఁ గలుగు లాభ మేమి?"

"క్రైస్తవవిజయము నీకు శుభప్రదముగా నగును. 'సరాటు' పాలకుఁడగు కాన్రేడు జెరూసలేము నృపాలుఁడు కాఁగలఁడు."

"జెరూసలేము రాజ్యాధిపత్యము! చెప్పుటకు మాత్రము ఘనము; కాని, అనుభవయోగ్యము కాదు. ఆచార్యా! ప్రాచ్యదేశనివాస కారణమున నిచటి ప్రభుత్వవిధానమునందలి సుగుణము నా కనుభవ వేద్య మాయెను. రాజు, ప్రజయును మాత్రము గలదే రాజ్య మనఁ జెల్లును. వా రిరువురినడుమ సామంతాది బహుళాధికారవర్గమునకుఁ దా వొసఁగు ప్రభుత్వ మొక ప్రభుత్వము కాదనియే చెప్పవలయు. జెరూసలేము రాజ్యాధిపత్యముకంటె మదీయనగరపరిపాలనయే వాంఛనీయము. జెరూసలేము పాలకుఁడు పదిమందికి నొదిగి స్వాతంత్ర్య రహితుఁడై మనవలయు. అట్టి నికృష్టాధిపత్యము నా కేడ? ఒకరి యడ్డులేక నిరంకుశపాలన మొనరించువాఁడు మాత్రమే రా జగును. మఱియొకటి: రిచర్డ్డునృపాలుఁ డారోగ్యవంతుఁ డగునేని, అట్టి రాజరిక మైనను బ్రాపించుట కష్టము. ఆతఁడు మఱియొకని బ్రతిష్ఠించును."

"మిత్రమా! చాలును, నీ యభిప్రాయ మెఱింగితి. ఇతరనాయ

కులు గూడ నిట్టులే భావింతురు గాని నీవలె మనసు విచ్చి భాషింపరు. ఒక యుపమానము స్ఫురించె, నాలింపుము. సముద్రతరంగఘాతముల స్రుక్కు నౌకలను అనాగరకులు గూడఁ దప్పక రక్షింతురు: కారణము, తదంతరపదార్థస్వీకారమే, గాని, నిర్వ్యాజకారుణ్యము కాదు."

అమారీ యట్లు పలుక, ననుమానతీక్ష్ణవీక్షణముల నాతనిఁ దిలకించి, కాన్రే డిట్టు లనెను—

"ఆచార్యా! రహస్యభంగ మొనరింపవలదు సుమా. నా విహ్వ యెన్నఁడు నా యూహలు వెల్లడించునది కాదు. మదీయ భుజబలమున నా గౌరవము రక్షించుకొనఁ జాలుదు. ఒకవేళ దోషారోపణమునకు గుఱియగుదుఁగాక,—ఐనను, నా కట్టెదుట నిలుచు నెంతటి యోధునైనఁ జెక్కాడి యఖర్వగౌరవసమన్వితుఁడనై యుందును."

అంత, నమారీ యిట్టు లనెను—"కాని, అంతటి ధీరస్వాంతున కింతటి వేగిరపాటు, ఇంతటి యులికిపాటును అనుచితము సుమా. అది యటుండ, రహస్యభంగ మొనరింపక, విశ్వాసబద్ధుఁడనై యుందునని బాస చేయుదు—జెరూసలేము నందలి పవిత్రదేవాలయముతోడు."

దైవచింత యెఱుంగని అమారీ యట్లు సమయ మొనరించినంతనే, సహజముగ నపహాసపరాయణుఁ డగు కాన్రేడు తదవసరోచితమగు వివేకము మఱచి ఆ సన్యాసిశూరనాయకు నధిక్షేపించెను. తోడనే యాతఁడు దంశహ్యమానమానసుఁడై, తన యనుచరుని భస్మీభూత మొనరింపఁజాలు భయదమరణసన్నిభవీక్షణము బఱపి, యంతలో నిగ్రహించుకొని, తానును సరసముగ నెక్కసక్కెము లాడెను.

అమారీ యాధిపత్యమున నుండిన సన్యాసి శూరశ్రేణి గుఱించి యొకింత యరయవలయును. దీనినే 'దేవాలయశ్రేణి' యందురు. ఐహికవిషయములపై రోసియో, లేక, మఱేకారణముననో మఠప్రవేశ మొనరించువారివోలె వీరును శ్రేణిధర్మములకుఁ గట్టువడి,

తదధీశుని మాట కెదురాడక సాధుజీవన మొనరింతుమని సమయ మొనరించుటయేగాక, సకల క్రైస్తవజనపవిత్రధామమగు జెరూసలేము నగరమును మహమ్మదీయుల బాఁతినుండి రక్షించుటకుఁ గృతనిశ్చయులై యుండిరి. ఆకారణమున, నిస్సంగులై మనవలసిన మఠస్థులు శూరులై సమరపరాయణు లైరి. అట్టివారలు సహజముగఁ గఠినులు క్రూరులు నగుదురు. హంతకులు, సాహసికులు మొదలగు కుజనులు దేశదేశములనుండి పాఱివచ్చి యీ శ్రేణియందుఁ జేరుచుండిరి. దుర్మార్గులయ్యు బలసాహసములు గలవారలగుటచే నా సన్యాసిశూరులు మహమ్మదీయుల నురుమాడుచు, ధనార్జన మొనరింపుచు, భోగపరాయణులై క్రైస్తవనృపాలురను గూడ లెక్కసేయక హాయిగ మనఁజొచ్చిరి. అట్టి యొకశ్రేణినాయకుఁడు అమూరీ నామధేయుఁడు.

కాన్రేడు నిజముగ నొకమేటి శూరుఁడు. ఆతఁడే సలాద్దీను సుల్తానును తొలుదొల్త వారింపఁజాలి, యందులకుఁ బ్రతిఫలముగ టైరు నగరమునకుఁ బాలకు డాయెను. ఆసందర్భమునఁ గాన్రేడు జెరూసలేము రాజ్యాధీశునకు సామంతుఁ డాయెను. కాని, ఆరాజ్యము దుర్బలమగుటచేత, కాన్రేడే ప్రముఖుఁడై యుండెను. ఐనను, ఆతఁడు సంతసింపక దురాశాపరుఁడై యుండ, యెరూసలేము రాజ్యాధికారిణియగు రాణి సంతానవిహీనయై మృతినొందెను. ఆమె భర్త—'గాయి' అనువాఁడు తాత్కాలికముగ నాధిపత్యము వహించెను. కాన్రేడు గతరాజ్ఞీసోదరిని వివాహమాడి, తద్రాజ్యము గ్రహింపవలయునని నిశ్చయించెను. మన మిఁక వారి సంభాషణ మాలింపవచ్చును. కాన్రేడిట్టు లనెను—

"మిత్రమా! మీ రిపుడు సర్వస్వతంత్రులరై హాయిగ నుండిరి గదా. ఈ క్రైస్తవరాజన్యులు జయింతురేని, పాలస్థానము వారి

యధీన మగునేని, మఱి యింక శత్రుభయములేని కారణమున మీా స్వాతంత్ర్యము తప్పక యంతరించును. మీా శ్రేణి యావశ్యకమే నశించును."

అంతట నమారీ వికృతముగ నవ్వి యిట్లు ప్రశ్నించెను—"నీపలుకులు నిజము కావచ్చును. కాని, ఒకవేళ క్రైస్తవనృపాలురు వెనుదిరుగఁ బాలస్థానము మహమ్మదీయుల యధీనముననే యుండె ననుకొమ్ము: దాన మనకుఁ గలుగు లాభమేమి ?"

"లాభ మపారము, నిశ్చయము. సుల్తాను మన సాహాయ్యము తప్పక యపేక్షించును. తనుత్రాణాదిపరికరరక్షితులగు క్రైస్తవ శూరులు కొలదిమంది తోడ్పడినఁ జాలు, సలాద్దీను సుల్తాను ప్రాచ్య దేశవైరులను సులభతరముగ జయింపఁగలఁడు. మనకు నిక్కముగఁ గొన్ని రాష్ట్రములు ప్రత్యేకించును. ఈ మ్లేచ్ఛరాజు బహు సమర్థుఁడగుటచేత, మనము భద్రముగ నుండవలయు. కాని, ఈతఁ డెంత కాలము జీవించును ? అనంతరము మనల నడంచియుంచుట యెవ్వనికి సాధ్యమగును ? మఱియొకటి. ప్రాచ్యదిగ్భాగమున సామ్రాజ్యములు కుక్కగొడుగులవలెఁ బొడసూపి, యట్టులే మాయమగుచుండును. ఈ లోపున, మనవంటి సైనికులు మఱికొందఱు రావచ్చును; అప్పుడు మనలను వారించువా రెవరు ? ప్రకృతము రిచర్డు మొదలగు భూపాలుర రాకవలన మన ఘనత మాటుమణఁగియున్నది. వీరు వెడలిన యనంతరము మన యదృష్టము నిరాఘాటముగఁ బర్వెత్తును."

"మిత్రమా ! నీవాదము సమంజసము. నా మనోగమనము గూడ నట్టులే యుండు. కాని, కడు జాగరూకతతోఁ జరింపవలయు. ఫ్రాన్సు దేశాధిపతియగు 'ఫిలుప్పు' ధైర్యశాలి, వివేకవంతుఁడు గూడ సుమా."

"ఫిలిప్పును సులువుగా మఱలింపనగును. నిజామాత్యసామంతాది

జనప్రేరితుఁడై యాతఁడు సహజవివేకము దొఱంగి యుద్ధసన్నద్ధుఁడై యరుదెంచెను. తనదేశమునకుఁ గడుఁజేరువగనున్న ఇంగ్లాండు నృపాలుఁ డాతని సహజవైరి. మఱియు, ఫిలిప్పు మత్సరపరుఁడై యాశాపరుఁడై యుండును. ఈకడుదూరదేశమునఁ గాలహరణ మొనరించుటకంటెఁ దనదేశమున కుఱుగుటయే ఆతనికి లాభకరము. తగు వీలొదవునంతనే యాతఁ డీతలంపుడిగి నిజదేశాభిముఖుఁడగును."

"ఆస్ట్రియా దేశాధీశుని గుఱించి యేమందువు?"

"ఆతఁడు దుర్గర్వి, మందుఁడు. తన యాస్థానమునందలి గాయకులు కూడ నాంగ్లనృపాలుని యమానుష బలసాహసముల గుఱించి పాడుచుందురు. ఆతఁ డయ్యది సహింపనేరక లోలోనఁ గుడుఁ గటక టంబడు. ఆంగ్లభూపాలుఁ డాతనికి భయకారణుఁడు, నసహ్యాకార ణుఁడునైయుండు. భయంకర వృకమును వేఁటాడు జాగిలములలోఁ బిఱికివి ముందేగి ఆవన్యమృగమును దాఁకఁజాలక వెనుక వెనుకఁ దగ్గి, ధైర్యవంతములగు శ్వానము లద్దానిని జీల్చునంతనే అయ్యవి కూడ ధైర్యము నాల్చి కవియును: ఆస్ట్రియా నృపాలుఁడట్టివాఁడు. కాని, మిత్రమా! నేనిట్టి విషయముల గుఱించి యేల వాకొనవలయు?— ఈయఖిల క్రైస్తవరాజన్యసంయోగము విచ్ఛిన్నము కాలవయునని, ఈనూతనాగతు లేప్రాంతమునుండి తరలవలయుననియు గదా. మఱియు, ప్రఖ్యాతరాజులలో నొక్కఁడు తప్ప మిగిలినవారలు సుల్తానుతో సంధి గావించుటకు సంసిద్ధులు."

"నిజము. క్రైస్తవనృపాలుర యభిప్రాయములట్టులేయుండు— మొన్నటి సమావేశమునఁ దెల్లమాయెను. కాని, నీహృదయ మింకను గొంత తేటపడవలయు. సుల్తానుతోడి సంధికార్య సంధాన సందర్భమున నాచిత్రకలాంఛనుని—ఆస్కాచిశూరుని అంపవలయునని సభయందు నీవేల పట్టుపట్టితివి?"

అమారీ యట్లు ప్రశ్నింప, కాన్రేడు మందహాస మొనరించి యిట్లు పలికెను—"అది యొక యుక్తి. కణత నామధేయుఁడగు శూరుఁడు బ్రిటనుదేశస్థుఁడనియు, రిచర్డు సైన్యములోనివాఁడనియు సలాద్దీను ఎఱుంగును. కావున, సుల్తాను వానిని విశ్వసించును. రెండవ మర్మమెద్దియన,—స్కాటు జాతివాఁడు సహజముగ నాంగ్లనృపాలునిఁ బ్రేమింపఁజాలఁడు; ఇంకను బరస్పర వైషమ్యము లుండు. ఆ కారణమున నాస్కాచి శూరుఁడు నిజసందేశ పరిణామ మెఱింగించుటకు సూటిగా రిచర్డు సమక్షమునకుఁ బోఁడు. మనకయ్యదె వాంఛనీయము."

"మిత్రమా! నీయుక్తి యపూర్వము; కాని, కడు సున్నితము; ప్రకృతము నిరర్థకము. నీయుపాయమెంత విరుద్ధముగఁ బరిణమించెనో చూచితిగదా. ఈస్కాచి శూరుఁడు స్వీయకార్యపరతంత్రుఁడై యుండేలక, ఆసింహబలుఁడు—రిచర్డు పునర్జీవి కాఁగల సాధనముం గొని తెచ్చెను. ఈవైద్యు నుపచారమువలన నాముష్కరరాజు జీవింపఁగలఁడు. అపు డాతని నేభూపాలుఁడు వారింపఁజాలును? ఆంగ్లరాజు సైతానువలె నపూర్వబలోత్సాహపరుఁడై కదనరంగమున ముందంజవేయునపుడు, తక్కుంగల రాజులు నాయకులు గూడ లజ్జావనతవదనులై తప్పక యనుగమింతురు.

"మిత్రమా! అట్లు కానేరదు. ఈమ్లేచ్ఛవైద్యుఁ డరుదెంచిన నేమి? ఆంగ్లరాజును గారించు నసాధ్యరోగమును మఱలించునా?—కల్ల. ఒకవేళ నమానుషముగ సంకల్పసిద్ధుఁ డగుగాక—అంతమాత్రమునఁ జెడిపోవునది లేదు. రిచర్డు పునరారోగ్య మనుభవించులోపున, ఫ్రెంచి ఆంగ్లేయజాతుల సఖ్యము ధ్వంస మొనరింతును; ఆస్ట్రియా నృపాలుఁడైనను విముఖుఁడై తన దేశమునకుఁ బోవునట్లు లొనర్చింతును. ఆంగ్లరాజు వలయు జవసత్వములు గాంచి నాయ

కత్వము వహించు లోపున నితర ప్రసిద్ధభూనేతలు తమదేశములుచేరి యుందురు. రిచర్డు స్వీయసైన్యములను మాత్రము శాసింపవలయు."

ఈ కుతంత్రము సన్యాసిశూరనాయకుఁ డగు అమారీకి నచ్చదాయెను. ఆ యేకాంతప్రదేశమున నెవ్వరైనఁ బొంచియుందురేమొ యని ఇటునటు వడివడి దిలకించి, తన యనుచరుని హస్తముబట్టి నిజహృదయ దుష్టాభిప్రాయ మచ్చుపడ నాతఁ డిట్టులనెను.—

"మిత్రమా! ఇట్టి కొఱమాలిన యాలోచనలేల? మృత్యుముఖమున నున్న రిచర్డు లేచు లోపున నేమియో చేయుదువా? ఆతఁడేల లేవవలయు?—ఆంగ్లరాజు మృత్యుదంష్ట్రలనుండి వెలువడ రాదు!"

కాన్రేడు అదరిపడెను—"ఏమి! ప్రసిద్ధాంగ్లనృపాలుఁడు, సింహబలుఁడు, క్రైస్తవజగదైకవీరుఁ డామహనీయుని గుఱించియే యిటులందువా?" వాని వదనము వెల్లబాఱెను; సర్వము కంపించెను; కాళ్లు వడంకెను; చూపు ప్రమాన్పడెను. అంత నమారీ నిందాగర్భిత మందహాస మొనరించి యిట్టులనెను.—

"శూరుఁడా! నీశూరత్వము, ధీరత్వము నిదియేనా? నానాదేశాగత క్రైస్తవరాజసభను బంతివలె నాడించు ధీశాలివి నీవ యగుదువా! ఎంతటి భీరుఁడవైతివి! మంత్రశాస్త్రాభ్యాస మొనరింపఁగోరి, గురువులేని సమయమున నాశాస్త్రము దీసి, భూతాకర్షణ సమర్థమగు మంత్రము బఠించి తత్కారణోద్భూతభూతము గాంచి ధైర్యరహితుఁడై భయ ప్రకంపితుఁడగు మందునివలె నీవుంటివి. ఏమందువు?"

కాన్రేడు కొంచెము తెలివొంది, యిట్టులనెను.—

"మిత్రమా! ఉపాయాంతరము లేనపుడు నీవు చెప్పునదే యుక్తమగును. కాని, దైవమా! ఎంత దారుణము! యూరపుఖండము

నందలి నానాదేశస్థుల శాపములకు గుఱియగుదుమే!—సకల క్రై స్తవమతాధిపతియగు పోపు మనకు గతులు లేకుండ చేయునే:—నికృష్ట కుష్ఠరోగ బాధితులగు దౌర్భాగ్యులు సహితము తాము అమారీ కాన్రేడులము గామని సంతసింతురే!—"

సన్యాసికూరనాయకుఁడు సహజ నిశ్చలతవీడక, ఇట్లు పలికెను.— "ఓయీ! తాదృశాలోచనల కధీనుఁడవగుదువేని, యీవిషయ మిఁక విస్మరింపుము. మన మీవిషయమెన్నఁడు దలంపలేదనుకొందము. ఇది యొక స్వప్న మనుకొందము. స్వప్నగత వృత్తాంత మిఁక దలంపవలదు."

కాన్రే డిట్లు బదులాడెను.—"ఈస్వప్నము తొలంగనేరదు. మిత్రమా! మొదట నాస్ట్రియా యింగ్లాండు దేశములకు భేదము గన్పింతును."

అమారీ సంతసించి వెడలెను. చీఁకటియం దాతఁ డంతరించు వఱకు నావంకఁ దిలకింపుచుఁ గాన్రే డచ్చటనేయుండెను. ఈతఁ డాశాపరుఁడు, గర్వి. మంచిచెడ్డ లరయక కార్యము సాధింపఁజూచు తంత్రజ్ఞుఁడు గూడనగును గాని, అమారీ వంటి క్రూరాత్ముఁడుగాఁడు. కాన్రేడు భోగపరాయణుఁడై, నిర్విచారముగ నుండఁగోరును. ఆతఁ డిట్లు చింతించెను—"ఆహా! ఈకఠినాత్ముని పలుకు నిక్కము. అమారీచెప్పినటులు భూతము నామంత్రణ మొనరించితి. కాని నావలెనే స్వీయలాభపరాయణుఁడగు నీ సన్యాసికూరుఁడు తదర్థ మెంతటిక్రూరకృత్యమైన నొనరింప సమకట్టునని తలంచి యెఱుంగనే. ఈక్రూనేడు సాగరాదు.—ఇఁకనైన నీమతయుద్ధ మంతరింపవలయు. అమారీ యుపదేశించు మార్గమే సూక్ష్మము, నిశ్చయము; కాని, తలంచునంతమాత్రమున హృదయము కంపించును:—ఐనను, అయ్యదె తరుణోపాయము గానోపు."

ఆతెఱంగునఁ గా్ౖరనేడు నిజమనోభవాలోచనమగ్నుఁడై, బాహ్య ప్రపంచము మఱచియుండిన ఆ ముహూర్తమున, భటుఁడొకఁడు నిశ్చలవిస్పష్టస్వరమున నిట్లు హెచ్చరించెను.—“మనపవిత్ర సమాధి సంస్మరింపుడు !”

ఆపలుకులే తత్క్షణము వివిధస్థానములనుండి ప్రతిధ్వనించెను; కా్ౖరనేడు భయప్రకంపితహృదయుఁ డాయెను. నానాదేశములనుండి యరుదెంచిన క్రైస్తవసైనికులు తమపవిత్రసంకల్పమొక్క క్షణమైన మఱవరాదని రక్షకభటులప్పుడప్పుడటులు హెచ్చరింపుచుందురు. ఆవిషయము కా్ౖరనేడెఱుంగనిది కాదు. కాని, చిత్తమును దురాలోచనలు కలంచు నాముహూర్తముననే ఆ హెచ్చరిక వెలువడుటచేత, దైవమే తనునట్లు ప్రభోధించినట్టులు స్ఫురించెను. తదవసరభయావేశమున దశదిశలు వడివడిఁ బరికింప, సకలక్రైస్తవసేనాశిబిరమధ్యమున ‘జార్జిదిబ్బ’ యను సమున్నతస్థలమున సగర్వముగ నెగురు నాంగ్ల పతాకమాతనికి దుస్సహముగ గోచరించెను. తత్సమానప్రతిభాశాలు రగు నితరరాజుల లాంఛనము లాచుట్టును సమప్రదేశమున స్థాపితములై యుండ, వానికంటెఁ దాన యెక్కుడుదానివలె నాంగ్లటెక్కెమొక్కటే యామెట్టపై నమరియుండెను. సమున్నతాంగ్లపతాకము గాంచినంతనే, సూక్ష్మమగు కా్ౖరనేడు చిత్తమున కొకయూహ స్ఫురించెను. ఇంతవఱకు నాతనిఁ గలంచు నాందోళనము తత్క్షణమంతరించెను. కా్ౖరనేడు దృఢాభిప్రాయబద్ధుఁడై, తదుచిత తీవ్రనిశ్చల గమనమునఁ దనశిబిరము జేరి, తనకొఱకు వేచియుండు విశేషపరిజనులకు సెలవొసఁగి, రయమ్మున శయ్యపై వ్రాలి, యిట్లు చింతించెను—

“ఆస్ట్రియా నృపాలుని రేపుగాంతును. మాయుద్యమమెట్లు ఫలించునో చూచెదఁగాక. విఫలమగునేని— అపుడు అమారీ దారుణోపాయము...”

ఆస్ట్రియా దేశము జర్మనుసామ్రాజ్యములోనిది. 'లీపాల్డు' నామధేయుఁడగు నా దేశపాలకుఁడు జర్మనుసమ్రాట్టునకు దగ్గఱచుట్టమగుటచేతఁ బదాధిపత్యము సంపాదింపఁజాలెను. మతయుద్ధానంతరము రిచర్డు ప్రచ్ఛన్నముగ నాస్ట్రియా దేశము జొచ్చెను. లీపాల్డుఁ డాతని బాధించి శాశ్వతమగు దుర్యశము గడించెను. కాని ఆతని కట్టి బుద్ధి స్వాభావికముగా బుట్టినది కాదు. ఆస్ట్రియా పాలకుఁడు దుర్బలుఁడు, దురభిమాని, యాశాపరుఁడు. ఐనను, లీపాల్డుఁడు క్రూరాత్ముఁడుమాత్రము కాఁడు. సమున్నతమై, దృఢమై, మనోహరమై యొప్పు నాతని మూర్తి యెఱుపు దెలుపురంగులతోడ నలరారుచుండెను. ఆ నృపాలుని కురులు దీర్ఘముగఁ జక్కగ నుండెను. తన కాయము తనకే బరువుగ దుర్భరముగ నుండినటుల లీపాల్డుఁడు వికృతముగ నడుచును. ఆస్ట్రియాభూపాలుఁడు సామాన్య వస్త్రములు ధరింపఁడు. ఆతఁడు సదా యమూల్యాంబరములే సగర్వముగఁ దాల్చును. కాని యట్టి వస్త్రధారణ మాతని యాకృతికి సరిపడకుండెను. దురభిమానియగు లీపాల్డుఁడు తన యాధిక్యము నిలుపుకొను విధ మెఱుంగక యసంబద్ధముగఁ బ్రవర్తించుచుండెను. చిత్తము నొకింత స్థిరముగ నుంచి యాత్మగౌరవము సుళువుగా నిలుపుకొనఁ జాలు సమయములందాతఁడు మూర్ఖుఁడై, ధూర్తుఁడై, వాక్పారుష్యము జూపుటయేగాక పరుషకృత్యములుగూడ నొనరించువాఁడు.

అవివేకియగు లీపాల్డుఁడు తా నవివేకముగ మెలఁగుచుంటినని యప్పుడప్పుడు గ్రహింపఁ జాలియుండెను. అట్టి జ్ఞానము సహజముగ బాధకరముగ నుండెను. తనయంతటి రాజ్యాధికారసంపన్నుఁడు మెలఁగవలసినట్లు తాను ఘనముగ మెలఁగుటలేదని యాతఁడు సంకట

పడుచుండెను. తా నాకారణమున బ్రజానిరసనమునకుఁ బాత్రుఁడ నగుదునని యనుమానించి యాతఁడు మఱియు ఖేదపడును.

ఈ ఫిలిపాలనృపాలుఁడు మతయుద్ధసన్నద్ధుఁడై మహాసైన్యసమేతుఁడై బయలుదేఱినపుడు ప్రసిద్ధాంగ్లనృపాలునితోడి స్నేహ మనుభవింపవలయునని వాంఛించెను. అవకాశ మొదవునపు డట్టిప్రయత్నము లాతఁ డొనరించియే యుండెను. ఆస్ట్రియారాజు కేవలము ధైర్యహీనుఁడు కాఁడు. కాని, అపాయమును రమ్యకాంతాలలామనుబోలెఁ గాంక్షించు రిచర్డు నృపాలాగ్రణి యాతఁడు ధీరుఁడు కాఁడని యెంచి నిరసించెను. మఱియు ఫిలిపాలుఁడు నిజ దేశాచారానుగుణముగ భోజనప్రియుఁడును, అమిత మధురసాస్వాదనాయత్తచిత్తుఁడునై యుండెను. ఆంగ్లనృపాలున కట్టి యభ్యాసములు దుస్సహములు. తన యభిప్రాయము నాతఁడు మఱుఁగు పఱుపలేదు. ఫిలిపాలుఁ డాకారణమున సహజముగఁ గుపితుఁ డాయెను. కుటిలుఁడును, వివేకవంతుఁడును, నేర్పరియు, నాంగ్లరాజునకు సహజవిరోధియునగు ఫ్రెంచి నృపాలుఁ డాంగ్లాస్ట్రియా రాజన్యుల పరస్పర విభేదానలమును మఱియుఁ బ్రజ్వలింపఁజేయుచుండెను. ఫ్రాన్సుదేశమున రిచర్డు కొంత రాజ్యము గలిగి యుండెను; ఆతఁ డాసందర్భమున ఫ్రెంచిరాజునకు సామంతుఁడు గావలయు. కాని, స్వతంత్ర్యదేశపరిపాలనాధురంధరుఁడై, భూరిబల ధైర్య గుణాలంకృతుఁడై యొప్పు నారాజేంద్రుఁడు ఫ్రెంచిరాజు నేల లెక్క సేయును? ఫిలిప్పు ప్రతిక్రియ యొనరింపఁజాలక, సహించియు నుండఁజాలక, మతయుద్ధార్థ మరుదెంచిన యితర నాయకులను జాతుర్యము మెయి జేరఁదీసి, యసాధ్యుఁడగు నాంగ్లనృపాలుని భంగపుచ్చవలయునని యోచించెను. స్వార్థపరుఁ డగు కాన్రేడు రిచర్డు నృపాలునిపైఁ గుట్రలు పన్నుచుండిన యాసమయమునఁ బరిస్థితులటు లుండెను.

కాన్రేడు ఆస్ట్రియా పాలకునిఁ గాంచుట కొక నెప ముండవలయుఁ

గదా. "స్పైప్రసు" ద్వీపమునుండి యరుదెంచిన యమూల్యమధురసము తనమిత్రున కొసంగి, దాని ప్రభావ ముగ్గడించి, సందు జూచి కథ నడిపింపవలయునని కార్నేకు నిశ్చయించెను.

మధ్యాహ్నసమయమున నాష్ట్రియా భూపాలుఁడు భోజన మారగించుచుండెను. తన్నిమిత్తమాయత్తమైనబల్ల నానావిధరుచిరాహార పదార్థములతోడను, ప్రశస్తమధుపాత్రములతోడను ఘూర్ణిల్లుచుండెను. దీర్ఘములగు గడ్డములు గల ప్రభువరులు చిత్రవస్త్రధారణ మొనరించి సముచితాసనములఁ జుట్టును గూర్చుండిరి. వివిధప్రాయులగు పరిజనులు తమతమ యజమానుల చాటుననుండి తమలోఁ దాము మాటాడుచు, ప్రభుహస్త ముక్తకబళములు గబళించుచు, నప్పు డప్పుడు వారితో మాటాడుచు హాయిగనుండిరి. గాయకులు, హాస్యగాండ్రు, ప్రహస్యాంగులు గూడ నసంఖ్యాకముగ నుండిరి. వా రందఱు గూడ విచ్చలవిడిగ సురాపాన మొనరించి కేరుచు నుండిరి.

బహుజనసంకీర్ణమై, నానావిధకంఠరవముఖరితమై యొప్పు నా రాజభవనము కార్నేకున కొక మద్యశాలవలెఁ దోఁచెను. ఆష్ట్రియా భూపాలుని నాగరికత యంత నికృష్టముగ నున్నను, ఆతని లాంఛనములు మాత్ర మావంతయు లోపములేకుండ యథావిధమున జరుగవలసియుండెను. సద్వంశమున జనించిన పరిచారకులు మాత్ర మాతని చెంతఁ జేర నర్హులు. వారైనను, బహు జాగరూకతతో సమీపించి, అపారభయభక్తులతో మోఁకరించి, భోజ్యపదార్థములనం దీయవలయు. ఆతని వైభవమున కంత ము లేదు. సువర్ణకలశలందే యాతఁడు మేలురకపు మధురసము ద్రావును. లీపాలుని వస్త్రము సముజ్జ్వలము; కిరీటము స్వతంత్ర నృపాలునిదివోలె నమూల్యముగ రాజిల్లుచుండెను; రెండడుగుల పొడవుగల మొగములు పాదరక్షలు

ఘనరజితపీఠమునంటియుండెను.

శ్రీపాలుని దక్షిణభుజము వెనుక నొక వింతపురుషుఁ డాసీనుఁడై యుండెను. ఆతఁడు సామాన్యుఁడు కాఁడు. వాని నల్లని అంగీపై నున్న నల్లని మొగములు కబ్బామీఁద లెక్కలేని వెండిబంగారు నాణె ములు దీపించుచుండెను. అయ్యవి వివిధరాజన్యు లొసఁగిన బహు మానములు. వెండి నాణెములు గుత్తిగఁగట్టిన యొక పొట్టి చేఁగఱ్ఱ బట్టి, జనుల నాకర్షింపఁ దలయు నప్పు డాతఁడు గళ్లుగఁగొట్టును. వాని యుద్యోగమిట్టిదని నిర్వచించుట కష్టము. గాయకుఁడు, మంత్రి, వంది, కవి, ప్రాసంగికుఁడుగూడనై యాతఁడు నిజరాజాభిమానగౌరవ ములు జూరగొనుచుండెను. ఆ కారణమున రాజ కృపాపేక్షాపరు లామహాసీయుని ముందుగఁ బ్రసన్ను నొనరించుకొనఁ బ్రయత్నించు చుండిరి. ఈతనికి 'వాచాల' నామధేయము సంక్రమించెను. వింత వస్త్రములు వింత టోపీయును వింతగఁదాల్చి, గజ్జెలు, మువ్వలును గల్లుమనిపించు నాస్థాన విదూషకుఁడు రెండవపార్శ్వమున నుండెను.

తాదృశ నానాజన పరివృతుఁడై భోజన మారగించు నాస్త్రియా నృపాలుఁడు కాన్నేడును గాంచినంతనే, ససంభ్రముఁడై, సగౌరవముగ స్వాగతమొసంగి, తన కుడిప్రక్కఁ గూర్చుండఁజేసెను. తనమిత్రు నాంతర్య మరయఁజాలని శ్రీపాలుఁడు నిజవాచాలవిదూషకుల ప్రసంగ మాతని కానంద మొడఁగూర్చునని విశ్వసించి, తానానందింపఁదొడఁ గెను. వాచాలుని ప్రసంగానంతరము విదూషకుఁ డొక చిన్నహాస్య వాక్యము బలికి శ్రోతలను రంజింపఁగడంగును. అట్టులే వాచాలుఁడు తనమిత్రుని ప్రవచనము విమర్శింప దొరఁకొనును. ఒకప్పుడు, ప్రేక్ష కులు తన మాటాలింపవలయునని విదూషకుఁడు ఘల్లుఘల్లున రొద సేయుచుండెను. వాచాలుఁడు గూడ నట్టులే తన దండము ప్రయోగిం చుచుండెను. రాజు మొగలు సేవకుఁడు వఱకును గూడఁ దత్సభాంత

ర్గతజనానీకమంతయు నావిచిత్ర ప్రసంగలహరీతరంగముల నోలలాడు చుండెను.

అట్టి యసంబద్ధప్రవర్తనము కాన్రేడున కేమాత్రము రుచింప కుండెను. ఐనను, నేర్పరియగు నాకౌటిల్యుఁడు తీవ్రపడి స్వీయహృదయ ప్రచురణ మొనరింపక ఆ మూర్ధప్రసంగము తనకనువగు తెరవునకు దిరుగువఱకు వేచియుండెను. అట్టి సమయము గనిపట్టి, ఆతఁ డిట్టు లనెను.—"గౌరవనీయులను గౌరవింపవలసినదే. రిచర్డు తప్పక ప్రశంసనీయుఁడు—ఆతని నిరుపమాన బలసాహసములు స్తవనీయ ములు. కాని, ఇతర రాజన్యులు గూడ సముచిత ధైర్యసాహసములు బ్రదర్శించి ఖ్యాతిగాంచిరి. ఈప్రసిద్ధసభాభవనమున జగద్విఖ్యా తాస్ట్రియా నృపాలకీర్తికలాపమాలాపించు గాయకుఁడు లేఁడా?"

తోడనే యిరువురు తమ వాద్యములు సారించి పాడఁబోయిరి. కాని, తదుత్సవాధిపత్యము వహించువానివలె వాచాలుఁడు వారిని వారించి, మఱియొకని నియోగించెను. వాఁడంత నర్థరహితమగు నొకచిన్నగీత మాలాపించినంతనే, వాచాలుఁడు తనదండము ఘల్లునఁ గొట్టి, తన నామము సార్థకమగునట్లు దీర్ఘముగ నర్థముజెప్పెను. గాయ కుఁడు మఱియొకగీతము బాడెను. తోడనే, వాచాలుఁడిట్లు వ్యాఖ్యా న మొనరించెను.

"అయ్యలారా! ఖగరాజనగా రాజోత్తముఁడగు మన లీపాల భూపాలుఁడేయని గ్రహింపవలయు. పక్షములుగల పక్షిజాతిలో నెల్ల సాళువమే—అనగా, డేగ—సూర్యున కత్యంతసమీపముగ నెగురఁ గలదు."

అదియే సమయమని, కాన్రేడు యథాలాపముగ నిట్టులనెను— "సింహము శ్వానముకంటెను ఎత్తుగ నెగిరెను."

ఆస్ట్రియారాజు క్రోధారుణరంజితవదనుఁడై యనిమిషనయనుఁడై

యిట్టులనెను.—కార్నేకు నృపాలుఁడు మన్నించుగాక—"పక్షిరాజు కంటె బంచాననము పై కెగయుట యసంభవము. సింహామునకుఁ బక్షములు లేవుగదా."

సహజనిశ్చల స్వరమునఁ గార్నేడిట్లు బదులాడెను.—"పక్షములు లేకున్న నేమి? ఆంగ్లరాజ్య లాంఛనమగు సింహము విజృంభించి, పశుపక్షమత్స్యాది జీవగణంబుల నెల్లఁ గృణీకరించు"

మధురస మాస్ట్రియా నృపాలునకు, బాగుగఁ దలకెక్కెను; వడప మధికముగ నెట్లువాటెను—"మిత్రమా? నిజమాడుచుంటివా? ఏకాశయబద్ధులై యమెరికా దేశము స్వతంత్రులై స్వరాజ్యాధీశులకంటెఁ దాను మేటినని రిచర్డు నిక్కముగ గర్వించియుండునా!"

చతురుఁడగు కార్నేడు అల్లననిట్లు వాక్రుచ్చెను—"మిత్రమా? నాకేమి తెలియు? పరిస్థితులు మాత్ర మట్లుగోచరించెను. చూడు మల్లదె—సకలక్రైస్తవ శిబిరవలయాంతర ప్రదేశమున నా తేని పతాకమొక్కటే వాతోద్ధూతమై నిబ్బరముగ నెగురుచున్నది! అఖిల పాశ్చాత్యసైనిక నికాయంబులకుఁ దానే సర్వాధికారినని, తానే తల్లోకైకపాలకుఁడననియు నామహాపురుషుఁడు భావించుఁగాఁబోలు!"

"ఏమి! ఆంగ్లేయుఁ డిట్టి యాగడమొనరింప నీవు సహించియుండుటయేగాక, ఇంత నిర్విచారముగ నిశ్చలముగనుంటివా?"

మధురసకారణ ప్రవర్ధమానాగ్రహాధురీణుఁడగు నాస్ట్రియా భూపాలుఁ డట్లు ప్రశ్నింప, మైరునగరాధిపతియగు కార్నేకు యథా నిశ్చలస్వరమున నిట్లు బదులాడెను.—"రాజపుంగవా! దుర్వార బలాధికారసంపన్నులగు నృపాలురు—ఫ్రాన్సు ఆస్ట్రియా ప్రముఖులే సహించియుండునపుడు, నాలెక్క యేడ? నీకిట్టి యవమానము సహ్యమగునేని, నాకవమానమే లేదు."

దుర్భరక్రోధాతిరేకమున నీపాలుఁడు నిజముష్టిఘాతంబున బల్ల

గొట్టి, యిట్టు లనెను.

"ఈనికృష్టాంగ్లద్వీపస్థు నాగడము గుఱించి ఫిలిప్పుతోఁ జెప్పుచునేయుంటిని. ఎప్పటి కప్పుడు ఫ్రెంచి రాజేదియో సమాధానము చల్లగఁ బల్కును. తనకు రిచర్డు సామంతుఁడట—తానాకారణమున బహిరంగముగ నీసమయమున గలహించుట బాగుండదట"

"ఫ్రెంచి నృపాలుఁడగు ఫిలిప్పు వివేకవంతుఁడని పేరు గాంచె. ఇట్టి సహనము తత్ప్రభావము కానోపు. కాని, నీకట్టి యడ్డంకి లేదు గదా—ఆంగ్లాధికారము నీవేల సహించి యుండవలయునో తెలియకున్నది." కాన్రేడట్లు రేఁప, లీపాలుఁడు సక్రోధముగ నిట్టులనెను.—

"ఏమి! నేనా సహించియుండుట? అఖండయశోమండితమగు రోమను సామ్రాజ్యమునకు జీవకఱ్ఱయగు ప్రసిద్ధాస్ట్రియా నృపాలుఁడొక చిన్నలంకను బాలించు నరాధముని లెక్కసేయునే? మిత్రులారా? సామంతులారా! చమూపతులారా! లెండు, లెండు! గర్వాంధుఁడై, మాబోంట్లను దృణీకరించి నాంగ్లశ్వానము తనయంతర మెఱుంగుఁగాక. రండు! ఆస్ట్రియా శ్యేన విరాజమానలాంఛనమంబరము చుంబించునట్లు పాఁతవలయు—లెండు!"

లీపాలుఁడు తదవసరావేశముననట్లు జలధరధ్వానమునఁ బల్కుచు, దిగ్గునలేచి, తనువెన్నంటి యరుదెంచు జనానీకము సంభ్రమోత్సాహమునఁ గోలాహల మొనరింపఁ దచ్ఛిబిరబాహ్యప్రాంగణమున నల్లలాడు కేతనముం దనకేలునఁబూనినంతనే, కాన్రేడు నిజముగ వారించువానివోలె నిట్టులనెను.—

"రాజోత్తమా! తీవ్రపడవలదు. నేఁ డిట్టి సమయమునఁ గ్రైస్తవశిబిరమును గలహారంగ మొనరించుట యవివేకము కానోపు. మఱి కొంతకాల మీయాంగ్లనృపాలు నాగడము సహించి—"

"ఒక్కగడియ, ఒక్కక్షణమైనను సహింపఁజాల!"—లీపాలుఁ

డట్లు గర్జించి దురంతక్రోధఘూర్ణితమనస్కుఁడై, నిజపతాకబద్ధహస్తుఁడై, సామంతాద్యనేక జనపరివృతుఁడై వడివడిఁబోయి, ఆంగ్లపతాకము సమీపించి, విపరీతావేశమున నద్దానిం బెకలింపఁబోయెను. అంత విదూషకుఁడు ధైర్యము వహించి, నిజభుజద్వయంబునఁ దన యధిపుని బంధించి యిట్టులనెను—"అధిపా! ప్రియాధిపా! వలదు! భద్రము సుమా—సింహమునకుఁ గోరలు కలవు—"

"ఔఁగాక—సాళువమునకుఁ దీక్ష్ణనఖంబులు కలవు గదా!"—

అట్లు ధైర్యముగఁ బ్రత్యుత్తరమొసంగిన ఆస్ట్రియా నృపాలుని హస్తము లింకను ఆంగ్లజెండాకంబమునంటియే యుండెనుగాని, తీసివైచుటకు మాత్రము స్థైర్యము చాలకుండెను.

వాచాలుఁడు కేవలము వివేకరహితుఁడు కాఁడు. వాఁ డాసమయము గనిపట్టి ఖండము ప్రయోగించెను. లీపాలుఁ డభ్యాసవశంబుననో యన రయమున వెనుదిరిగెను. అంత నావిపరీతమంత్రి యుక్తియుక్తముగ నిట్టులనెను.—"సింహము మృగరాజు. అట్టులే వియత్తలమున విహరించు విహంగముల కెల్ల గృధ్రము రాజగు. కావున, ఒకరి యాధిక్య మొకరికి మత్సరకారణము కారాదు. రాజోత్తమా! ఆంగ్లరాజలాంఛనవిరాజమాన కేతనము జోలికిఁబోక, భవదీయలాంఛన మాచెంతనే ప్రతిష్ఠింపుము."

లీపాలుఁ డామాట లాలించినంతనే, ఆంగ్లేయపతాకస్తంభము వీడి తనమిత్రుఁడగు కాన్రేడు కొఱకు నిటునటుఁ జూచెను. కాని, ఆంగ్లాస్ట్రియా నృపాలురకు భేదము గల్గింప సంకల్పించిన ఆకుటిలుఁడు తనకార్యము సఫలమగు చుంటఁగాంచి, ఎవ్వరు గాంచకుండ మాయ మాయెను. తనమిత్రుఁడు కానరాని కారణమున లీపాలుఁ డెలుఁగెత్తి యిట్టులనెను—"ఆంగ్లరాజు ఫ్రెంచి నృపాలుని సామంతుఁడు. నేనో!—విశాలధరణీసామ్రాజ్యభారధురంధరవంశజుఁడ. మదీయ

పతాక మీావతాకముం దలదన్ని యెగురుటకుఁ దగియుండు. ఐనను, సకల క్రైస్తవసమ్మేళనమునకు భంగ మాపాదింపనొల్లక, అస్మదీయ గౌరవమునకు భంగము వొరయకుండ ఈయాంగ్ల కేతనముతో సమానముగ నాలాంఛనము గూడ నిట నెలకొల్పెదను.”

ఆనృపాలుఁ డాసందర్భమున సకల జనహృదయరంజన మొనరింపఁ జాలు మధురసమొక పీపా తెప్పించి తన్నికటస్థ జనానీకమునకు విందొనరించెను. ఆస్ట్రియా కేతము స్థాపితమాయెను. ఆప్రదేశము బహుళజనధ్వానఘూర్ణిత మాయెను.

ఆముహూర్తముననే రిచర్డు నృపాలుఁడు మేలుకొనఁజాలు సమయ మరుదెంచెను. హాకీము చక్కఁగఁ బరిశీలించి, చేయవలసిన యుపచారము లొనరించి, జ్వర మంతరించెనని లోయ ప్రభునకుఁ దెలిపెను. ఆంగ్లనృపాలుఁడు నిరుపమాన దృఢగాత్రుఁ డగుటచేత మఱియొక సారి యౌషధమీాయు నవసరము లేకుండనే రోగవిము క్తుఁడాయెను. ఆవిషయ మత్యంతానుభవముగల మహాస్మదీయ వైద్యునకుఁ గూడ నాశ్చర్యము గలిగించెను. నృపాలుఁడు నయనములు నులుముకొనుచు మేల్కాంచి, సుఖాసీనుఁడై, పునరారోగ్య ప్రాప్తకారణానందాతిరేకమున లోయప్రభు నుద్దేశించి, తనకోశమున నెంత ధనముండునని ప్రశ్నించెను. ఆతఁడు సరిగా సమాధానమీాయలేక పోవుటచే, నృపాలుఁ డిట్టులనెను.

“కోశాగారమునందలి ధన మెంతయైనను సరె—తక్కువెక్కువలు సరకుసేయక, పవిత్రమతయుద్ధమునకు నన్ను మగుడ నాయిత్తపఱిచిన ఈ వైద్యవిద్యావిశారదునకు బహుమానపురస్సరముగా నొసంగుము. వేయినాణ్యములకుఁ దక్కువగ నుండునేని, వలయు నాభరణము లొసఁగి యాలోటు పూరింపుము.”

ఆంగ్లరా జిట్లు పలుక, ఆదంబేకు నామధేయుఁడగు హాకీ మిట్టు

లనెను—"అల్లావారు ప్రసాదించిన విజ్ఞానము విక్రయింపఁజాలను. మహారాజా! అట్టి క్షుద్రకార్య మొనరింతునేని, ఈ దివ్యౌషధప్రభావ మంతరించునని యెఱుంగుము."

లోయప్రభువు విస్మయాక్రాంతచిత్తుఁడై యిట్టు లనుకొనెను—"ఈ వైద్యుఁడు ధనము నిరాకరించెను! విపరీతము! తాను శతవర్ష ప్రాయుఁడనని తొల్లి చెప్పెను—ధనోపేక్ష మఱియు వింతగ నున్నది."

ఆపలుకులు తన వీనులం బడ, రిచర్డునృపాలుఁ డిట్టు లనెను—

"లోయా! ఖడ్గముధరించి ధైర్యము జూపుటతప్ప వేఱొకటి నీకుఁ దెలియదు. క్రైస్తవశూరజనోచితగుణంబులే కాని అన్యము నీకు దుర్గ్రాహ్యము. నిశ్చలస్వాతంత్ర్యప్రియుఁ డగు నీ మహమ్మదీయుఁ డుత్తమోత్తమ పాశ్చాత్యశూరులకుఁ గూడ నాదర్శప్రాయుఁడగు సుమా."

వినయగౌరవపురస్సరముగాఁ దన కరములు ముకుళించి, స్వీయ గౌరవమునకు భంగము వాటయని తెఱంగునఁ దోఁచి, తాదృశస్వరంబున నా మహమ్మదీయుఁ డిట్టు లనెను—"ప్రసిద్ధ *రిక్కరాయాగ్రణుఁడీ సేవకు నిట్లు ప్రశంసించుటయే గొప్ప బహుమానము—కాని, నీ వింకను బసుండి విశ్రాంతి గాంచవలయు. ఈ దివ్యౌషధ మింకొక సారి సేవింపవలసిన యవసరము లేదని భావింతును. ఐనను, బల మలవడునుండ అలసట పడుదువేని, అపాయము కలుగవచ్చును. నాప్రార్థన మన్నించి విశ్రమింపుము."

రిచర్డునృపాలుఁ డిట్లు బదులాడెను—

"హాకీమ్! నీమాట జవదాటరాదు. కాని, బహుదినములనుండి దహించు రోగమునుండి విముక్తుఁడనైతి. ఇపుడా బాధావంతయు

---

*రిక్కరాయఁడు=రిచర్డురాజు.

లేదు. యథాక్రమంబున నెట్టి యోధునైన మార్కొనఁజాలుదు—ఏమి! ఏమి యీ యాకస్మికకోలాహలము? కరతాళధ్వనులు—గానాలాపము—దవ్వున వినవచ్చుచున్నవే! లోయా! నీవు తత్క్షణ మేగి యరసిరమ్ము."

లోయప్రభువు తోడనే యవ్వల కేగి, యొక్కనిమిషమున మగిడి, యిట్లు నివేదించెను—"ఆస్ట్రియాదేశాధిపతియగు లీపాలుఁడు మధుపానమత్తుఁడై, తాదృశపరిజనపరివృతుఁడై, శిబిరాంతరమునఁ బరిభ్రమించును."

"త్రాగుబోతు! ఈ మృగప్రాయుఁడు నిజమందిరాభ్యంతరమున నడఁగియుండక, క్రైస్తవాన్వయము 'ఛీ' యనునట్లు వాడవాడల నేల తిరుగాడవలయు?" ఆంగ్లభూపాలుఁ డటు లనునంతలో టైరు నగరపాలకుఁడగు కాన్రేడు ప్రవేశించుట గాంచి, యాతఁడు వెండియు నిట్టు లనెను—"టైరునగరాధిపా! నీ వేమందువు?"

"మహారాజా! రోగపరిత్యక్తుఁడ వగుట కను మోదావహము—కాని, క్షమింపవలయు—ఆస్ట్రియానృపా లాతిథ్యము చవిఁజూచినవాఁ డింతకంటె మాటాడుట యసంబద్ధము."

"ఆస్ట్రియా మధుపానమత్తాగ్రేసరుని విందు నీవును గుడిచియుంటివా? బాగు. కాని, అచ్చటి వింతలేమి? ఈ కోలాహలకారణ మెద్ది? కాన్రేడు మహాశయా! నీవంటి భోగపరాయణుఁడు ఇంతలో విరమించి యిటు లరుదెంచుట వింతగఁ దోఁచెడిని."

ఆంగ్లరాజ వాగ్ధోరణి యరసిన లోయప్రభు వావెనుకకుఁ బోయి, ఆస్ట్రియానృపాలుని చేష్టలు తెలుపవలదని కాన్రేడునకు సన్న యొనరించెను. కాని, తా నా విషయము గాంచనట్లును, కాంచినను తదర్థ మెఱుంగనియట్లు నటించి, ఆ మోసకాఁ డిట్టు లనెను—

"రాజపుంగవా! లీపాలుని చర్యలు మన కెల్లరకుఁ దెల్లముగదా,

నే నిపు డాతని వీడివచ్చుట నిక్కము. ఏమందువా? ఆ మూర్ఖ చిత్తుఁడు తానే మొనరించుచుండెనో యెఱుంగఁడు. అఖిల క్రైస్తవశిబిరశ్రేణీ మధ్యస్థోన్నతప్రదేశమున మిన్నంటు నాంగ్లపతాకము నిర్మూలించి, తన కేతన మాతఁడు నిలుపఁగడంగుట గాంచి, యట నిలువఁ జాలక—"

"ఏమంటివి?"—వచ్చినవారిని మేలుకొలుపఁజాలు భయదభూరి ధ్వానమున రిచర్డు గర్జింప, కాన్రేడిట్టు లనెను—"రాజపుంగవా! ఆగ్రహింపకుము. అజ్ఞుఁ డజ్ఞానముగఁ జరించుఁగాక—"

"వలదు! అటు లాడవలదు!"—సింహలాంఛనుఁడు సింహము వలె గర్జింపుచు, విద్యుద్వేగమున శయ్యనుండి లంఘించి వస్త్రధారణ మొనరించెను—"మైరుప్రభూ! మాటాడకుము! లోయూ! ఒక్కపలు కాడవలదని యాజ్ఞాపించువాఁడ—అధరస్పందన మొనరించువాఁడు మామిత్రుఁడు కాఁడు. హాకీన్! నీవును మాటాడవలదు!"

రాజహితాభిలాషులయ్యుఁ దచ్ఛాసన మతిక్రమింపనేరక, లోయు వైద్యులు భయసంభ్రమాకులులై, యనిమేషనయనులై, చూచు చుండ, నృపాలుఁడు వస్త్రాచ్ఛాదన మైనంతనే, కంబమున వ్రేలాడు ఖడ్గము దీసి, ఇతరాయుధంబులు జూడక, ఏపరిజనునైనఁ జీరక, శర వేగమున నవ్వలకుఁ బోయెను. తాను విస్మయపరవశుఁడైనటులు కాన్రేడు నటించి, లోయప్రభువుతో మాటాడఁబోయెను. కాని, ఆంగ్లేయుఁ డాతని నవ్వలకు ద్రోసికొనిపోయి, యొక రాజసేవకునితో వడిగా నిట్టు లనెను—"నీవు పరుగునఁ బోయి, 'శాలిసబరీ' ప్రభువు తన సైన్యముతో నాంగ్లపతాకము చెంతకు రయమ్మున రావలయునని తెలుపుము. నృపాలుఁడు జ్వరముడిగి స్వస్థత గాంచెనని కూడ నెఱిఁగింపుము."

పరిచారకుఁ డా పలుకులు బాగుగ నాలింపలేదు; ఆలించినను

సరిగా నర్థము జేసికొనఁజాలక పోయెను. కాని, తమ నృపాలుఁ డున్మాదునివలెఁ బాఱుటయు, ఆవెనుకలోయప్రభువు నిర్భరాందోళిత చిత్తుఁడై పరుగిడుటయుం గాంచిన పరిచారకులు మిక్కిలి కలవరపడి నలుదెసలఁ బాఱి, తగు సమాధాన మీయకుండ వివిధాంగ్లసైనిక నికాయంబులు డాసి, యుద్ధసన్నద్ధులు కావలయునని వారిని హెచ్చరించిరి. దుస్సహసూర్యాతపంబునకు భయపడి, మధ్యాహ్నభోజనానంతరము వారు విశ్రాంతి గాంచుచుండిరి. అంతలో నెట్టి ప్రమాదము సంభవమాయెనో వా రెఱుంగరు. ఎఱిఁగింపఁగలవా రెవ్వరును గానరారు. గావున, దామే యొక సమాధానము గల్పించుకొని సమరసన్నాహులు గాఁ జొచ్చిరి. మహమ్మదీయు లాకస్మికముగఁ దమ శిబిరము బ్రవేశించిరనియు, రిచర్డునృపాల ప్రాణాపహరణాయత్తులైరనియుఁ గొందఱు భావించిరి. విషరోగకారణమున నాతఁడు గడచిన రేయియే స్వర్గస్థుఁ డాయెనని మఱికొంద ఱూహించిరి. అట్లుగాక, దుష్టాస్త్రీయా కృపాణమున కెరయై మహారాజు మరణించెనని యింకొందరు నిశ్చయించిరి. ప్రభువులు నధికారులును గూడ నాకస్మికాందోళనకారణ మరయఁజాలనివారయ్యు, దమ యుద్యోగానుగుణముగఁ దమతమ సైనికులను జేరదీసి యెట్టి యుపాయమునైనను మార్కొనుటకు సంసిద్ధులైరి. ఆంగ్లతూర్యములు తత్క్షణము మ్రోగెను. "ఆయుధములు దాల్పుఁడు! ఆయుధములు దాల్పుఁడు—" అను హెచ్చరికలతో నాప్రదేశ మంతయు మాఱుమ్రోగెను.

ఆ సమీపమున నొక శిబిరమున వివిధదేశ క్రైస్తవులు విడిసియుండిరి. వారును ఆ కోలాహల మాలించి భయభ్రాంతులై ఆయుధధారణార్థము తమతమ నెలవులకుఁ బోఁజొచ్చిరి. అట్టి గంద్రగోళ మెట్లు పరిణమించియుండెడిదో యెఱుంగరాదు. అదృష్టవశమున 'శాలిసబరీ' ప్రభు వచటనే యుండెను. లోయప్రభుసందేశము తెలిసి

నంతనే యాతఁడు సిద్ధముగనుండిన జోడులతోడ నాంగ్లపతాకము వంక బాఱుచు తక్కుంగల సైనికు లెల్లరు యుద్ధసన్నద్ధులు గావల యునని యాజ్ఞాపించెను.

నిరంతర ప్రవర్ధమానమగు కోలాహలము లేశమైనను పాటింపక తన వస్త్రధారణ మసంబద్ధముగ నుండెనని యెఱుంగక కోశబద్ధమగు ఖడ్గమును దన కక్షయందుఁ బట్టి యాంగ్లభూపాలుఁ డమందగమన మునఁ బతాకస్థానమునకుఁ బోవుచుండెను. లోయప్రభువును మఱి యొక రిద్దఱుమాత్ర మాతనివెంట నుండిరి.

రోగార్తుఁ డగు రిచర్డ్నృపాలుఁ డాకస్మికముగ లేచి నిరాడంబ రముగ నిరుపమాన తీవ్రగమనమున నరుదెంచుటచేత ముందఱి శ్రేణుల కాసమాచారము తెలియకమున్నె యాతఁడు వారి నతిక్ర మించుచుండెను. కాని ఆస్ట్రియాన్నృపాల మధుభిక్షాజనిత సంరంభ మాలించి తోడనే శిబిరాభ్యంతరమున కేగి వీక్షించు నాయా సైని కులు నృపాలునాచందమునఁ గాంచి భయసంభ్రమపరులై తాము సంసిద్ధులు కా జొచ్చిరి. ఆ తావుననే స్కాచిశిబిరముకూడ నుండెను. స్కాటు లల్పసంఖ్యాకులు. ఆస్ట్రియాన్నృపాల మదిరోత్సవము వారినిఁ గలంపలేదు. కాని రోగార్తుఁడగు నాంగ్లమహారాజమూర్తి యాక స్మికముగ నట్లు తోఁచుటచేత నేదియేని అపాయము సంభవించి యుండునని యెంచి చిత్రకలాంఛనుఁడగు కణతుఁ డన్యాలోచనరహి తుఁడై డాలుకత్తులుమాత్రము రయమ్మునఁబట్టి తత్క్షణ మావెంటఁ బోయి లోయప్రభునిఁ జూచి సంజ్ఞాపూర్వకముగ బ్రశ్నించెను. ఆంగ్లే యుఁడు ప్రత్యుత్తర మీయక భుజము లెగురవైచెను. అంగరక్షకులు వోలె వా రిరువురు రాజువెంటఁ బాఱిరి.

ఆంగ్లనృపాలుఁడు జార్జిదిబ్బ సమీపించెను. ఆ పార్శ్వములు వేది కయును ఆస్ట్రియాజనసంకీర్ణములై యుండెను. ఇతరదేశస్థులుగూడ

నుండిరి. స్వీయదేశ పతాకస్థాపనము స్వీయజాతీయ గౌరవస్థాపనమని యెంచిన లీపాలుని పరివారము తదవసరోత్సాహమునఁ గేరుచు, నాడుచు, బ్రపంచము మఱచియుండిరి. ఆంగ్ల రాజవిజృంభణము సహింపని యన్యదేశస్థు లాస్ట్రియారాజకృత్యము సానందముగఁ దిలకింపుచుండిరి. తక్కుంగల జనులు కేవలము వినోదార్థ మట మూఁగియుండిరి. వాయుపూరితమైన మేలురకంపు నౌక యవిరళతరంగ ఘూర్ణితపారావారము నుత్తరించి శీఘ్రముగఁ బాఱువిధమున నాంగ్లరా జాయాజనసందోహములను ద్రోసిగొనివచ్చెను.

జార్జిదిబ్బపై సమప్రదేశము కొంత కలదు. పతాకము లచటనే నిలిచియుండెను. ఆస్ట్రియానృపాలుఁ డింకను నిజమిత్ర పరివారసమేతుఁడై యాతావుననే యుండెను. స్వీయజనమధ్యస్థుఁడగు నా తేఁడు తా నొనరించిన ఘనకార్యము సంతోషముగఁ దిలకింపుచు, నిరంతర ప్రజాఘోష మాలింపుచు మైమఱచియుండిన సమయమున దుర్వార ధైర్యబలోపేతులగు కణాతలోయప్రభులుమాత్రము పిఱుంద నరుదేఱ నాంగ్లభూపాలుఁడు మెఱపువలె నటఁ దోఁచి ఆస్ట్రియాపతాకముం బట్టి భూకంపసమయసముద్భవ భీషణకంఠరవంబున నిట్లు ప్రశ్నించెను—

"ప్రసిద్ధాంగ్లపతాకముచెంత నీ హేయంపుబీలిక నుంచుట కెవ్వఁడు సాహసించెను ? ఎవ్వఁడు ?"

అధీరుడుకాని లీపాలునకు బదులాడకుండుట కడు కష్టముగ నుండెను. కాని నిజగుణాతిశయమునఁ బ్రజానీకమును బ్రమోదపడఁ జేయు మేటిపురుషుఁ డాకస్మికముగఁ బ్రత్యక్షమైన కారణమున నాస్ట్రియానృపాలునిధైర్య మక్కరకు రాకుండెను. రిచర్డునృపాలుఁ డంత దుర్దాంతక్రోధఘూర్ణితమానమానసుఁడై భూమ్యాకాశంబులు కంపించునట్లు మగుడఁ బ్రశ్నింప లీపాలుఁడు సాధ్యమగు ధీరస్వరం

బునఁ దానె యని బలికెను.

రిచర్డుమగుడ నిట్టు లనెను—

"ఆస్ట్రియా లీపాలుని పతాకము నాంగ్ల దేశాధీశుఁ డెట్లు గౌరవించునో యాతఁడు గాంచుఁగాక."

రిచర్డు రా జట్లు పలుకుచు నాస్ట్రియా జెండాకొయ్య సులువుగా నూడఁదీసి తుత్తునియ లొనరించి పతాకముపైఁ దన పాదమూని వెండియు నిట్టు లనెను—

"ఆస్ట్రియాపతాకము నీ విధమున మట్టువాఁడ! నాచేష్ట నధిక్షేపించు శూరుఁ డిం దెవ్వఁడైనఁ గలఁడా?"

ఒక్క క్షణకాల మెవ్వరు మాటాడలేదు.

ఆస్ట్రియాజాతివారు సాటిలేని ధైర్యశాలురు. ఆ కారణమున నా దేశశూరులు పెక్కండ్రు 'నేను, నేను' అని పలికిరి. వారి నృపాలుఁడుగూడ నట్టులే యనెను.

'వల్రాడు' అను నాస్ట్రియానాయకుఁడు ప్రసిద్ధశూరుఁడు; అమానుషదీర్ఘకాయుఁడు. ఆంగ్ల రాజవచోఘాతమునఁ గనలి యాతఁడు గంభీరముగ నిట్టు లనెను. "మిత్రులారా! ఈ జాలమేల? ఆస్ట్రియా ప్రజాగౌరవలాంఛనమగు పతాకరాజము నీ మనుజుఁడు ముష్కరుఁడై తన పాదమున మట్టి వేయుచుండెను. ఈ యాంగ్లేయుని మదమడంచి మన పతాకగౌరవము నిలఁబెట్టవలయు!"

అమానుషాకారుఁడగు వల్రాడు అట్లు పౌరుషముగఁ బలుకుచు ఖడ్గము నూడదీసి భుజమెత్తి రిచర్డును బ్రహరింపఁబోయెను. నిర్లక్ష్యముగ నుండిన యాంగ్లనృపాలుఁ డా వ్రేటున భంగపడవలసినదె కాని, స్కాచిశూరుఁడు రయమ్మున దన డాలొగ్గి యా ప్రమాదము దొలఁగించెను. అంత వారందఱు నాలింపఁజాలు భీకరస్వరంబున నాంగ్లరా జిట్టు లనెను—

“మతయుద్ధదీక్షాపరుఁడై సిలువదాల్చి క్రైస్తవునిఁ గొట్టనని ప్రతిన బట్టితి. వర్లాడ్ ! నీ వాకారణమున సజీవుఁడై యుండి రిచర్డునృపాలు నెల్లపుడు సంస్మరింపుము.” అట్లు పలుకు నామేటి యోధుఁడు తత్క్షణ మా దీర్ఘకాయుని నడుముబట్టి యన్య జనాసాధ్య జవసత్వకౌశలము లచ్చుపడునట్లు విసరివైచెను. యంత్ర నిర్ముక్తగోళమో యన, నా హతభాగ్యుఁడు తన్నికట ప్రజావలయ మునేగాక, నిమ్నతర ప్రజావలయముగూడ నతిక్రమించి, భూప తనుఁడై, శిథిలభుజుఁడై విగతస్మారకుఁడై, మృతప్రాయుఁ డాయెను. ప్రేక్షకు లమిత భయసంభ్రమంబునఁ జైతన్యవిహీనులైరి. కడుదూర స్థులగు జనులుమాత్రము గొందఱు తమ కరవాలములు కణకణ లాడించి “కొట్టుఁడు! ఆంగ్లద్వీపశ్వానమును బరిమార్పుఁడు!” అని యఱచిరి. కాని దగ్గఱ నున్నవారు మాత్ర మేమియు ననఁజాలక శాంతిస్థాపన మొనరింపఁ జూచువారినలె వారిని హెచ్చరించిరి.

ఆస్ట్రియాయోధజనులు పరస్పరవిరుద్ధాభిప్రాయబద్ధులై చూచుచు నుండ నా దేశపతాకము నింకను మట్టియున్న రిచర్డునృపాలుఁడు భయదవిస్ఫారితనయనుఁడై తగు ప్రత్యర్థిని గాంచువానివలె జుట్టును గలయఁజూచెను. త ద్దుర్నిరీక్ష్య వీక్షణపాతము భరింపఁజాలని ఆస్ట్రియాశూరులు పంచాననము గాంచు మృగములవలెఁ బ్రకంపిత హృదయులైరి. అతికాయులు, అతి బలశాలులు, అతి ధైర్యవంతులు నగు కణాతలోయశూరులు, సంఖ్య కిరువురుమాత్రమయ్యు, నెందఱ నైన వారించుటకు సంసిద్ధులై యుండిరి.

ఈలోపున శాలిసబరీ ప్రభువు సైన్యసమేతుఁడై యరుదెంచెను. ఆవిలుకాండ్రు తమ చాపముల నెక్కుపెట్టి, యాజ్ఞయగునంతనే శత్రు సంహార మొనరించుటకు, నిరీక్షించుచుండిరి.

ఈయాకస్మిక పరిణామము దెలిసినంతనే ఫ్రెంచిరాజగు ఫిలిప్పు,

ఇరువురు ప్రభువులను మాత్రము వెంటబెట్టుకొని, రయమ్మున రంగమున కరుదెంచి, రోగశయ్య వీడి యట నిలుచు నాంగ్లనృపాలుని గాంచి వెఱగందెను. తమ మిత్రుఁడగు నాస్ట్రియా నాయకునిఁ గూడ యాతఁడు తిలకించెను. ఆంగ్లదేశాధీశుఁడు తదుచితవస్త్రాలంకృతుఁడై యుండకుండుటయేగాక, మతయుద్ధసమయ విరుద్ధముగఁ దోఁడి క్రైస్తవ నాయకుఁడగు నాస్ట్రియా నృపాలునితోఁ గలహించియుండెను. తానట్టి సమయమునఁ దనసహజవిరోధియగు ఫిలిప్పు కంటఁబడుట యావమానవంతునకుఁ గడు దుర్భరముగనుండెను. అప్రయత్నముగ నోయన, నాంగ్లరాజు తన చరణము నాస్ట్రియా లాంఛనమునుండి యల్లనఁదీసి, క్రోధావేశ ముడిగి యథానిశ్చలత వహింపఁ గడఁగెను. ఫ్రెంచి నృపాలుని గాంచిన లీపాలుఁడు గూడఁ జిన్నబోయెను. ఏమన,—ఆంగ్లభూపాలుఁడు ధూర్తుఁడై తన పతాకముం దనకట్టె దుట మట్టుటయు, లీపాలుఁడు ప్రతిక్రియ యాచరింపక సహించి యుంటయును ఫ్రెంచి నృపాలుఁడు గాంచెఁగదా. ఆంగ్లరాజు తను నవమానించుటకంటె ఫ్రెంచిరాజు ఆయవమానము గాంచుట యాత నికి మఱియు బాధాకరముగనుండెను. ఐనను లీపాలుఁడు గూడఁ దన యారాటమడఁచికొనఁ బ్రయత్నించెను.

బహుళసద్గుణవిరాజితుఁడగు ఫ్రెంచిరాజు రాజ్యభారము వహిం చుటకు సర్వవిధములఁ దగియుండెను. ఫిలిప్పునకుఁగల విజ్ఞానము వివే కము నపారములు. ఆలోచనయందు దొడ్డవాఁడు. దేశోద్ధరణకార్య తత్పరుఁడగు నాతని రాజ్యతంత్రపరిజ్ఞానము నిరుపమానము. కార్య సాధనమునకువలయు ధైర్యస్థైర్యాదిగుణములు గూడ నలవడియుండు టచే నాతఁడు నాఁటి నృపాలురందఱిలో నిక్కముగ మేటియై యుం డెను. కాని, శూరగుణప్రధానమగు నా కాలమున వివేకముకంటె వీరత్వమెక్కుడు గణనీయమై యుండెను. వెనుకముం దాలోచింపక

బలధైర్యస్థైర్యగుణంబుల వైరులఁ జెక్కాఁడు వీరవరుఁడే ప్రజాభిమాన గౌరవములకుఁ బాత్రుఁడగుచుండెను. మఱియొకకాలమున ఫ్రెంచి రాజు శ్రేష్ఠుఁడై విరాజిల్లియుండెడివాఁడు, కాని, ఆధూర్తయుగమున మాత్రమట్లు గాకపోయెను. అసంబద్ధమతియుద్ధావసరమునఁ గేవలము శూరత్వము మాత్రము శ్లాఘనీయ మాయెను. వివేకము దౌర్బల్య చిహ్నమనియు వివేకసంకలితమగు శౌర్యము శౌర్యమే కాదనియు నాఁటిజనులు భావించియుండిరి. దివ్వటీకంటె దీప మత్యంతప్రయోజన కారి యైనను, దివ్వటియే దశాధికముగఁ బ్రజాదృష్టి నాకర్షించును. అట్లులే రిచర్డు ఫిలిప్పుకంటె కడు నధికతరముగఁ బ్రజాహృదయము నాకర్షించెను. ఆకారణమున గుణవంతుఁడును అభిమానధనుఁడు నగు ఫ్రెంచిరాజు లోలోనఁ గనలుచుండెను. అట్టివాని కిట్టి యవకాశము కడునను కూలముగ నుండెను. ఆతఁ డిట్టుల నెను.—

"ఈకలహమేడ? ఆంగ్లాస్ట్రియా దేశపరిపాలనా ధురంధరులారా! మతయుద్ధబద్ధభ్రాతృవర్గము తమలోఁ దామీపగిది గలహింపనేల?—"

తను నాస్ట్రియాపాలకునితో సమానునిగ జూచు ఫ్రెంచినృపాలుని వాక్కులు సహింపఁజాలక, తదభిప్రాయము దెలుపు విధమెఱుఁగక, ఆంగ్లరాజు క్రోధఘూర్ణితుఁడై యిట్టుల నెను.— "ఫ్రెంచిరాజా! చాలు! ఇట్టి విమర్శ యనవసరము. ఈతఁడు పాలకుఁడో, రాజన్యుఁడో, ధురంధరుఁడో మఱి యేమైన నగుగాక—ధూర్తముగ వర్తించె. నేను బుద్ధిచెప్పితి—అంతే."

అంత నాస్ట్రియా దేశాధిపతియగు లీపాలుఁ డిట్టుల నెను.—

"ఫ్రాన్సుదేశాధిపా, నీకును ఇతరస్వతంత్రక్రైస్తవరాజన్యులకుఁ గూడఁ దెలుపవలయును. ఈయాంగ్లరాజు మదీయపతాకమూడఁ బెఱికి పాదమునమట్టి నన్నెంతయేని అవమానించెను."

"నా కేతనముతో సరిసమానముగఁ దనలాంఛన మీతడు నిలుప

సాహసించెను"—ఆంగ్లనృపాలుఁడు తత్క్షణమట్లు కారణము దెలుప, లీపాలుఁడు మగుడ నిట్టులనెను.—"నీవలె నేఁగూడ స్వతంత్రరాజునే గదా."

ఫ్రెంచిరాజట నుండుటచే నాతనికి ధైర్యమలవడెను. రిచర్డు రోషారుణనయనుఁడై యిట్లు పల్కెను.—"తాదృశాధిక్యము పురస్కరించుకొని మాటాడుదేని, నీపతాకము గతియే నీకును బట్టఁగలదు! భద్రము!"

ఫ్రెంచినృపాలుఁ డిట్టులనెను.—"ఆంగ్లసోదరా! శాంతింపుము. మనసోదరుఁ డీసందర్భమునఁ బొరపడెనని వ్యక్తపఱచెద. ఆస్ట్రియా సోదరా! ఆంగ్లపతాక మొక్కటే ఈయగ్రస్థానము నాక్రమించి యుండుటకుఁ గతం బెఱుఁగుము. మనకంటె నీభూపాలుఁ డధికుఁడని కాదు. అస్మదీయదేశాంతర భూస్వామియగు మనసోదరుఁ డాకారణమున నాకు సామంతుఁడగు. ఐనను, ఇతరపతాకములవలె నాయది కూడఁ గ్రిందిభాగముననే నిలిచియున్నది. కారణమేమన,—ఏకాశయబద్ధులమై సాంద్రతరమైన రిజన కాంతారము దెగనఱికి క్రైస్తవలోకైకపవిత్రధామమగు జెరూసలేము నగరము నైవశమొనరించుకొనఁ గోరి మనము రిచర్డునృపాలుని సర్వసేనానాయకునిగా నెన్నుకొంటిమి. ఆకారణమున నాంగ్లపతాక మొక్కటె యిందుండు. కావున నీవొనరించిన తప్పిద మొప్పుకొందువని విశ్వసింతును. అనంతరము మనసోదరుఁ డాంగ్లభూపాలుఁడు తానొనరించిన యకృత్యమునకు సమాధాన మీయఁగలఁడు."

ఆంగ్లేయనృపాలుఁ డిరుదెంచినంతనే వాచాలవిదూషకులు భయవిహ్వలులై సురక్షితదూరప్రదేశమునకుఁ బోయిరి. ఫ్రెంచినృపాలాగమనముచే వారు ధైర్యముదాల్చి మగుడ సమీపించిరి. ఫిలిప్పిట్టులు పలుక, ఆస్ట్రియారాజగు లీపాలుఁ డాగ్రహ ఘూర్ణితుఁడై యావివా

దము క్రైస్తవరాజసభకు నివేదింతునని తెల్పెను. ఫ్రెంచిరా జామోదించెను.

ఫిలిప్పుయొక్క ఉపన్యాసము ముగియువఱకు నిర్లక్ష్యముగనే యుండి, యనంతరము రిచర్డిట్టులనెను.—

“ఫ్రాన్సు సోదరా! ఈజ్వరమింకను వీడకున్నది. మాంద్యముగ నున్నది. నాస్వభావము నీకుఁ దెలియుఁగదా—అధికప్రసంగమే నెఱుఁగ—కాన నాయభిమతమరయుము—మదీయ దేశగౌరవ సంబంధవిషయ మొక రాజునకుఁ గాని, రాజసభకుఁ గాని, పోపునకుఁ నివేదించువాఁడఁగాను. ఇదె నాపతాకము! ఈ సమీపమున మఱియొండు పొడసూపునేని—ఫ్రెంచి లాంఛనమైనను సరే—అదియు నీనికృష్టావస్థకే పాల్పడును. అట్టి సాహసమొనరించువానిని గల హారంగమునఁ దాఁకుటయే నే నీయఁగల సమాధానము—ఒక శూరుఁడు కాఁడు—ఐదుగురైనను సరే.”

విదూషకుఁ డంతఁ దనయనుచరుని శ్రవణమున మెల్లగ నిట్టులనెను.—“ఇది పరిపూర్ణమూర్ఖతయగును—ఈరిచర్డు ననుఁబోలి యాడెను.—కాని, ఈతని మెప్పించు మూర్ఖుఁడు మఱియొకఁ డుండ వచ్చును.”

‘ఎవ్వఁడ’ని వాచాలుఁడు ప్రశ్నింప, విదూషకుఁ డిట్లు బదులాడెను.—“ఫిలిప్పు కావచ్చును—కాదేని, మనమహారాజే సిద్ధపడును. కాని, వాచాలా! కిరీటములు ధరించు ఈరాజులు తామే వాచాల విదూషకులరై మనస్థానమాక్రమించిరి! మనమే రాజ్యార్హులము గావలయు సుమా!”

వాచాల విదూషకుల ప్రసంగ మటుండ, నాంగ్లరాజ ధూర్తాలాపములు సరకు సేయక ఫ్రెంచినృపాలుఁడు నిశ్చల స్వరంబున నిట్లు బదులాడెను.—“పవిత్రకార్య సాధనాయత్తులమై మన మొనరించిన సమ

యమునకు విరుద్ధముగ నవీనకలహాకల్పనార్థము నే నరుదేలలేదు. భ్రాతృసమానులమగు మనము తదుచితముగనే ఈసమయమున వీడి మనమన తావులకుఁ బోవలయు. మన యుగ్రహపరాక్రమములు మ్లేచ్ఛజనఖండనమున వ్యక్తముగావలయు."

రిచర్డు ధూర్తుఁడయ్యు, నుదారహృదయుఁడు. ఫ్రెంచిరా జట్లు సమంజసముగఁ బలికినంతనే, యాతఁడు ధారాళముగ సమ్మతించి, తన కరమందిచ్చెను. ఫిలిప్పు ఆస్ట్రియానృపాలునిఁ గూడ నాహ్వానించెను. ఆతని యుద్దేశముగూడ నట్టులే యుండెను. ఐనను, ఆగ్రహావమానము లింకను దొలంగకుండుటచే, నాతఁ డర్ధాంగీకృతచిత్తుఁడై సమీపింప, నాంగ్లరాజు యథాతీక్ష్ణముగ నిట్లు నిరసించెను—"జడులతోడను, వారి జడత్వముతోడను నాకుఁ బనిలేదు."

ఆస్ట్రియాదేశాధిపతి సహజముగఁ దప్తహృదయుఁడై, తోడనే నుదిరిగివె, తిరోహితుఁ డాయెను. ఆంగ్లరా జావంకఁ దిలకింపుచు నిట్టులనెను.—

"దిన మెచ్చటఁ గానరాని మిణుఁగురుఁ బురుగు నిశీథమున దీపించును. ఇట్టి ఖద్యోతపౌరుషము నాపతాకమును భంగపుచ్చనగును. పతాకసింహము దివమందు వీక్షణమాత్రముననే స్వీయరక్షణ మొనరించుకొనఁజాలు. ఓయీ, లోయా! నీ వీరేయి యాంగ్లదేశగౌరవలాంఛనము గనిపట్టి యుండుము."

అంత నాంగ్లప్రభు విట్టులనెను.—"రాజా! ఆంగ్లదేశగౌరవసంరక్షణము నాకెంతయుఁ బ్రీతికరము. కాని, ఆంగ్లనృపాల ప్రాణమే యాంగ్లదేశ గౌరవము. కావున నొక్కక్షణమైన నిటఁ గడయక మాతేనిఁ దనశిబిరమునకుఁ జేర్పవలయు."

రిచర్డు మందహాసమొనరించి యిట్టులనెను.—

"లోయా! నీవు ధూర్తధాత్రివిసుమా! ఓయీ, స్కాచిశూరుఁడా!

ఒక వరము నీకు బ్రసాదింపవలసి యుండె. మంచిసమయ మరుదెం చెను. ఆంగ్లపతాక మియ్యదె! త్రిశూలమాత్ర దూరము దాటకుండ రేయెల్ల నీవీ తావునఁ గాపుండి, ఈప్రసిద్ధ కేతనమున కణుమాత్ర మగౌరవము తగులకుండ రక్షింపవలయు. ముష్కరికంటె నెక్కుడు ముచ్చులువచ్చి పైఁబడుదురేని, సాహాయ్యార్థ మీలవేయుము. శూరుఁడా! ఏమందువు?"

"మహారాజా! నాప్రాణమొడ్డి యీకార్యము నిర్వర్తింతును. సర్వాయుధములు దాల్చి యీక్షణమె యరుదెంచు వాఁడను."

అనంతరము రిచర్డు ఫిలిప్పులు పరస్పరము సముచితముగ సెలవు వడసి తమతమ విడిదెలకుఁ బోయిరి. తమ బాహ్యావర్తన మెంతయు బాగుగనున్నను, ఆరాజహృదయములు గ్రాఁగి యుండెను. తానాస్ట్రియా భూనేతతోఁ గలహించుతఱి గ్రెంచినృపాలుఁ డరుదెంచుట యసంగతమని రిచర్డు తలంచెను. అసంబద్ధముగఁ దమలోఁ దాము కలహించు నా నాయకులకుఁ దాను సఖ్యమొడగూర్పఁ బ్రయత్నింప, నాంగ్లజేఁడు దుస్సహాధూర్తాలాపములఁ దన్నవమానించెనని ఫ్రెంచి రాజు కనలెను. ఆ యాకస్మిక కోలాహలము వలన మూఁగిన జనులు విచ్చిపోయిరి. జార్జిసబ్బ మెప్పటియట్లు నిర్మానుష్యమాయెను. ప్రజలు తమతమ నైజములచొప్పున నావిషయము విమర్శింపఁ దొడగిరి. ఆస్ట్రియనులే కలహకారకులని ఆంగ్లేయులు నిందించిరి. ఇతర జాతుల వారందఱు గలసి యీ గంద్రగోళ మాంగ్లజేని దురహంకార ఫలమని ఏకముగ నిరసించిరి.

అంత నొకచక్కి నక్కియున్న కాన్రేడు తనమిత్రుఁడగు నమారీతో నిట్టులనెను.—"చూచితివా! మాయోపాయము సుళువుగ నెంత యొనరించెనో! తీవ్రాచరణముకంటె నియ్యదె వాంఛనీయము. వివిధక్రైస్తవరాజన్యుల నొక్కటిగ బంధించిన పాశము సడలించితి—

ఇఁక నీసంఘువిచ్ఛిత్తి గాంతువుగాక."

సన్యాసి శూరనాయకుఁడగు అమారీ యిట్లు బదులాడెను.—
"నీవుచెప్పిన పాశము ఛేదింపఁజాలు నాస్త్రియాయోధుఁ డొక్కఁ డుండెనేని, అట్టి సాహసికుఁ డొక్కఁడుండెనేని, నీయుపాయము నిక్కముగ శ్లాఘాపాత్రమై యుండెడిది. మిత్రమా! వీడినముడి మగుడ బిగియవచ్చును: పాశము ఛిన్నమగునేని, అట్టి యవకాశము లేకుండుఁ గదా!"

౧౨

శౌర్యగుణప్రధానమగు నాకాలమున నపాయకరకృత్య మొనరించుట శ్రేష్ఠతమమై యుండెను. యుద్ధాదియోధరంగములఁ బేరు గాంచు శూరులనే నృపాలు రపాయకరకార్యము లొనరించుటకు నియోగించు చుండిరి. శూరు లట్టికార్యము మహాద్భాగ్యముగఁ బరిగణింపు చుండిరి. దుర్గమోన్నతతలం బారోహించు పాంథుఁ డంతకంతకు గష్టతరమగు కంటకమయ పరుషశిలాగ్రములు గడచి గడచి గమ్యస్థానము జేరు తెఱఁగున శూరుఁడు నిరంతర ప్రవర్ధమాన కష్టతర కార్యము లొనరించి లోకప్రసిద్ధి గాంచఁ గోరుచుండెను. స్కాచి శూరుఁడగు కణతుఁ డట్టివాఁడు.

అర్ధరాత్రమాయెను. రిచర్డ్నృపాలుఁడు తన ధూర్తప్రవర్తనమున సహస్రవైరులను గల్పించుకొనెను. వారివలన నాంగ్ల లాంఛనము భంగపడకుండ రక్షించుటకు స్కాచిశూరుఁ డేకాకియై యప్రమత్తుఁడై యా దిబ్బమీఁదఁ గాపుండెను. నిర్మలాకాశమధ్యమునఁ జంద్రుఁడు రాజిల్లుచుండెను. శూరుఁడు నిజమనోభవాలోచనానిమగ్నుఁడాయెను.

అగణిత శౌర్యోదార విరాజమానుఁడై బహుళశూరజన పరివృతుఁడై యొప్పు నాంగ్ల భూపాలుఁ డాంగ్ల దేశ గౌరవసంరక్షణార్థము దను నియోగించుట కణతునకుఁ జాల ప్రీతికరముగ నుండెను. తత్కార్య మపాయభూయిష్ఠము. కాని శూరుఁడగు కణతున కెట్టి యపాయ మైనను స్ఫురింపకుండెను. ప్రణయావేశమాధీనుని ధీరతరకార్యము లకుఁ బురికొల్పుచుండెను. సామాన్యశూరునివలెఁ దోఁచు నా స్కాచి జనునకుఁ బ్రణయసిద్ధి కలుగుట యసంబద్ధముగ కేవల మసంభవ ముగఁ గాన్పించెను. ఐనను నూతన సంఘటనలుమాత్ర మనుకూల ముగ నగపడుచుండెను. రిచర్డు రాజ సోదరియగు మేరీకిని తనకునుగల యంతర మొకింత యంతరించినట్లు లుండెను. తా నొక సామాన్య శూరునివలె స్కాట్లండు దేశమునుండి యరుదెంచి సాహసకృత్యము లొనరించి ఆంగ్ల రాజహృదయమును తత్సోదరీహృదయమునుగూడ నాకర్షింపఁజాలెను. అట్టి ప్రాముఖ్యము గాంచిన తాను నికృష్టమరణ మునకుఁ బాల్పడుట యసంబద్ధము. ఆంగ్ల రాజపతాకమును నిశాసమ యమున తా నసహాయుఁడై రక్షింపఁబూనుట కడుంగడు నపాయ కరము. ఆస్ట్రియాన్నృపాలుఁడు ఆంగ్ల రాజవిరోధి యగుట తథ్యము గదా. ఇంకను ఎందఱో వైరు లుందురు. ఆంగ్ల దేశ గౌరవలాంఛన రక్షణ మొనరింపుచుఁ దాను మరణింపవచ్చును. మరణించిననేమి— రిచర్డుభూపాలుఁడు సంతసించి వైరిజనహృదయవిదళన మొనరింపఁ బ్రతిన దాల్చునట్లు—తద్రాణివాసము విలాపించునట్లు పదుగురను బరిమార్పవలయును.

స్కాచిశూరుని హృదయమున నట్టి భావములు పరుగిడుచుండెను. పేరుప్రతిష్ఠలు లేని యనాథునివలె నికృష్టమరణమునకుఁ బాల్పడను గదా యను సంతస మాతని సహజ ధైర్యోత్సాహములను దశాధిక మొనరించెను. ప్రకృతిప్రశాంతచంద్రకాంతిమయమై గాఢచ్ఛాయా

కలితమై నిద్రాధీనమైనటు లుండెను. బాఱులు తీర్చిన సైనిక నిలయము లన్నియు నిర్మానుష్యవీధులవలె నిశ్శబ్దముగ నుండెను. కణతుని ప్రసిద్ధశ్వానము పతాకస్తంభసామీప్యముననుండి, తన స్వామికార్య మెఱింగినదానివలె నప్పుడప్పు డట్టు జాపి జెండాముడు తలు గాంచుచు, రక్షకజనధ్వానములతోఁబాటు తానును మొఱుఁ గుచుఁ దన ప్రభునకుఁ దోడ్పడుచుండెను. అపాయము దవ్వున నుండ గనే పసిపట్టి హెచ్చరింపఁజాలునని యెంచి ఆశూరుఁడు తన జాగిల మునుగూడఁ గొనివచ్చెను. రక్షక జనోచితముగ నాతఁ డటునిటుఁ దిరుగునప్పు డా సహచరము తననుగుణముగఁ దన భూరిశిరము నట్టిట్టు ద్రిప్పుచుండెను. కణతుఁ డొకప్పుడు నిలిచి తన శూలమునాని ఆక సము గాంచుచు తదవసరభావాలోచనాపరుఁడై మఱచియుండునేని కుక్క తటాలున లేచి ఆతని డాసి హస్తమునఁ దన మోర బెట్టి ముద్దు గుడిచి యీ వెరవున నాతనిఁ గృతస్మారకు నొనరించు చుండెను.

జాగ్దిబ్బపైఁ గాపున్న స్కాచిశూరుఁ డట్లు రెండు గంటలు గడ పెను. అంతయు బాగుగనే యుండెను. అప్పుడప్పుడు హెచ్చరించు కావలివారల సంగడులు వినా, ప్రదేశ మంతయు ప్రశాంతముగ నుండెను. జాగిల మంత నాకస్మికముగ లేఁగి తీవ్రముగ మొఱిఁగి విరోధిదర్శనావసర క్రోధావేశమున హుంకరించి ముం దుఱుకఁబోయి ప్రభు నాజ్ఞకై తత్తరపడఁజొచ్చెను. నీడయం దేమియో ప్రాకుటఁ గాంచి యెవ్వరని కణతుఁడు కఠినముగఁ బ్రశ్నించెను. అంత నొక స్వరము కడు నసహ్యాకరముగ నిట్లు వెలువడెను—

* "ఆర్తరురాజశేఖరశూరులపైనాన! నీ నాలుగు పాదముల రక్క సిని గట్టివేయుము. కానిచో రాను."

---

* "ఆర్తరు"—దైనసమానుఁడగు నాంగ్లరాజు

"నా స్థానము సమీపింప సాహసించువాఁడవు నీ వెవ్వఁడవు ?" చిత్రకలాంఛనుఁ డట్లు ప్రశ్నించి కండ్లు చికిలించి ఆ యగోచరవ్యక్తిని గాంచఁ గడఁగెను—"మరణము లెక్క సేయక పోరాడువీరుఁడసుమా ! భద్రము!"

శూరుఁ డట్లు గర్జింప నావ్యక్తి యిట్లు బదులాడెను—"ముందు నీ దీర్ఘదంష్ట్రిమృగమును బట్టియుంచుము. లేదేని నా బాణమున నొక్క వ్రేటున బుద్ధి సెప్పెదను."

ఆ సమయమున ధనస్సు వంచిన సవ్వడి ఆయెను. శూరుఁ డిట్టు లనెను—"నీ వెవ్వఁడవో యసంబద్ధముగ జల్పింపక వెన్నెలలోనికి రమ్ము. ఆలసింతు వేని మదీయ శూలఘాతమునఁ జత్తువు."

కణతుఁడు బల్లెము దాల్చి యంధకారమున నొకింత కాన్పించు నా వ్యక్తిని గుఱిచూచి విసరఁబోయెను. అంత నావ్యక్తి రయమ్మునఁ జీఁకటినుండి వెలువడెను. శూరుఁడు చిన్నవోయెను. ఏమన, ఏతెంచిన వాఁడు యోధుఁడు కాఁడు, బలవంతుఁడు కాఁడు, సామాన్యమానవుఁడైనను గాఁడు. చిత్రకలాంఛనుఁడు తొల్లి ఎంగాడీ మాలయమున నిశీథమున నేకాకియై వేచియుండిన సమయమున భూగర్భమునుండి వెలువడిన వక్రహ్రస్వాంగుఁడే ఈసమయమునఁ గూడఁ దోఁచెను ! వాఁడు 'నకటబను' నామధేయుఁడని పాఠకు లెఱింగియే యుందురు. వానినిఁ గాంచినంతనే, తత్సమయ విషయము లెన్నియో తలంపునకు వచ్చెను.

తన స్వామి యొనరించిన సన్నగాంచిన శ్వానమున కుత్సాహ భంగమాయెను. ఆ కారణమున నా భయంకరవైరి మూల్గుచు వెనుదిరుగ, హ్రస్వాంగుఁడు భయ ముడిగి దిబ్బ నెగఁబ్రాఁకి మెట్టకేలకు శూరుని సమీపించి, తా నొక ఘనునివలె గాంభీర్యము ధరించి, సగౌరవముగఁ దన హస్త మందీయఁబోయెను. కాని, కణతుఁడు

తత్కరస్పర్శన మొనరింపఁ గోల్లక యున్నకుంటుటచేత, నా వికృతాకారుఁడు కనలి, తీక్ష్ణముగ నిట్టు లనెను—"సైనికా! నకటబను మహనీయునకు సముచితస్వాగత మీయవేమి? లేక, మమ్ము మఱచితివా?"

కణతుఁ డిట్లు సరసముగ బదులాడెను—

"మహనీయా! నిన్నుఁ గాంచి మఱచుట యసాధ్యము. కాని, నే నీస్థానము గాచియుండు సైనికుఁడఁ గదా. నీవంటి పరాక్రమవంతులను జేరనిచ్చుట యపాయకరము; కావున, దవ్వుననుండి యప్రమత్తుఁడనై మాటాడవలయు. నీవు తప్పక గౌరవనీయుఁడవు. ఏమి కోరెదు?"

"నన్ను నీకడ కంపిన వారికడకు నీవు రావలయు."

"మహాపురుషా! నీకోరిక చెల్లింపఁజాల. సూర్యోదయపర్యంతము నే నీ పతాకను గనిపట్టి యిచ్చటనే యుండవలయును. ఇది రాజాజ్ఞ. క్షమింపుము."

శూరుఁ డట్లు పలికి వెనుదిరిగి జెండాచెంతకుఁ బోవుచుండెను. కాని, నకటబనుఁ డాతని పోఁ గోల్లక, అడ్డు నిలిచి, మఱల నిట్టు లనెను—

"శూరుఁడా! నామాట జవదాటెదు గదా,—కానిమ్ము. ఏకాంతామణి నిజసౌందర్యాతిశయముచే నధోలోకపిశాచములఁ బిల్వఁజాలునో, ఏ నారీరత్నము నిజవైభవాతిశయమున నాయము పలనైన శాసింపఁజాలునో, యామె పేరు దలంచి నిన్నాజ్ఞాపించువాఁడ! వచ్చెదవా?"

శూరుని చిత్తమున నొక యపూర్వాలోచన ఉదయించెను. అది యసంభవమని యతఁ డాతలంపు దొలంగించెను. తన ప్రియకాంత యట్టి వికృతాకారునిచే సందేశ మంపునా? అసంభవము—ఐనను,

కంపితస్వరమున నాతఁ డిట్లు లనెను—"ఓయీ! నిక్కము వచింపుము. నాఁటి రేయి ఎంగాడీ యాలయమున నీకు భాసటయై నీవలెఁ జీఁపురు దాల్చి భూసంస్కార మొనరింపఁబోయిన రాణియే యగునా—ఈ కాంత?

నకటబను సక్రోధముగ నిట్టు లనెను—

"ధూర్తశూరుఁడా! ఏమి నీ యాగడము! మారాణి హీనమతియై నినుఁ బోలువానికి సందేశ మంపునా? నీ వెంతటి ఖ్యాతిగాంచినను, అంతటి గౌరవమున కనర్హుఁడవు. నీవే కాదు—తద్రాజ్ఞీభర్తయగు రాజపుంగవుండు దక్క ఇతర నృపాలురును దృణప్రాయులు సుమా. శూరుఁడా! ఈ చిహ్నము గాంచుము. ఈలాంఛన మెఱింగి తదాజ్ఞానువర్తివై యరుదెంతువో, లేక, ఎఱుంగఁజాలక రా నిరాకరింతువో—నీ యిష్టము."

ఆ వింతదూత యట్లు పల్కుచు, వెన్నెలయందుఁ గూడ మెఱయు మాణిక్యపుటుంగరము నొసఁగెను. ఆ యంగుళీయ మా నారీరత్నము తాల్చునదే యని శూరుఁడు తత్క్షణము గుర్తించి విభ్రాంతచిత్తుఁ డాయెను. అనుమానమున కవకాశము లేకుండెను. అట్టి పరమపవిత్ర లాంఛన మట్టి చేతులం బడుటచేత విస్మయ మొంది, కణతుఁ డిట్లు ప్రశ్నించెను—"ఓయీ! నీ కీయుంగర మెవ రిచ్చిరి? పరిభ్రమించు చిత్తము నొక్కింత చేరదీసి, ని న్నెవ్వ రంపిరో తెల్పుము. కారణ మేమి? హాస్యమున కిది సమయము కాదు సుమా—నిక్క మెఱిఁగింపుము."

"శూరుఁడా! నీవు మందబుద్ధివి సుమా! ఆజ్ఞ సేయునది రాచకన్నియ, ఆమె యాజ్ఞ దెచ్చువాఁ డొకరాజు. చాలదా? కొఱమాటలాడుచుఁ గాలహరణ మొనరింప నొల్లను. ఆజ్ఞాబద్ధుఁడవై ఈ యుంగర మొసంగిన నారీమణిచెంత కరుదెంతువా? ఒక్కనిమిష మాల

సించుట ద్రోహము సుమా."

"ఓయి మహనీయా! నీవు చాల మంచివాఁడవు. తీవ్రపడకుము. ఈరేయి నే నెట్టి కార్యభారము వహించియుంటినో నా హృదయ కాంత యెఱుంగునా? నాప్రాణము—ఛీ! నాప్రాణ మొక లెక్క కాదు—నాగౌరవ మంతయు నీ కార్యనిర్వహణముపై నాధారపడి యున్నది. దిన ముదయించువఱకు నే నీతావు వీడరాదు. ఇట్టి మహత్తరకార్యము గూడ వీడి తనచెంతకు రావలయునని ఆ కాంతామణి కోరునా? అసంభవము. రాజపుత్రి ఉత్సాహాతిశయమునఁ దన పాద సేవాపరాయణున కిట్టి సందేశ మంపియుండును. కావుననే, నీవంటి దూతను నియోగించెను."

తా నట నిలువఁజాలక వెడలువానివలె గిఱ్ఱున మఱలి, నకటబనుఁ డిట్టు లనెను:—

"నీ వట్టులే భావింతువుగాక. నీ వా రాచకన్నియయెడ విశ్వాస బద్ధుఁడవై చరింతువో, ద్రోహ మాచరింతువో—నా కేమి. నేఁ బోయెద!"

"మహనీయా! నిలు నిలు—నిన్నుఁ బ్రార్థింతును—పరుగెత్తక, ఒక్క ప్రశ్న కుత్తర మిమ్ము—నిన్నంపిన కాంతామణి యీసమీప మునసే యుండునా?"

"ఇట్టి ప్రశ్నయేడ? ఎంతదూర మరిగిన నంత రుసుము గైకొను కూలివానివలె దూరము గణించి ప్రశ్నించుట విశ్వాసి కనుచితము. సంశయాత్మా! ఐనను జెప్పెద వినుము. బేలవై, ధైర్యసత్వరహితుఁ డగు శూరు నాహ్వానించు రాచకన్నె మదీయశరమాత్ర దూరముననె యుండు."

కణతుఁ డంత నా రమణీయాంగుళీయము మఱల బరిశీలించి మగుడ నిట్లు ప్రశ్నించెను—"అట నే నెంతకాల ముండవలయు?"

"కాలమా! కాలమన నేమి?—ఛాయాపూర్వకనామవాచకము! కాలము నాకుఁ గానరాదు. అనుభవవేద్యమును గాదు. సూర్యుని ఛాయాగమనముబట్టి కాలము లెక్కింతురు. అయ్యది శూరునకుఁ జెల్లదు. దైవసేవాపరాయణుఁడై నిజహృదయకాంతా సేవాపరాయణుఁడై కడపునదే నిజమగు శూరునకుఁ గాలము"

"వీఁడు అల్పుఁడయ్యె, లెస్సగ నాడెను. ఓయీ! నాహృదయరాజ్ఞి నన్నే దేని కార్యమునకు నియోగించునా? కొలదికాలమున సూర్యోదయమగును—అంతవఱకుఁ దాళరాదా?"

కణతుఁడట్లు ప్రశ్నింప, నావికటదూత యిట్టులనెను.—"నీవు తత్క్షణము రావలయు. నీవు పుత్సాహరహితుఁడవు. అనుమానగ్రస్తుఁడవు. ఆమె యిట్టు లని నన్నంపెను.—గులాబులురాల్చిన హస్తము పుష్పమాలిక వేయజాలునని చెప్పుము.—ఇఁక నీయిష్టము."

రోజాపుష్పసమాచార మాలించినంతనే సహస్రాలోచనలు రేకెత్తెను. నాఁ డా దేవాలయమున నిజహృదయకాంతాహస్తముక్తములైన పుష్పములు వాడి యెండిపోయినను, నిరంతర మాతని హృదయసామీప్యముననే అడఁగి యుండెను. ఆహా! ఎంతటి భాగ్యము! స్వీయహృదయసింహాసనాసీనయైన కాంతామణి రమ్మని కబురంపెను! ఇట్టి యదృష్టము మఱియొకసారి లభించుట దుర్లభము. శూరుఁడట్టియాలోచనలో మునిగియుండ, నకటబనుఁ డిట్టులనెను.—"శూరుఁడా! ఏమందువు? వచ్చెదవా? నాయుంగరము నాకిచ్చెదవా?"—కణతుఁడు మఱియు గలవరమంది, "ఆగుమాగుము—ఒక్కనిమిషము!" అని పలికి, మగుడ నీపగిది చింతింపఁ దొడఁగెను.—"నేనీ పతాకము గాచి యుండవలయునని ఆంగ్లరా జాజ్ఞాపించెను. కాని, నేనాతని దేశస్థుఁడనా? సేవకుఁడనా? కాను. నేను స్వతంత్రశూరుఁడను—మతయుద్ధదీక్షాపరుఁడనై మాత్ర మరుదెంచినవాఁడను. ఈపవిత్రో

ద్యమమును నాప్రణయదేవతయు మాత్రము నాకు గణనీయములు"—

అంతలో నకటబనుఁడు మగుడఁ గలవరపడుచెను.—"ఉంగరము—ఉంగరమిమ్ము! నీవు మిథ్యాశూరుఁడవు—జడుఁడవు—అపవిత్ర లాంఛనము తాఁకుటకు—చూచుటకుఁ గూడ నర్హుఁడవు కావు—ఇచ్చివేయుము."

"ఒక్కక్షణమాగుము—మంచివాఁడవు—నాయూహాల కడ్డురాకుము—మహమ్మదీయు లొకవేళ నాకస్మికముగా మాశ్రేణులపైఁ బడినచో నేనేమి చేయవలెను? ఇంకను ఈపతాకము గనిపట్టియుందునా?—అసంబద్ధము. నేనాంగ్లేయుఁడను గాను—త్రిదాజసేవకుఁడఁగాను. కావున, మతయుద్ధదీక్షానుగుణముగఁ దత్క్షణముపాఱి వైరుల నుగుమాడుదును. దైవము తరువాత నాహృదయరాజ్ఞి నాకు గణనీయము. ఆమెయాజ్ఞ శిరసా వహింపవలయు. కాని రిచర్డున్నృపాల నియోగమో! ఈతావుపీడక ఈపతాకము రక్షింతునని యొడఁబడితినే!—ఓయీ, నకటబను! నన్ను దూరమునకుఁ గొంపోవుగదా?—నిజమాడుము."

"అల్లదె తళతళలాడు పటకుటీరము. దూరములేదు." దూత యట్లు బదులాడ శూరుఁడు మగుడ నిట్లు చింతించెను—

"ఒక్క నిమిషమునఁ దిరిగి రాఁగలను. ఒకవేళ నీలోపున నెవ్వఁడేని పతాకముచెంతకు రా సాహసించునేని నా జాగిలము మొఱుఁగును—ఆరవ మాలించి నేను తత్క్షణము రాఁగలను. నా హృదయరాజ్ఞిని సందర్శించి త త్కోమలచరణసాన్నిధ్యమున వ్రాలి, శీఘ్రముగ సెల వీయవలయునని బ్రతిమాలి రయమ్మున నరుదెంచి యీ పతాకరక్షణోద్యోగము ముగింతును."—అంత నాతఁడు తన జాగిలమును సంబోధించి జెండాకంబముచెంగటఁ దన వస్త్రము వైచి యిట్టులనెను—"మిత్రమా! ఈస్థలము పీడక అప్రమత్తతతోఁ గాపుండ

వలయు.”

ఆ మహాశ్వానము స్వామిభావము గ్రహించినదానివలె మో మెత్తి పరికించి చెవులు నిగిడించి శిరము గంభీరముగ నెత్తి రక్షక భటోచితముగ నటఁ గూర్చుండెను.

పతాకము వీడి యరుగుట పాడికాదని చిత్త మొకవంక యను చున్నను, కాంతాకర్షణమునఁ గదనుగుణముగ వితర్కించుకొని ఆంగ్ల దేశ గౌరవలాంఛనరక్షణభారము తన కుక్కపై నిడి యాతఁడు గమనాతురుఁడై వక్రాంగునితోడ నిట్లు లనెను—“ సన్మిత్రమా! వడివడి పోదము రమ్ము!”

“వడివడి నీవే పొమ్ము;—ఇంతకాలము నీకొఱకు వేచియుండ నిపుడు వడివడి రావలయునే? మఱియు, నేను హ్రస్వశరీరుఁడ— నీవంటి దీర్ఘపాదునితో సరిగా నడుచుట యసాధ్యము. అసలు నీవు మానవునివలె నడుతువా?—ఉష్ట్రపక్షివలె దాట్లు వేయుదువు.”

అపూర్వకాంతాసందర్శన మొకవంకను, పతాకసంరక్షణ మొక వంకను శూరునిఁ దీవ్రముగఁ ద్వరపెట్టుచుండెను. సహజముగ మంద గామియగు నకటబనుఁడు మఱింత మెల్లగ నడవఁదొడఁగెను. వానికి లంచ మొసఁగి శీఘ్రతరముగ నడిపించుటకుఁ గణతునివద్ద ధనములేదు. బ్రతిమాలుటకు వ్యవధిలేదు. కావున శూరుఁడొక సూక్ష్మోపాయము యోచించెను. చిన్న బాలకునివలె వానిని భుజమున నిడికొని, భయా గ్రహావిహ్వలుఁడై వాఁడు వలదు వలదని యఱచుచున్నను, లెక్క సేయక కణతుఁడు ద్విగుణీకృతగమనమునఁ బోయెను. రాణివాసము సమీపించినటు లుండెను. గుడారము లనేకము లుండెను. అక్క డక్కడ రక్షకభటులుగూడ నుండిరి. తన కవచము చప్పుడు కావలి వాం డ్రాలింపకుండుట గాంచి విస్మయ మంది అట్టి తావునఁ దన యనుచరుఁడు త్రోవ సూపుటయే క్షేమకరమని యెంచి వాని నాతఁడు

నేలకు దింపెను. క్రోధావమానములచే నా వికటరాజహృదయము మండిపోయెను. ఐనను ఆ మహాబలశాలి నేమియు ననఁజాలక వాఁడు సహించి యూరకుండెను.

అల్లిబిల్లిగ నుండు గుడారములు పెక్కులు దాటి వా రొక పట మందిరము డాసిరి. భటు లేమరియుండుట మేలాయెను. ఐనను వా రామందిరపరోక్షమునకుఁ బోయిరి. నకటబనుఁ డంత గుడారము క్రింది తెర కొంచె మెత్తి, కణతుఁడు ప్రాఁకి యందుఁ బ్రవేశింపవలయు నని యాతనికిఁ దెల్పెను. ఆహా! ఉదాత్తచిత్తుఁడగు శూరుఁ డట్టి యకార్య మెటు లాచరించును? అయ్యది యత్యున్నత వనితాజనా వాస మగుట తెల్లము. కాని తన హృదయాధిదేవత యాజ్ఞాపించు నపుడు తా నేలసంశయింపవలయునని తర్కించుకొని చిత్రకలాంఛనుఁ డల్లన భూమిపై ప్రాలి లోనికి బోయెను. వక్రాంగుఁ డిట్లు గుసగుస లాడెను.

"నేఁ జీరువఱకు నచటనే యుందుము."

## ౧౩

కణతుఁడు నిలిచిన తా వంధకారమయము. తత్క్షణము తన హృదయ రాజ్ఞినిఁ గాంచి ఆ యుత్తరక్షణము పతాకముచెంతకుఁ బోవలయు నని త త్తరపడుచు నాతఁ డరుదెంచెను. ఆహా! ఆతఁ డాయంధకార మున నెంతకాల ముండవలయు? క్షణ మొక యుగమువలె నుండెను. వీడరాని పతాకము తా నంత సులభముగా వీడితినని యాతఁ డొకింత ఖేదపడెను. కాని ఆ కాంతారత్నమును సందర్శింపకుండ మఱలుట యసంభవము. సైనికుఁడు తన స్థానము వీడుట దోషమె. కాని తను

నట్టి దోషమునకుఁ బాల్పడఁజేసిన యబలామణిని గాంచియే పోవలయు. కణతుఁ డట్టు లూహావిహార మొనరించుటకు వీలులేదు. మేరీకాంత ఆంగ్లరాణీసామీప్యమున నుండును. తా నేతెంచినది ఆంగ్లరాజ్ఞీనిలయము కావలయు. రాజాంతఃపుర మావిధమున ముచ్చువలెఁ జొరబడుట ఎంత దోషావహము! ఎంత ప్రమాదకరము! వెల్లడి యగునేని ఎట్టి యనుమానమునకు వీలౌగవును! ఎంత యపాయకరముగఁ బరిణమించును! కణతుఁ డట్టి యాలోచనలచేఁ గ్రాఁగుచుండ కాంతాజనుల హాసధ్వనులు గుసగుసలును వినఁబడెను. ఆ నారతెర కవ్వలనే వా రుండవలయు. దీపపుఁగాంతియును ఛాయలునుగూడఁ గాన్పించుచుండెను. అంత చేరువగ నుండిన శూరుఁడు పటాభ్యంతర వనితాజనసంభాషణగూడ నాలింపవలసినవాఁ డాయెను. ఒక కాంత నవ్వుచు నిట్టు లనెను—

“ఆమెను సత్వరము రమ్మనుము. నకటబను! దూతకృత్యము చక్కఁగ సాగించితివి.”

సహజకఠోరస్వరమున నా వక్రదేహుఁ డేమియో పల్కెను కాని కణతుఁడు వినఁజాలకపోయెను. ఐనను అచటి కావలివాండ్రనునవ్వించి వాఁ డవ్వలకు బోయినటు లాయెను. తొల్లిటి కాంతామణి మగుడ నిట్టు లనెను—

“చెలులారా! ఈ నకటబనుఁ డొక దయ్యము నావహించెను. వదలుట యెట్లు?”

అంత నొకపరిచారిక యిట్లు బదులాడెను—“దేవీ! చిత్తగింపుము. రాజాంశభవుఁ డగు నకటబను మహనీయుఁడే తోడ్పడవలయు. ఆ మహనీయుఁ డుదారమనస్కుఁడై మాత్సర్యరహితుఁడై తన రాణి నంపినచో, నా యుజ్జ్వలాంగి ఆ ధూర్తశూరుని బుజ్జగించి తరలింపఁ గలదు. తన యంతర మరయక రాజాంతఃపుర కామినీజనులను డాయ

సాహసించుచు మూర్ఖు నిట్టులే సేయవలయు.”

“ఔను. నకటబను తెచ్చినవాని నాతని రాణియే సాగనంప వలయు” నని మఱియొకతె యనెను.

అట్టిమాట లాలింపవలసిన కణతుఁడు దుర్భరావమానభారమునఁ గ్రుంగిపోయెను. ఆగ్రహానలముచే నాతని హృదయము భగ్గున మండి పోయెను. ఏమైననుసరె తత్క్షణ మాతావు వీడవలయునని కణతుఁడు నిశ్చయింప నీ పలుకులు వీనుల బడెను—

“చెలులారా! ఈ మనుజుని ప్రవర్తనము మేరీకాంత యెఱుంగ వలయు. ఈతఁడు తన విధ్యుక్తధర్మము మఱచి యరుదెంచెనని రాజసోదరి ప్రత్యక్షముగ నెఱుంగుఁగాక. ఓసీ, కలశా! మా నెచ్చెలి వివేకరహితయై యీతని నధికతరాదరభావమునఁ జూచునని యనుమానింతు సుమా. ఇఁక నామె వివేకముతోఁ జరింపఁగలదు.”

అంత నొక కాంత మెల్లగ నేమియోపలుక వారిని శాసించు నారీరత్నము వాడిగ నిట్టు లనెను—

“వివేకమా! గర్వమని చెప్పుము. మా యందఱకంటెఁ దానే నిశ్చలమతియై చరించునటు లామె మెలంగును. ఇపు డామెకు శృంగభంగము కాఁగలదు. నే నీయవకాశము బోనీయను. మాయందఱు మాత్రలోప ముండునేని మేరీ తత్క్షణము గనిపట్టి కడునిపుణముగ— ఎదురాడుటకు వీలు లేకుండ వెల్లడి చేయును. ఇదిగో—మాటలో నరుదెంచెను.”

ఆసమయమున నెవ్వరో యరుదెంచి యల్లన వారిలోఁ గలసినట్లు స్కాచిశూరునకు ఛాయాగమన పరిశీలనమునఁ దెలిసెను. తన్మందిరాంతర ప్రధానవ్యక్తి ఆంగ్లరాణియే యని పాఠకులు గ్రహించియుందురు. దుర్భరావమానబాధితుఁడయ్యు, ఆంగ్లరాజ్ఞీ వాగ్శరపీడితుఁడయ్యు శూరుఁ డాతావు వీడఁజాలకపోయెను. తన హృదయాధిదేవత

యగు మేరీకన్య ఈమోస మెఱుంగదని పై సంభాషణవలన స్పష్ట మాయెను. దాన నాతని చిత్తము నేదదేఱెను. అంతలోఁ దన యిష్ట దేవతయే ప్రవేశించెను. ఆమె వాక్సుధారసము చవిగాంచకుండ, ఆతఁ డెట్లు పోఁగలఁడు? ఆగ్రహావేశమున నాతఁడు వెడలిపోయిన భాగుం డెడిది. కాని, రాజ్ఞీమేరీల సంభాషణ యెటు లుండునో యాలింప వలయునని కణతుఁడు మిక్కిలి కుతూహలపడెను. ఆలించుటయేగాదు, తెర కొక చిన్నరంధ్ర ముండెనేని, వారినిఁ గాంచనలయునని కూడ నాతఁడు తత్తరపడెను.

రాజ్ఞి యాజ్ఞకొఱకు మేరీ నిరీక్షించుచుండినటు లుండెను. తానును తన పరిచారికలును అనుచితముగ నవ్వెదమేమొ యని ఆంగ్లరాణి మిన్నకుండినటు లుండెను. అడంచినను అడంగని హాసధ్వని మంద ముగఁ గణతుని వీనులఁ బడెను. మేరీ యిట్లు లనెను—

"దేవీ! ఈ నిశీథసమయమునఁ గూడ నింత యుల్లాసముగ నుం టివి. నీయాజ్ఞ యగుటచే నరుదెంచితి; లేదేని, నిద్రించియుండుదును."

"సోదరీ! హాయిగ నిద్రింతువుగాక—విశేషకాల ముంచనులే. కాని, నీ వోడిపోతివని తెలిసికొని యిఁక నిద్రాసౌఖ్య మనుభవింపఁ జాలవేమోయని భయపడుదును సుమా."

"దేవీ! ఇట్టి పరిహాసము చాల నీరసమాయెను. కాని, పందెము వేసినది నేఁ గాదు. ఐనను, ఆదూఱు నాపై వేయుదువు. ఇది నీ విలాసము."

"సోదరీ! మనము చేసినది పవిత్రయాత్రయే యైనను, అన్యతా లాపము వీడకుంటివి. ఆ ఛిత్రలాంఛనుఁడో—మఱి యెవ్వఁడోగాని— తన స్థానము వీడువాఁడు కాఁడని, వీడినచో నీదు మాణిక్యాంగు ళీయము గోల్పోదునని పందెము వేయలేదా? వాఁడు స్థిరముగ నుండు నేని, నా సువర్ణకంకణ మోడుదునంటిని."

"రాజపత్నీ! నీమాట కెదురాడరాదు. ఐనను, ఈ చెలికత్తెలు గూడ నుండిరిగదా. నీవే పందెమునకుఁ బురికొల్పి, కన్యాత్వగౌరవ భంగకరమగు పనిసేయరాదని నేను వారింపఁ గడఁగినను లెక్కసేయక, నా వ్రేలియుంగరము దీసికొంటివి."

అంత నొక కాంత యిట్టు లనెను—

"రాజసోదరీ! చిత్తగింపుము. చిత్రకలాంఛనుఁ డతిధీరుఁడని నీ వంటివిగదా."

మేరీ సక్రోధముగ నిట్లు బదులాడెను—

"అన్న నేమి? ఆమాట పురస్కరించుకొని దేవితో నిచ్చకము లాడుదువా? ఆశూరుని గాంచిన జను లెల్ల రేమందురో నేఁ గూడ నట్టులే యంటిని. అంతకంటె నెక్కుడు నే నేల నుతింపవలయు? నీవేల యధిక్షేపింపవలయు? సైనికజనమధ్యస్థలగు కాంతలు శూరులను శూరకార్యములను దలంపక మఱి యేమి తలంతురు?"

మేరీరాచకన్నియ యట్లు నిష్ఠురముగఁ బలుక, మఱియొకతె యిట్టు లనెను—"దేవీ! నాఁడా ఎంగాడీయాలయమున నీ కన్యారత్న మాశూరుని చెంగట గులాబీపుష్పముకుళములు వైచెనని నీతోఁ జెప్పితిమని మాపైఁ గడుఁ గినిసియున్నది."

అంత మేరీకన్య యాగ్రహాకంపితస్వరమున నిట్టు లనెను—"దేవీ! త్వదీయపరిచారికా పరిహాసముల పాలుసేయుటకే నన్ను రప్పించితి వేని, నా కిఁక సెలవిమ్ము."

"పరసా! చనవుగలదుగదా యని, నీయంతరము మఱచి, రాజ సోదరి నెక్కసక్కెము లాడకుము—" రాజపత్ని యా తెఱంగునఁ దన దాసిని మందలించి, మేరీని గాంచి యథా నిందాగర్భితస్వరమున నిట్టు లనెను—"చెలీ! చాలదినములు కఠినప్రాయశ్చిత్త మొనరించి ఖిసిగియుంటిమిగదా. మాబోఁటి హతభాగ్యల కీపాటి యానందము

వలదా ?"

"రాజకాంతా ! నీ వమితానందమున నోలలాడెదుగాక. నేను మాత్ర మిఁక నా జన్మాంతము మందహాసమునకు వెలియై యుండ—"

అట్లు పలుకు రాజసోదరి చిత్తము దుర్భరాందోళనాధీన మాయె నని కణతుఁడు గ్రహింపఁజాలెను. రాణి యిట్టు లనెను—

"మఱఁదలా ! ఆగ్రహింపకుము. ఇంతకును ఇప్పుడు చేసిన దోస గెద్ది ? తన స్థానమునఁ గాపుండిన తరుణశూరుఁడు తావువీడి యరుదెంచెను. అరుదెంచుట కాదు—చోరునివలె నేతెంచెను—తరలింప బడెను. ఒక సొగసులాడి నామ మాలించి యాతఁడు తన తావు వీడెను. ఇంతలో నాస్థానమునకు వచ్చు ప్రమాదము లేదుసుమా. కాని, నిజ మాడవలయు,—నకటబనుఁ డెంత ప్రయత్నించినను, నీదు నామా కర్ణశ్రవణమునఁ గాని యా శూరుఁడు తరలఁడాయెను."

"దైవమా !"—మేరీ భయభ్రాంత యాయెను—"హా ! దైవమా ! రాజపత్నీ ! ఏమంటివి ? నీకును నాకునుఁ గూడఁ గళంకము వొడము కార్యము సంభవమై యుండదుగద ? ఆహా ! వినోదమున కిట్టు లాడితిననుము. ఎంతచేలను ! నీ వకార్య మొనరించి యుందువని నేను దలంచుటయే యసంబద్ధము ! క్షమింపుము."

రాజసోదరి యట్లు పలికినంతనే ఆంగ్లరాణి యానంద మంతరించెను. తదుచితస్వరమున నామె యిట్టు లనెను—"పందెమొడ్డిన యుంగరము పోయెఁగదా యని మేరీకాంత ఖిన్నురాలై యుండును. చెలీ! నీ యంగుళీయము నీ కొసంగెదనులే. కాని, మా కీపాటి విజయము తగదా ?"

"విజయమా !"—క్రోధకంపితస్వరమ్మున మేరీ యిట్టు లనెను—"విజయమా ! క్రైస్తవజనకంటకుఁ డగు మ్లేచ్ఛునకు విజయమనుము. ప్రచండాంగ్లరాజసన్నిహితబాంధవి యపయశోమగ్న యగుట నీ కేటి

విజయము ?"

"సోదరీ! ఉంగరము పోవునని కుపితవైతివి. పందెమొడ్డి, ఓటువడి, యిపు డుడుకుచుంటివి గాన, నీవు మగుడఁ బరిగ్రహింతువుగాక. కాని, నీ వొక విషయ మెఱుంగవలయు: త్వదీయనామచిహ్నములచే నాశూరుఁ డిటు దరలింపఁబడెను. మత్స్యము జిక్కెఁగదా—ఎరతో మా కింకఁ బనిలేదు."

అంత నమితమగు విసువున మేరీ యిట్టు లనెను—"దేవీ! ఒక్క యుంగరమే గాదు, మదధీనవస్తువు లన్నియు నీయవిగదా. పుట్టెడు మాణిక్యపుటుంగరములు పోయిన నేమి? నాకతంబున నొక ధీరుఁడు తప్పిద మొనరింపవలసెనే! ఆహా! ఆ ధీరస్వాంతుఁ డవమానమునకుఁ బాలగును—అవమానమే గాదు, శిక్షకుఁ గూడఁ బాల్పడు!"

"ఇదియా నీ ఖేదకారణము! ఈశూరున కపాయము వొరయఁజాలదు. మదీయ వినోదకారణమున నొకని మరణింపనిచ్చుటకు నేనంత ప్రజ్ఞాహీనురాలనా? రిపుజనభయంకరులగు మహాశూరుల కఠిన హృదయము నీ వొక్కతవె శాసింపఁజాలుదువని భ్రమింపకుము. నృపాలుఁడు సింహబలుఁ డగుఁగాక. సింహహృదయము గూడ మాంసమయమే గాని శిలామయము కాదుగదా. సోదరీ! నీ యభిమానమునకుఁ బాత్రుఁడై రాజాజ్ఞ నుల్లంఘించిన యీ శూరున కపాయము వాటిల్లకుండునట్లు నృపాలు నొప్పింతునులే."

"ఆహా! రాజపత్నీ!—అట్టులాడు కన్నియ రాజ్ఞీ చరణారవిందములఁ బ్రోల వ్రాలెనని కణతుఁడు గ్రహింపఁజాలెను. ఆతని చిత్తమానసమయమున నెట్లు విపరీతముగఁ గలంగెనో చిత్రించు టసాధ్యము—

"రాజపత్నీ! ఆంగ్లనృపాలుని స్వభావ మెఱుంగక యిట్టు లాడుచుంటివి. అచిరకాలముక్రింద నీ వామహాపురుషుని భార్యవైతివి. నీ

కాతని చిత్తము దుర్గ్రాహ్యము. ప్రబలఝంఝామరుత్తునైనను వారింపనగుఁగాని, ఆగ్రహావేశుఁడగు రిచర్డునృపాలుని వారించుట యసాధ్యము. తప్పొనరించు సైనికు నెన్నఁడు క్షమింపఁడు. దేవీ ! నీకుఁ బుణ్యముండు—ఆ శూరు నిటు మఱలించితివేని తత్క్షణము సాగనంపుము. తన స్థానమున కాతఁడు వెడలునేని, ఈ యవమానము భరించుటకు సంసిద్ధురాలను."

"లెమ్ము—సోదరీ! లెమ్ము. అనుచితాందోళనము వీడి నిశ్చలముగ నుండుము. లెమ్ము! నీ కింతటి యభిమానముగల శూరుఁడని యెఱుఁగక వినోదార్థ మిటు లాచరించితి—వలదు—దుఃఖవివశవై కరపీడన మొనరింపకుము—నీ కాతనియెడఁ గూర్మి లేదందులేని విశ్వసింతునులే—నీ వేమన్నను విశ్వసింతు—నీ నికృష్టదైన్యము మాత్రము వీడుము—ఈ బాధ్యత నేనె వహింతును—రాజసన్నిధి కేగి నీ మనోహరమిత్రున కపాయము రాకుండ—మిత్రుఁ డనుట నీవు సహింపవేని, పరిచితుఁడని యందును—నీ పరిచితున కెట్టికీడును వాటిల్లకుండ చేతును. ఇఁక జురచుర జూడకుము. స్కాచిశూరుఁ డెద్దియో యొక గుడారమునందుండు—మన నకటబనుఁ డీక్షణమ పోయి యాతని నంపివేయును. వృథాశ్రమపడిన ఈశూరుని మఱియొక తఱి సముచితముగ బహూకరింతును."

రాణి యట్లుపలుక, నకటబనుఁడు సంభ్రమంబున నిట్టులనెను—"మహారాణీ! ఆశూరుఁ డెక్కడనోగాదు ఈపటమందిరముననే ఈ తెరయవ్వలనే యున్నవాఁడు."

"ఏమి! మా మాటలెల్ల వినుచుండెగా!—ఓరీ!"—రాజ్ఞీమానసము తదవసరాత్యంత విస్మయాందోళనాధీనమాయెను—"ఓరీ, దుష్టకుటిలాత్మా!—తక్షణ మవ్వలకుఁ బొమ్ము."

తోడనే హ్రస్వాంగుఁడు కెవ్వున నఱచి పాఱుటఁ జూడ రాణి

నిజనిష్ఠురాలాపముననేగాక మఱియొకవిధమునఁగూడ వానిని మంద లించియుండునని స్ఫురించును. అనంతరము రిచర్డురాజుపత్ని సంభ్ర మాకులచిత్తయై నిజననందాశ్రవణమున "నిపు డేమిసేయవలయు"నని ప్రశ్నించెను. మేరీ నిశ్చలముగ నిట్టు లనెను—"అవశ్యాచరణీయ మెద్దియో యదిచేయవలయు. ఈశూరుఁ డుదారహృదయుఁడని విశ్వ సించి, యాతనిఁ గాంచవలయు."

అట్లుపలుకు రాజసోదరి ఆ రెండుగదులనడుమఁ దలుపువలె నమరి యున్న తెర యూతఁ గొను తీయఁదొడఁగెను.—"మేరీ—చెలీ! వలదు వలదు. ద్వారము తీయకుము—తీవ్రపడకుము—నాయభ్యంతరమంది రము—మన వస్త్రములు—నా గౌరవము—నలంపుము!— వలదు!—"

రాణి యూతీరున వారించుచున్నను, మేరీ యానిరోధవాక్యములు ముగియువఱకైన వేచియుండకపోయెను. మందిర మధ్యస్థద్వారము వివృతమాయెను. ఆపాదమస్తకము గవచము ధరించియున్న శూరుఁ డట గోచరమాయెను. రేయియగుటచేతను, ప్రదేశ మ్సుష్ణతర మగుట చేతను, ఆంగ్లరాణి మొదలగుకాంతలు అత్యల్పవస్త్రాచ్ఛాదన మొన రించియుండిరి. గౌరవనీయుఁడగు శూరుని కంటఁబడుట కడు నసం బద్ధముగ నుండెను. తద్విషయస్ఫురణమున నాంగ్ల రాణి యూద్వారము విరియునంతనే కెవ్వున నఱచి యావలకుఁబోయెను. కృతనిశ్చయమగు మేరీకన్య నిర్భర విచారారాటఘూర్ణితహృదయ యగుటచేతను, శూరునకు సమాధాన మీయఁదలఁచియుండుటచేతను గాఁబోలు, తన సుందరకేశపాశము లల్లిబిల్లిగఁ జీరాడుచుండెననిగాని, దేహము సముచితాచ్ఛాదనరహితమై యుండెననిగాని అరయకుండెను. కోమల చరణములు సుందరములుగ గోచరించు పాదరక్షలుదాల్చిన ఆ మేల్బంతి రక్తవర్ణరంజితమగు నంగీ యొండు కడు వదులుగ ధరించి

యుండెను. భుజములు మఱుఁగుపఱుపఁగోరి యొకచెఱఁగామె వడివడిఁ బైవైచుకొనెను. మేలిముసుఁగువలెఁ జీరాడు కుటిలచికురనికరములసగ మడఁగియున్న ఆ కన్నియవదన మాగ్రహవ్రీడాదిరసకలంగితమై యరుణమై యుండెను.

నారీజనసహజమగు సిగ్గొకవంక లాగుచున్నను, తన కారణమునఁ బ్రమాదాపాయములకుఁ బాల్పడిన శూరుని గాంచుట తన విధియని యెంచి మేరీ యటు లాచరించెను. నిజభుజవక్షోజములపైఁ బయ్యెద సవరించి, తనరూపము నధికతరముగ వెల్లడిచేయుదీపము నేలఁబెట్టి, శిలావిగ్రహసన్నిభముగ నట్టులే నిలిచియున్నశూరు నుద్దేశించి వడివడి మేరీ యిట్టులనెను—"శూరవరా! నీవు మోసపోయి ఈ తావున కరుదెంచితివి. ఏమియుఁ బ్రశ్నింపఁవలదు. నీ స్థానమున రయమ్మునఁ జేరుము."

కణతుఁ డంత దైవసాన్నిధ్యమున బ్రాలుభక్తునివలె మోఁకరించి, రాజసోదరి తోఁబ్రసుపా టధికతరమగునను భయమున నామెను గన్నెత్తిచూడక, "ఒక్కవిషయ మడిగెద"నని పలికెను.

మేరీ తత్తరపాటున నిట్టు లనెను—"సర్వ మాలించియుంటివి గదా? దైవమా! ఇంకను దడయనేల! క్షణక్షణప్రవర్ధమానమగు నగౌరవభారమున గ్రుంగుచు నింక నిటఁ దడయుదువా?"

"కాంతా! అపయశోభాజనుఁడ నైతినని వింటి—ఇపుడు నీ ముఖమునఁగూడ వింటిని. నా కిఁక భయమేడ? ఆంగ్లనృపాలుఁడు శిక్షించుఁగాక.—ఒక్కమనవి చిత్తగింపుము; అనంతర మీ యపయశోమాలిన్యము మ్లేచ్ఛనిశిత కరవాల ధారారుధిరమునఁ బోఁ జేతును."

శూరుఁ డటులుపలుక, రాజసోదరి యిట్టులనెను—

"అటు లాచరించుటయుఁ దగదు. వివేక మూనుము—ఇట

నాలసింపకుము—నీ స్థానము సత్వరము జేరుదేని, యేప్రమాదము లేకుండును.''

కణతుఁడింకను మోఁకరించియే యిట్టులనెను—"ఏదియో యొక కార్యమునకు నన్ను నియోగింపఁగోరి రావించితివని విశ్వసించి యరుదెంచితి. ఇట్టిసాహస మొనరించినందులకు క్షమింతువేని, నేఁ బోయెదను."

"తప్పక క్షమింతును. హా! క్షమించుటకేమియులేదు! నీవు సంకట పడుటకు నేఁ గారణ మైతిని. ఆహా! ఇఁకఁ దడయక పొమ్ము! క్షమిం తును—నిన్నుఁ బరిగణింతును—అనఁగా, మతయుద్ధదీక్షాపరులగు శూరు లందఱివలె నిన్నును బరిగణింతును—కాని, నీ విఁక వెడల వలయు!''

అట్లు పలుకుచు నమితమగు విసువునఁ గరసంచాలన మొనరించు మేరీతో నాతఁడు మగుడ నిట్టు లనెను—"అమూల్యమగు నీయుంగ రము ముందు బరిగ్రహింపుము.''

"వలదు, వలదు—మదభిమానచిహ్నముగ నీవద్దనే యుండనిమ్ము. అభిమానముగాదు. సంతాప మనవలయు. ఆహా! నన్నుఁ దలంచియైన నిఁకఁ బొమ్ము!"

మిథ్యాసందేశము విశ్వసించి యరుదెంచిన స్కాచిశూరుఁ డమిత మగు నగౌరవమునకుఁ బాల్పడుటయేగాక అపాయమునకుఁగూడ బాల్పడనుండెను. ఐనను మేరీకన్నియ ఆతెఱఁగునఁ దనపై మక్కువ జూపినంతనే కణతుఁడు తనకు ఘటిల్లిన తలవంపును రాగల అపా యముంగూడ మఱచి మోఁకరించుటమాని కట్టెదుటనున్న దివ్య సుందరవిగ్రహముపై నొక్క వీక్షణము బఱపి ఇఁక వెడలఁదలఁచి వినమ్రభావమున శిరము వాల్చెను. అంతదనుక స్థిరచిత్తయై దిట్టతన మున నట్లు మాటాడిన రాజసోదరి ఆక్షణమ కన్యాజనోచితలజ్జా

కలంగితయై యట నిఁక నిలువఁజాలక, దీపమార్పి అవ్వలకు బివ్వునఁ బోయెను. కణతుఁ డంధకారమున మునిఁగెను; ఆతని చిత్తముగూడ నంధకారబంధురమాయెను.

కాని తత్క్షణము సవ్వడియొండు వడివడి వీనులఁ బడెను. చెదరిన చిత్తము తోడనే పూర్తిగ స్థిరపడెను. రాజాజ్ఞాబద్ధుఁడై యాతఁడు కావలియుండవలసిన జార్జిదిబ్బదెసనుండియే ఆధ్వనులు వెలువడెను! మొదట నాగ్రహాఘూర్ణితమగు భయంకరశ్వానభషణము; అనంతరము దుర్భరబాధాసూచితమగు నాదము. ఆహా! కణతుని శ్వానమే! అంతలో నాజంతువున కేమి మూఁడెను? ప్రాణసమానమగు తన జాగిలము మరణవేదన కానోపు ననుభయమున నాశూరుఁడు హరిణమువలె నదరిపడి చంగున లేచెను. ఆ జాగిలము ఆపాటి యీపాటి బాధ వెలిపుచ్చునది కాదు. కావుననే, కణతుని హృదయము వర్ణనాతీతముగ సంక్షోభించెను. తన కవచము భారతరముగ నున్నను ఆతఁడు సరకుసేయక, తదాచ్ఛాదన మొనరింపని సాధారణునివలె శీఘ్రముగఁ బాఱి, దిబ్బడాసి, త దుపరిభాగము రయమున నారోహించెను.

మబ్బుమఱుఁగున నుండిన చంద్రుఁ డాముహూర్తముననే యథావిధమునఁ బ్రకాశించెను. కాని ఆంగ్లదేశపతాకము కానరాదు! ఆ కంబము తునియలై నేలఁబడియుండెను. శూరుని ప్రియశ్వాన మాతావుననే మరణవేదనబడుచుండెను.

## ౧౪

### శూరుని మనోవ్యథ వర్ణనాతీతము

తదావేశమున నాతఁడు విభ్రమచేతస్కుఁడై యచేతనుఁ డాయెను. అవిరళతరంగఘూర్ణితపారావారముచందమున క్షోభపడిన చిత్తము కొంత సేద దీఱినంతనే ఆంగ్లరాజపతాకాపహరణ మొనరించిన ముచ్చులనుఁ బట్టవలయునని యాతఁడు తలంచెను. కాని ఏవంక బరికించినను ఎవ్వరు గానరాకుండిరి. ఆసమయమునఁ గణతునిచిత్తమున బరువెత్తిన రెండవ యాలోచన యెద్దియన—స్వీయశ్వాన దురవస్థా పరిశీలనము. అట్టి మహాసంకటసమయమున నొక కుక్కను దలంచి కాలహరణ మొనరించుట విపరీతముగఁ గాన్పించును. కాని యట్టి జంతువులను సాఁకువారు సహజముగ నటు లాచరింతురు. ఆతఁడు వెంగలియై స్థానము వీడినను జాగిల మచటనే నిలిచి శ్లాఘనీయముగ బోరాడి మృత్యుఘాతము దిని నేలఁబడియుండెను. విషాదాభిమాన పూరితచిత్తమున శూరుఁ డద్దానిని ముద్దాడెను. బాధ క్షణక్షణవర్ధమానమై దుస్సహమై యుండెను. ఐనను, నిజస్వామి సందర్శనానందాతిరేకమున జాగిలము తన బాధ మఱువఁగడఁగి తోఁక యాడింపుచు నాతని చేయి నాకఁదొడఁగెను. దాని శరీరమున విఱిగినబల్లెము దీయవలయునని శూరుఁడు ప్రయత్నించెను. దాన బాధ మఱియు నధికమాయెను. ఐనను దన స్వామి కినియునని వెఱచి శునకము నిగ్రహించుకొనఁ బ్రయత్నించి వాలవిక్షేపాది బలహీనకృత్యముల నినుమడించెను. ఆహా! ఆ జాగిలమునకుఁగల స్వామిభక్తియు ననురాగమును నిరుపమానములుగదా. కాని శూరున కట్టి ప్రవర్తన

మొకతీరున బాధాకరముగఁగూడ నుండెను. ఏమన దాన దన వర్త
నము కణతునకు మఱియు నసహ్యాకరముగఁ దోఁచెను. తన దేశము
నకును బంధుజనంబులకును వెలియై అసహాయుఁడై దిక్కుమాలిన
దూరదేశమునఁ బడరాని పాటులు పడుచుండిన కణతున కాశ్వాసమే
యనుచరుఁడు, మిత్రుడు, బాంధవుఁడుగూడనై యుండెను. అట్టి సహ
కారి ఇట్టి సంకటసమయమునఁ దనుఁ బాయనుండుటచేఁ గణతుని
చిత్తము పూర్తిగ వికలమాయెను. తదుద్రేకమున నా ధీరవరుఁడు
డీలువడి వెక్కి వెక్కి తుదకు బోరున నేడ్చెను.

కణతుఁ డా తెఱఁగున దుఃఖసాగరమున మునిఁగియుండ మహామ్మ
దీయప్రార్థనావసరమున వెలువడునట్టి గంభీర దీనస్వరమున నీపలుకులు
విస్పష్టముగ వీనులఁ బడెను.

"మానవుని దుర్దశ పూర్వాపర వర్షకాలసన్నిభము. తత్కా
లము శీతలమై సుఖరహితమై ప్రతికూలమై యున్నను ఆ సమయము
ననే గులాబీ మొదలగు పుష్పములును, దాడిమ ఖర్జూరాది ఫలములును
ఉద్భవించును."

చిత్రకలాంఛనుఁడగు కణతుఁడు వెనుదిరిగి చూచినంతనే పరిచితుఁ
డగు నరబ్బీవైద్యుని వదనము గోచరించెను. ఆతఁ డెప్పుడరుదెంచెనో
ఎటు లరుదెంచెనో శూరుఁ డెఱుంగఁడు. మహామ్మదీయుఁ డాతని
వెనుకనే మఠము వైచుకొని యుండెను. ఆతని స్వరము గంభీరముగ
నున్నను సాదరముగనే యుండెను.

అబలవలె విలపించుచుండిన శూరుఁడు మహామ్మదీయుని గాంచి
నంతనే సిగ్గుపడి, బాష్పబిందువులు సక్రోధముగఁ బోఁద్రోసి స్వీయ
ప్రియాశ్వాన పరామర్శకార్యమున నిమగ్నుఁడాయెను. ఐనను ఆతని
తూష్ణీంభావము దా నరయనట్టులే అరబ్బీవైద్యుఁడు మగుడ నిట్టు
లనెను—

“పొలమునకు వృషభము, ఎడారికి నొంటెయునని కవి వాక్రుచ్చెను. అట్టులే గాయములు మాన్పుటకు వైద్యుఁడు గావలయుఁగదా.”

అంత గణతుఁ డిట్లు బదులాడెను—

“హాకీమ్! ఈ రోగి నీ కసాధ్యుఁడు. మఱియొకటి—ఈ జీవి యపవిత్రమైనదని నీమతము శాసించుఁగదా.”

“అల్లావారు జీవము గల్పించి కష్టసుఖములనుగూడ నేర్పఱచిరి. వారి దయచేఁ బ్రాపించు విద్యాప్రభావమున బాధానివారణ మొనరింపనివాఁడును, జీవితము బెంపుజేయనివాఁడును పాపియగును. నికృష్ట సేవకుని, దౌర్భాగ్యశునకమును, జయశాలియగు నృపాలునిగూడ జ్ఞాని యొక్క తీరుననేచూచి, వారలకుఁ జికిత్స యొనరించును. క్షతగాత్రి మగు నీ జాగిలము నిఁకఁ బరిశీలింపనిమ్ము.”

హాకీము అట్లు పలుక, శూరుఁడు మాటాడక ఇయ్యకొనెను. జాగిల మల్పజీవియని నిరసింపక మానవునివలెనే, మహమ్మదీయుఁ డద్దాని గాయము లెస్సగఁ బరిశీలించెను. బల్లెము భుజమున విఱిగి యుండుటంగాంచి శస్త్రసాధనోచితపరికరసమృద్ధమగు చిన్ని పెట్టె యొకటి తెఱచి సముచితమగు సందంశముబట్టి అరబ్బీసాధకుఁ డావాడి యినుపతునక సుళువుగఁ దీసివైచి స్రవించు నెత్తురుగూడ నేర్పునఁ గట్టివైచెను. ఆతఁడు సదయుఁడై తన క్షేమముకొఱకే పాటుపడుచుండెనని గ్రహించినదానివలె శునకము సహించి యూరకుండెను.

అంత నా శస్త్రవైద్యుఁడు కణతునిఁ గాంచి యిట్లు లనెను—“ఈ జంతువు బ్రదుకఁగలదు. కాని దీనిని నా గుడారమునకుఁ గొంపోయి చికిత్స సలుపుటకు నీవు సమ్మతింపవలయు. నీ సేవకుఁడగు ఆదంబేకు వైద్యవిద్యయందువలె శ్వానాశ్వ జంతు గుణగణమునందుఁగూడ ప్రవీణుఁడు. కావున అత్యుత్తమమగు నీ జాగిలమును సముచితముగఁ

జూడఁగలను.”

కణతుఁ డంత సవిషాదముగ నిట్టులనెను—

“అయ్యా! అట్టులే కానిమ్ము. ఇయ్యది అపాయమునుండి తొలంగి సురక్షితముగ నుండునేని, నీ యధీనమున నుండుఁగాక. నీవు నాపరిజనుని బ్రతికించితివికదా. ఇంతకంటె వేఱు బహుమాన మీయఁజాలను. నా కిఁక మృగయావినోద మసంభవము!”

ఆదంబేకు ఏమియు మాటాడక చప్పటులు చఱచెను. తోడనే నల్లని సేవకు లిర్వురు గోచరించిరి. శూరుని జాగిలమును గణతుఁడు వారి కందిచ్చెను. కఁడు బడలి బలహీనముగ నుండిన ఆజంతువు పెనఁగులాడక, తన స్వామిని గాంచుచు బానిసలకుఁ జిక్కెను.

“మిత్రమా! సుఖివై యుండుము. మనబాంధవ్యము నేఁటితో సరి. నీవంటి మహనీయునిఁ బొందియుండుటకు నావంటి నిర్భాగ్యుఁడు తగఁడు—” అంతలో వైద్యుని బానిసలు వెడల, శూరుఁడు మగుడ నిట్లు విలపించెను—“ఆహా! ఈజీవి మరణించిననేమి? తన విధ్యుక్త ధర్మము శ్లాఘనీయముగ నిర్వర్తించెఁగదా. నేనీ శ్వానమునైన బాగుండును—నిశ్చలముగ మరణింపఁగలను!”

శూరుఁడు వైద్యుని సంబోధింపలేదు. ఐనను, ఆతఁ డిట్టులనెను— “సమస్త జంతువులును మానవసేవకై సృష్టింపఁబడెనని మా స్మృతి ఘోషింపుచున్నది. మానవుఁడు విసువుజెంది యొక యల్పజంతువు కాఁగోరుట యవివేకమని యెఱుంగుము.”

కణతుఁ డంత కఠినముగ నిట్లు బదులాడెను—“తన ధర్మము మఱచి పాఱు మనుజునికంటెఁ దన విధి నిర్వర్తించి మరణించు కుక్కయే నిక్కముగ మిన్నగదా! హాకీమ్! నన్ను వీడుము! భవదపూర్వవిజ్ఞానప్రభావమున నాశలేని తెవుళ్లను గూడ మాన్పఁజాలుదువు. కాని చిత్తమును వేధించు గాయములు మాన్పుట యసా

ధ్యము."

"రోగి తన రోగము వెలిబుచ్చి వైద్యుని మాట జవదాటకుండు నేని, అసాధ్యము కానేరదు—"

అరబ్బీవైద్యుఁ డట్లు నిబ్బరముగఁ బలుక, శూరుఁ డిట్లు లనెను—"ఇంతపట్టు వహించితివి గానఁ జెప్పెద నాలింపుము. ఆంగ్లపతాక మీదిబ్బపై నెగురుచుండెను—రాజాజ్ఞాబద్ధుఁడనై నేఁ గాపుంటిని—ఉదయము కానున్నది—కేతనము పోయెను. కంబము విఱిగియున్నది—నే నింకను సజీవుఁడనై యుంటి!"

అంత వైద్యుఁ డాతని బరిశీలించి యిట్లు లనెను—"ఏమి! నీకవచమున గాయము కానరాదు. శస్త్రములపై రుధిరము గానరాదు. పోటున వెనుదిరుగనేరని శూరుఁడవని వినియుంటిని. తెలిసె! సుందర రోజారుణరంజితకపోలయై వినీలనయనయై యొప్పు నొక కాంత నిన్నిస్థానమునుండి మఱల్చియుండును. పరమాత్మునెడఁ జూపవలసిన దృఢతమసేవాపరాయణత సుందరనారీమణులయెడ జూపుట మీకు సహజముగదా. మానవుని పతనమున కియ్యదె కారణము. ఆదిపురుషుఁడగు 'నాదాము' గూడ నిట్టులే కాంతానురాగబద్ధుఁడై, అంధుఁడై, దైవమును విస్మరించి, జగత్కంటకుఁడగు సైతానునకు లోఁబడెను."

"భిషగ్వరా! అట్టులే యగుఁగాక—కాని, ప్రతిక్రియ యెద్ది?"

"బలము శౌర్యగుణసంభవము. అట్టులే విజ్ఞానభవము. లెస్సగ నాలింపుము. వృక్షమొకేస్థానమున కంటి సదాస్థావరముగ నుండు: గుల్లలు గూడ నట్టులే జీవములేని తెఱఁగున నొకచోటి కంటియుండును. మానవుఁడు మాత్ర మట్టివాఁడు గాఁడు. పూజ్యుఁడగు మా మహమ్మదు పవిత్రవంతమగు మక్కానగరమునుండి వెడలింపఁబడుటచే, మదీనా నగర మరుదెంచి యందు నివాస మేర్పఱచుకొనెను. ఒకతావున నిలుచుట యసాధ్య మగునపుడు, వేఱొకతా వాశ్రయింప

వలయునని మీ మతగ్రంథములు గూడ శాసింపుచున్నవి."

మహమ్మదీయుఁ డట్లు పలుక, "ఈగొడవ నాకేల ?" అని శూరుఁడు ప్రశ్నించెను. ఆదంబే కిట్లు బదులాడెను—"ఏలనో యూలింపుము. పరిస్థితు లసాధ్యముగఁ బరిణమించుచున్నవి, జ్ఞానియైనను వెనుదిరుగును. కావున, వివేకము దాల్చి, ఆంగ్లరా జాగ్రహమునకు గుఱియై క్రూరశిక్షకుఁ బాల్పడకుండ, రయమ్మునఁ బోఱి సలాద్దీనుసార్వభౌముని విజయపతాకచ్ఛాయ నాశ్రయింపుము."

కణతుఁడు నిందాగర్భితముగ నిట్లు బదులాడెను—"ఔను, నీతిబాహ్యులగు మ్లేచ్ఛులశిబిరమున నా యగౌరవము దాచికొనవలయు—అగౌరవమన నేమియో వారికిఁ దెలిసినగదా. కాని, అంతటితోఁ దీరునా ? మహమ్మదీయమతము స్వీకరింపవలయునని గూడ హెచ్చరింపవా ? మతభ్రష్టుఁడఁ గూడ నగుదునేని, అపయశము పరిపూర్ణమగును."

"నిష్కారణముగ దూషింపకుము. సలాఉద్దీను అట్టివాఁడు గాఁడు. మహమ్మదీయమతేతరులు తన్మతప్రాశస్త్య మరసి ఇయ్యకొనినఁగాని, వారిని సత్యమతస్థుల నొనరింపఁడు. అంధకారము వీడి, వెలుతురులోనికి రమ్ము. ఆసుల్తాను మహారాజ్యమువలెనే అతని దాతృత్వము గూడ ననంతము. నీకొక రాజ్యము గూడ నీయఁగలఁడు. ఉత్తరలోకావాసము దుర్భరమని విశ్వసింతువుగదా. ఈలోకముననైనను, సుల్తాను నాశ్రయించి భోగభాగ్యము లనుభవింపుము. నీమతమునకు భయములేదు."

"అంతకంటె మరణము వాంఛనీయము—"అని శూరుఁడు పలుక, ఆదంబేకు వెండియు నిట్టు లనెను—

"అట్టి యవివేకము తగదు. తురుష్కసమ్రాట్టుతో నా కొకింత చనవు గలదు. నామాట యాతఁడు తప్పక పాటించును. మతయుద్ధ

మని నీవు బీరములాడు మీ మూర్ఖపుఁబ్రయత్నము, తరంగఘాత ముల భగ్నమగు నావను బోలియున్నది. సకలక్రైస్తవనాయకులును గలసి ఆ మహానృపాలునికడ కంపిన సందేశము నీవేకదా వహించి యుంటివి. తద్రాయబారస్వభావము నీవు పూర్తిగ నెఱుంగవు కాఁబోలు.''

శూరుఁడంత విసువున నిట్లు బదులాడెను—

“ఎఱుంగను—ఎఱుంగవలసిన యవసరము లేదు. అచిరకాలమున వధ్యుఁడై నికృష్టప్రేతముగా నున్నవాఁడు తొల్లి క్రైస్తవరాజన్య సభానియుక్తుఁడై యుండినను ఇపుడు ప్రయోజన మేమి ? ''

“నీ వట్టి యవస్థకుఁ బాల్పడవలదనియే చెప్పువాఁడను. శూరుఁడా ! గమనింపుము. సలాఉద్దీను దయకుఁ బాత్రులుగావలయునని క్రైస్తవనాయకులందఱుఁ దత్తరపడువారు. ఎట్టులైన సంధియొనరిం చుకొనవలయునని మీవార లువ్విళులూరుచున్న వారలు. వేఱొక సమయమున సుల్తాను ఆమోదించియే యుండును. క్రైస్తవనాయకు లలోఁ గొందఱెట్టి హైన్యము దలంచిరో యెఱుంగవు—క్రైస్తవమహా శిబిరము వీడుటయేగాక ఆస్వార్థపరులు మహమ్మదీయ సమ్రాట్టు నకుఁ దోడ్పడుటకుఁగూడ సంసిద్ధులైరి. కాని, పాదుషా యట్టి విద్రో హులనుఁ జేరనీయఁడు. రారాజు సింహరాజముతో మాత్రము సంధి నెఱపఁగలఁడు. మా సుల్తాను ఆంగ్లేయనృపాలునితోడి సంధికి మాత్ర మిచ్చగించును: లేదేని, ఆ మహాశూరునితోఁ దదుచితముగఁ బోరాడఁ గలఁడు. ఇతరుల నాతఁడు గణింపఁడు. విశాలైరోపాఖండాంతర క్రైస్తవరాజన్యుల బలసాహసంబుల నీ సడించు సుల్తాను రిచర్డు నృపాలునితో ధారాళముగ నుదారముగ సంధిసలుపును. పాలస్తానము నందలి మీ పవిత్రస్థలములకు మీ వారలు నిరాఘాట ముగ నరుదేఱవచ్చును. అంతేగాక, తన సామ్రాజ్యమునందు రిచర్డు

రాయనికిఁ జాలిచ్చుటకునైన సుల్తాను సమ్మతించును. ఈ పాలస్థాన దేశమందలి ఆఱుప్రధాననగరములందు నాంగ్ల రాజు క్రైస్తవసైన్యము ములు నిలిపి యుద్యోగులనేర్పఱచి తదధికారము వహించుటకుగూడ మా సమ్రాట్టు ఇయ్యకొనును. 'ఎరూసలేము నగర రాజరక్షకుఁ'డను బిరుదము రిచర్డువహింపవచ్చును. శూరుఁడా! ఒక గొప్పరహస్య మాలింపుము—నీవు గౌరవనీయుఁడవని చెప్పెద. ఆసియాఖండ మునందెల్ల మేటి మగలగు సలాద్దీను రిచర్డులకుఁ గాఁగల సంధికార్య మపూర్వవివాహముతోఁ బూర్తియగును. జగత్పాలకుఁడగు సుల్తాను మేరీ నామధేయయగు నాంగ్ల రాజసోదరిని వివాహమాడును."

నిజమనోభవాలోచన తప్పుఁడగు కణతుఁడాతని ప్రసంగము శ్రద్ధ మెయి నాలింపలేదు. పక్షవాతరోగపీడితుఁ డొకపుడు నరముల వికల వర్తనముచే నాకస్మికముగ నధిక బాధ జెందును. అట్టులే, అంతవఱకు స్మృతియెఱుంగని శూరుఁడు వివాహవచనశ్రవణమున నదరిపడి, వర్ణ నాతీతమగు తదవసరావేశమున 'హా! ఏమంటివి?' అని యఱచెను. హృదయమునఁ బొంగు రోషావేశము నెట్టులెట్టులో యడఁచి, స్వరము సవరించి, ఆతఁ డావిషయమింకను వినఁగోరెను. శూరుఁ డాకన్యా రత్నమును బ్రేమించియుండెఁగదా. ఈ సమయమున నవస్థమాత్రీనను, పతాకాపహరణహేతువుచే భాగ్యమానము, ప్రాణముగూడఁ బోయి నను, మేరీకన్నియ మ్లేచ్ఛునధీనమగు దౌర్భాగ్యము దప్పిచుట తనకు విధ్యుక్తమని యెంచి నిరసనసందేహములు వెల్లడియగు స్వరమున నిశ్చలముగ నాతఁడిట్లు ప్రశ్నించెను—"నీతి బాహ్యుఁడగు మహా మ్మదీయునకుఁ గన్నియ నొసంగుట కేక్రైస్తవుఁడు సమ్మతించును? అట్టి యసంబద్ధ వివాహమున కెవ్వఁ డియ్యకొనును?"

వైద్యుఁడిట్లు బదులాడెను.—"నీవేమియు నెఱుంగని దురభిమా నివి. ఇంగ్లాండు దేశమునకుఁ జేరువనుండు 'స్పెయిను' దేశమున నిట్టి

వివాహము లనుదినము జరుగుటలేదా? తద్దేశపాలకులగు మహమ్మదీయులు క్రైస్తవకాంతలను భార్యలుగాఁ బడయుటలేదా? అట్టులే, మా సుల్తాను రిచర్డురాజసోదరినిఁ బరిగ్రహింపఁగలఁడు. ఆ కన్నెమిన్నను దురుష్క-భామినులనువలె నడఁచియుంచక, క్రైస్తవనారీ జనోచిత స్వాతంత్ర్య మొసంగి మా మెయు సుల్తాను గారవించును. అబల లేమతస్థలైనను, పాటింపనవసరములేదు. కావున మేరీరాజపుత్రి తన మతనియమము లనుసరించియే చరింపవచ్చును. ఆమె యితరావరోధ జనంబులకంటె మిన్నయై, పట్టమహిషియై, నిరవధికాధికార ధురంధరయై శాసింపఁగలదు."

శూరుఁడంతఁ గ్రోధవిస్మయకంపితుఁడై యిట్టులనెను—"ఏమి! ఎంతసాహసము! తురుష్కుఁడా! సత్కులప్రసూతయై, సద్గుణవిరాజమానయై, యొప్పు తన సోదరిని మ్లేచ్ఛున కొసంగి యంతఃపుర దాసినొనరించుటకు రిచర్డు నృపాలుఁ డియ్యకొనునా? మహమ్మదీయ రాజపట్టమహిషియన్నఁ బ్రధానోపపత్నియే గదా? హాకీం! ఎంతటి నికృష్టక్రైస్తవుఁడైనను దనపట్టి కట్టి దౌర్భాగ్యపుభాగ్యముగాంక్షింపఁడు, తప్పక తిరస్కరించునని యెఱుంగుము."

అంత మహమ్మదీయుఁ డిట్లు బదులాడెను—

"పొరపడితివి. ఫ్రెంచినృపాలుఁడు మొదలగు నాయకప్రముఖులు నీవలె నదరి తూలనాడకుండుటయేగాక, తమ మామోదము విస్పష్టముగ వెలిబుచ్చిరి. తమ మిత్రుఁడును సకలక్రైస్తవ చమూనివహశాసకుఁడును నగు నాంగ్లనృపాలుఁడు తన సోదరిని సుల్తానున కొసఁగి సగౌరవముగ సంధియొనరించుట సమంజసమని వారునుడివిరి. వివేకవంతుఁడగు టైరునగరపుఁ బ్రధానాచార్యుఁ డీ సందేశము రిచర్డున కెఱిఁగించి కార్యము సఫలమొనరించుటకు సమ్మతించెను. సరాటు దేశాధిపతి యగు కాన్రేడు మొదలగువారలు రిచర్డు భంగపడవలయుననియు,

దానఁదాము లాభము వడయవలయుననియు, జూచు దుష్టులగుటచేత మా సుల్తాను వారల కీసమాచారమింకను ఎఱింగింపలేదు. శూరుఁడా! నీవిఁకఁ గాలయాపన మొనరింపక వెంటనే యశ్వారూఢుఁడవు గమ్ము. నే నొసఁగు కమ్మ పాదుషావారి కొసంగుదేని, ఒక యున్నతస్థానము సముచితముగ వడయఁగలవు. దేశమత భ్రష్టుడవగుదువని భయపడ నవసరములేదు. ఈ వెరవున నుభయరాజసమ్మతమగు కార్యమొన రించిన వాఁడవగుదువు. క్రైస్తవవివాహవిధానము, తద్భార్యా సమా దరణము, తదాచారవ్యవహారాదులు గుఱించియు సుల్తానునకు నీవుప దేశింపవచ్చును. ఇట్టి నీ సాహాయ్య మత్యవసరము, తురుష్కచక్రవర్తి ఎంతయేని సంతసించును. అఖండప్రాచ్యఖండభాగ్యధుర్యుఁడగు సలా ఉద్దీను నౌదార్య మవిచ్ఛిన్నముసుమా. వివాహానంతర మా కరుణా సముద్రుఁ డాంగ్లరాజేంద్రునితో నినుఁగూర్చి సంప్రతించును. రిచర్డు తప్పక నీ నేరము సైరించి తొంటి తెఱంగు సాదరముగ గౌరవించును. నీ వీసీమనుండు క్రైస్తవసేనలకు దళవాయివి కాఁగలవు. లేదేని నీ దేశమున కరుగఁగలవు. కావున నా మాట బాటించి లెమ్ము.”

అంత శూరుఁడిట్లు బదులాడెను——

“హకీం! నీవు ప్రజోపకారపరాయణుఁడవు, సజ్జనుఁడవగుటయే గాక, ఆంగ్లరాజ ప్రాణదాతవుగూడ నగుటచేత, మించి మదీయసేవక ప్రాణదాతవుగూడ నగుటచేతను నీ నుడు లింతవఱకు శాంతముగ నా లించితి. కొండొక మహమ్మదీయుఁ డాయెనేని, ఒక్కపోటున గతాసు నొనరించి యుందును. మఱియొకమాట గమనింపుము. పూతక్రైస్తవ వంశోద్భవయగు నాంగ్లరాజకన్నియను దుష్టమహమ్మదీయ వంశభ వున కీయవలయునని ఎవ్వఁడేని పలుకసాహసించినచో నా క్షణమ ప్రచండాంగ్లరాజ కుఠారనిర్భిన్న శిరస్కుఁడగును.”

“అట్లులైన, సురక్షితమగు సారసేన శిబిరమునకుఁ బాఱిక, ఇందే

నిలుచుటకు నిశ్చయించితివా? ఇచట మరణము సాధము సుమా. శూరుఁడా! ఆత్మహత్యాకరమగు పనులు వర్జింపవలయునని మా శాస్త్రములే గాక, మీయవికూడ శాసించును—" మహమ్మదీయుఁ డట్లు లాడఁ, గ్రైస్తవుఁ డిట్లు బదులాడెను—

"దైవము వారించుఁగాక! కాని, నేరస్థుఁడు తదుచితఫలానుభవము దప్పింపఁజూచుట కూడఁ గూడదని శాస్త్రము తెల్పుచున్నది. ఆహా! విశ్వాసపదమున కర్థ మెఱుంగని నీకు నాశ్వాసరాజము నొసంగితి గదా యని విచార మొదవుచున్నది. ఈగండ మొకవేళఁ గడచి జాగిలము బ్రదుకునేని, తనగుణ మరయఁజాలని ప్రభుని సేవింప వలయును.

"శూరుఁడా! నీ విట్లు కటకటంబడు బహుమానము నాకేడ? ఐనను, రోగనివారణము కాకుండ రోగి నంపివేయుట వైద్యజనసమ్మతము గాదు. నీజాగిలము పునరారోగ్యము వడయునంతనే నీయధీనము కాఁగలదు."

హాకీమట్లు సముచితముగఁ బలుక, కణతుఁడు నిట్టూర్పు పుచ్చి యిట్టులనెను—"భిషగ్వరా! పొమ్ము—నాకును మరణమునకును నడుమ నొకగంటకాలము మాత్రమున్నది. అట్టి భాగ్యహీనుఁడు శ్వానాదిహీనవిషయములు దలఁపరాదు. మత్కృతపాపస్మరణ మొనరించి, దైవచింతానిమగ్నుఁడఁ గావలయు—నన్ను వీడుము.

"కానిమ్ము. మౌర్ఖ్యనిమగ్నుఁడవగు నిను వీడిపోయెద. అగాధ కూపపతనులై మరణింపవలయునని విధి నిర్ణయించు మనుజులు, కనులు గలవారలయ్యు, నా కూపము గాంచనేరరు."

ఆదంబేకు అట్లు పలికి వెనుదిరిగి వెడలుచు శూరునిచిత్తము మఱలునేమోయని యల్లనల్లనాగి చూడఁదొడఁగెను. కాని కృత నిశ్చయుఁడగు కణతుఁడు బేకునిఁకఁదలఁపకుండుటచే నాతఁడు గుడా

రములు గడచికడచి మాయమాయెను. చరమచంద్ర కిరణములను బోద్రోయు నుషఃకాలపుఁ గాంతులలో, నిబిడ పటమందిరశ్రేణులు తెల తెల్లగఁ దోఁపనారంభించెను.

శూరుఁడు మహామ్మదీయుని హితమాలింపలేదు. ఐనను, జీవితాశ ఆతనిచిత్తమున నుదయించెను. ప్రాణమును వర్జనీయ మలిన వస్త్ర సన్నిభముగఁ దృణీకరించు శూరునకుఁ బ్రాణధారణావసరము బొడ సూపెను. తోడనే గతవృత్తాంతము స్మరణకు వచ్చెను. తాను ఎంగాడీ సన్యాసితో ముచ్చటించిన తెఱఁగును, 'మేరుకూపు' అనియో 'ఇల్దరీము' అనియో పిలువఁబడిన ఆ మహామ్మదీయశూరుఁడును ఆవింత సన్యాసియును గలసి చరించిన వర్తనమునుగూడఁ దలంచి విచారింప, రిచర్డురాజపరోక్షమునఁ దక్కుంగల క్రైస్తవనాయకులు దుష్టసంకల్ప ధురీణులై స్వార్థపరాయణులై యకలంకరూపవై భవవిరాజమాన యగు నాంగ్లరాజసోదరిని మ్లేచ్ఛరాజున కొసఁగఁగడఁగిరని హాకీము చెప్పిన నుడులు తథ్యమగు నని కణతునకుఁ దెల్లమాయెను—

"ఆహా! మిథ్యాతపస్వి! వృద్ధజంబుకము! ఎంగాడీ యెంతటి మాయావి! 'ధర్మరహితుఁడగు భర్త, ధర్మవిహితయగు భార్యా కారణమునఁ గత కల్మషుఁడగు'నని వాఁడు జోస్యము చెప్పెఁగదా. ఈ కుటిలాత్ముఁ డెంతటి ద్రోహమొనరించెను! వాని పలుకుల గూఢార్థ మిప్పుడు తెల్లమాయెను. ధర్మరహితుఁడగు భర్త మ్లేచ్ఛరాజు కావలయు. ఎడారియందు నా తోడఁ బోరుసలిపి, నా వలె నెంగాడీ నిలయమున విడిసి, సన్యాసితోఁ జనవుగ మాటాడిన ఆ 'యిల్దరీము' తన రాజు పంపున నరుదెంచి, త న్నిలయాంతరపవిత్ర ప్రార్థనాగారమున నుండిన ఆంగ్లరాజసోదరినిఁ గాంచియుండును. ఆ సుగుణరాశి తన రాజాధము నంతఃపురమున నడంగి యుండుటకుఁ దగునాయని వీక్షింప నరుదెంచిన ఆ మహామ్మదీయుఁడు మగుడ మద్భుజ పంజరమునఁ జిక్కు

వడుసేని క్రైస్తవనృపాలునకును యభిజాతకన్యారత్నమునకును మగుడ నిట్టి యవమానము ఘటిల్లకుండ వానిని జూర్ణీకృతశరీరు నొనరింతును. కాని, నా కాలము చెల్లెను. గంటలు పోయి నిమిషములకు వచ్చెను— ఐనను, జీవ మీతనువు వీడకమున్నె, చేయవలసిన పని చేయవలయు— సత్వరము సేయవలయు.”

కణతుఁ డట్లు తలపోసి, రెండునిముసము లట నిలిచి, తనుత్రాణము దీసి పాఱవైచి, దిబ్బదిగి, ఆంగ్లరాజావాసాభిముఖుఁడాయెను.

## ౧౫

కణతుఁ డాంగ్లపతాక రక్షణోద్యోగభారము వహించిన సాయంసమయమున నాంగ్లనృపాలుఁ డెట్లు ప్రవర్తించి యుండెనో గమనించియుంటిమి. నానా దేశాగత క్రైస్తవ నివహంబులు గాంచుచుండ, నారాజశేఖరుఁడు క్రూరకోగార్తుఁడయ్యు, నసహాయుఁడయ్యు, నుద్దండ సాహసంబున నాస్ట్రియా నృపాలునిఁ బూర్తిగఁ బరాభవించెను. అవమానమొక్క ఆస్ట్రియా దేశాధిపతికే గాక తమకందఱకుఁ గూడఁ బ్రాపించెనని ఇతరక్రైస్తవ నాయకులు లోలోనఁగినిసిరి. ఆస్ట్రియా నృపాలుని దుర్గర్వమడంచు నెపమునఁ దనవైరు లందఱకుఁగూడ బుద్ధి సెప్పితినని సంతసించి, రిచర్డు హాయిగఁ దల్పమున మేను జేర్చెను.

కాని అట్టు లతిసాహస మొనరించిన యనంతరము రిచర్డునృపాలుఁ డప్రమత్తుఁడై యుండుట సహజము. మఱియొక భూపాలుఁ డెవ్వఁడైనను తన శిబిరరక్షకుల సంఖ్య నధికతర మొనరించియుండును. ఒక సైనికవిభాగమైనను ఆయుధములు దాల్చి సిద్ధముగనుండ నియోగించియుండును. కాని ఆంగ్లరాజుమాత్ర మట్టి సముచితసన్నాహములు

సలుపకుండుటయేగాక తన సాధారణ రక్షకజనమునకుఁగూడ సెల వొసఁగి, వారు తన రోగవిముక్తియు నవీనవిజయమును సానందముగ సలుపవలయునని మధురస మిప్పించెను. లోయప్రభువు మొదలగు నాయకులు వారించి యడఁచియుంచకపోయినచో సైనికులు పూర్తిగఁ గ్రమము తప్పి ప్రమత్తులై యుండెడివారు.

వైద్యవిద్యావిశారదుఁడగు ఆడంబేకు ఆ సమయమున నాంగ్ల రాజసమక్షమున నుండెను. అర్ధరాత్రి మీఱినను గూడ కొంతకాల మచటనే నిలిచి నిండుచందురుని గమనము పరిశీలించి సముచితముగ రెండుసారు లౌషధ మొసఁగి మూఁడవజాముగూడ ముగియునపుడు హాకీ మాతావు వీడెను. తాను తన శిబిరము జేరకము న్నొకసారి కణతుని యనుచరుఁ డెటులుండెనో యరయవలయునని యాతఁ డాకుటీరము చెంతకుఁ బోయెను. స్కాచిశూరుఁ డాంగ్ల పతాకరక్షణ భారము వహించి జార్జిదిబ్బపైఁ గాపుండెనని తెలిసికొని వైద్యుఁ డటు బోయెను. ఆసమయమున శూరుఁ డెంతటి దైన్యావస్థకుఁ బాల్పడి యుండెనో చూచియేయుంటిమి.

సూర్యోదయసమయమున రిచర్డురాజశయ్యాగారము చెంత నాయుధీయుఁ డొకఁ డల్లన నడదెంచు సవ్వడి మెల్లగ నాయెను. నిరంతరము దన నృపాలుని చెంగటఁ గావలికుక్కవలెఁ గడు మెలకువగ నిద్రించు లోయప్రభువు మేల్కాంచి 'ఎవ్వర'ని ప్రశ్నించునంతలో సుస్థిరవిషాదభరితవదనుఁడగు స్కాచిశూరుఁడు ప్రవేశించెను. తన నృపాలునకు నిద్రాభంగముకాని మందస్వరమున "శూరుఁడా! ఇంత సాహసమా! అనుజ్ఞ వడయకుండ నిందుఁ జొరఁబడుదువా?" అని కఠినస్వరముగ నా ప్రభువు ప్రశ్నించెను.

కాని ఆంగ్లరాజు నాక్షణమే మేల్కాంచి యాతని వారించెను— "లోయా! ఏమాడకుము! ఈశూరుఁ డాంగ్లేయపతాక రక్షణో

ద్యోగము యథావిధంబున నిర్వర్తించి యావార్త మనకు నివేదింప నరుదెంచువాఁడు. అట్టి సైనికునకు సైన్యాధీశుని శిబిర మెల్లపుడు ప్రవేశనార్హంము—" నృపాలుఁ డంత శిరమెత్తి మోచేయిపై నాని విస్ఫారితవిశాలనయన మాయోధునిపై నిలిపి మగుడ నిట్టులనెను. "ఓయీ! శూరుఁడా! మాటాడుము. అప్రమత్తుఁడవై సగౌరవ ముగ సురక్షితముగ మా కేతనము రేయి యెల్ల గాచిన సువార్త మాకుఁ దెలుప నరుదెంచితివిగదా: వాతోద్ధూతాంగ్లపతాక మర్మర ధ్వనియే యద్దానిని రక్షించును—నీవంటి ప్రసిద్ధశూరుఁ డనవ సరము."

"నాప్రసిద్ధి సరి—ప్రమత్తుఁడ నైతి—గౌరవము పోయె—పతాక మపహృత మాయెను."

కణతుఁ డట్లు పలుక రిచర్డు కుపితుఁడై నిందాగర్భితముగ నిట్టు లనెను—"ఈవార్త దెలుప నీవు బ్రతికియుంటివి? అసంబద్ధము! మోమున నత్యల్పక్షతియైనను గానరాదు. మూఁగవానివలె మాటాడ వేమి? నిజమాడుము—రాజుతోఁడి పరియాచక మపాయకరము సుమా. ఐనను క్షమియింతు—అనృత మాడకుము."

"అనృతమా! రాజా!" కఠినశిలానిర్గత స్ఫులింగసన్నిభముగ నయనమునుండి యాగ్రహకణము వెలువడ భయదనిశ్చలస్వరమ్మున నట్టు పలికి మగుడ నాతఁ డిట్టులనెను—"నే నిదియు సహింపవలయు. నేఁ జెప్పునది సత్యమె."

రిచర్డునృపాలుఁ డత్యుగ్రుఁడై జలధరము భాతి నొక్క పలుకాడి, అంతలో నిగ్రహించుకొని, లోయప్రభు నుద్దేశించి యిట్టు లనెను— "ఓయీ! నీ వాతావునకుఁ బోయి చూచి రమ్ము. వీని మతి పరిభ్ర మించుచున్నది. వీని ధైర్యసాహసము లమోఘములు. అసంభవము! శీఘ్రముగఁ బొమ్ము—నీవు కాకున్న, ఇంకొకని నియోగింపుము."

ఆంగ్లనృపాలుఁ డట్లు పలుకునంతలో, హెన్రీనామధేయుఁడగు నాంగ్లశూరుఁడు గోఁజుచు బ్రవేశించి వడివడి నిట్లు లనెను—"పతాకము పోయెను. కాపుండిన శూరుఁడు బహుళవైరిజనఖండితుఁడై యుండవలయు—కంబము విఱిగి యున్న తావు రుధిరమయమై యున్నది."—అంతలో స్కాచిశూరుఁడు గోచరించెను—"అరె! ఈతఁ డెవ్వఁడు?"

"ద్రోహి!"—ఆంగ్లనృపాలుఁడు క్రోధోన్మత్తుఁడై దిగ్గున లేచి భారతరకుఠారముం దటాలునఁ దీసి యిట్లు గర్జించెను—"ద్రోహి! తదుచితఫల మనుభవించును. జూడుము."

కణతునిశిర మొక్కవ్రేటునఁ ద్రుంచువానివలె నృపాలుఁ డాయుధము సారించెను. శిరస్త్రాణరహితుఁడగు నాశూరుఁడు జీవరహితచంద్రకాంతశిలావిగ్రహామువలె వివర్ణుఁడై నిశ్చలుఁడై యధోనయనుఁడై మిన్నకుండెను. దైవప్రార్థన సలుపుటచేఁ గాఁబోలు నాతని పెదవులుమాత్రము దృశ్యాదృశ్యముగఁ గదలునటులుండెను. ద్రోహిశిరఃఖండమునకుఁ గడంగి భూరితరకుఠారధారియగు నాంగ్లరాజేంద్రుని దక్షిణభుజమును, వెడద యురమొకింతయును వస్త్రమునుండి వెలువడి తద్బలోన్నతి దెలుపుచుండెను. ఘోరసంకల్పధురీణుఁడైన ఆంగ్లరాజు క్షణమాత్రకాల మట్టు లుండెను. అనంతర మాహస్త మల్లన దిగిపోయెను—

"హెన్రీ! ఏమంటివి? ఆస్థలమున రక్తముండెనుగదా. స్కాచిశూరుఁడా! నీవు ధైర్యవంతుఁడవు—ఆహవమునఁ గాంచియుంటిని. ఆంగ్లపతాకము సమీపించిన నరాధముల నిరువురనైనఁ బరిమార్చితి నని చెప్పుము—ఒక్కనినైనఁ జాలు:—శక్తివంచన లేకుండ మాకొఱకుఁ బోరితినని వచింపుము. సజీవముగ సగౌరవముగ నీ వీ ప్రదేశము వీడిపోవచ్చును!"

నృపాలుఁ డట్లు పలుక కణతుఁ డిట్లు నిశ్చలస్వరమున బదు లాడెను—

"రాజాగ్రణీ! నే నసత్య మాడఁజాలను.

వీడరాని పతాకము వీడి యరుగ నాకంటె విశ్వాసపాత్రమగు నా జాగిల మాంగ్లపతాకరక్షణము శ్లాఘనీయముగ నిర్వర్తించి శూలఘాతమునకుఁ బాల్పడెను. నేఁ జేసిన దేమియులేదు."

రిచర్డు తోడనే క్రోధప్రకంపితుఁడై యట్టులాడు కణతుని దెగనఱకఁ గృతనిశ్చయుఁడై తన ప్రచండపరశువు మగుడఁ బైకెత్తెను. అంత లోయప్రభు వడ్డుపడి యిట్టు లనెను—"నృపాలా! వలదు. ఇట్టి కృత్యమునకు నీహస్తము తగదు, ఈతావును దగదు. పవిత్రాంగ్లపతాకరక్షణభారము నికృష్ట స్కాట్లాండు దేశస్థున కొసంగుటయే చాలు చాలు. మోచుటకు సుందరముగఁ దోఁచు స్కాటులు సత్యదూరులని చెప్పుచుంటిఁగదా."

"లోయూ! నీవు చెప్పుచునేయుంటివి. కాని నే నెంతటిబేలను. స్కాట్లాండు దేశపు 'విలియము'—ఆ సృగాలము—ఈ మతయుద్ధమునకు ససైన్యముగ నరుదెంతునని నమ్మకము జెప్పి తుదకు మోసపుచ్చెఁగదా. ఇంకను ఆ దేశస్థుని విశ్వసించితి."

కణతుఁడు తత్క్షణ మిట్టు లనెను—"రాజా! విలియము మోసము సేయలేదుసుమా. పరిస్థితులు ప్రతికూలించుటచే నాభూపాలుఁడు సైన్యముగొని రాఁజాలకపోయెను."

"లజ్జాహీనుఁడా! మాటాడకుము. నీ వుచ్చరించునంతనే రాజనామము కళంకిత మగును."—నృపాలుఁ డట్లు కణతునిఁ దూలనాడి లోయప్రభునిఁ గాంచి యిట్టు లనెను—"కాని లోయూ! వీని సంగతి విపరీతముగ నున్నది. వీఁడు భీరుఁడో ద్రోహియో కావలయు. ఐనను సింహబలుఁడగు రిచర్డు వధించుటకు భయంకరముగ నాయుధ

మొత్తినను సుస్థిరగాంభీర్యము వహించియున్నవాఁడే! అణుమాత్రము భయకంపితుఁ డాయెనేని ఒక్కకీలు కదలెనేని నయనమైనను జలించెనేని వాని శిరము గాజుపూసవలెఁ దుత్తునియ లాయెడిది. భయ మెఱుఁగక ఆత్మరక్షణమునకుఁ గడంగక ఇంత గంభీరముగ నిలుచు వానిని వధింపఁజాలను.''

ఒక్కనిమిష మెల్లరు నూరకుండిరి. అంత స్కాచివీరుఁడు నృపాలుని సంబోధింప నాతఁడు వారించి యిట్టులనెను—"ఏమి! మాటాడజాలుదువే? దైవమును క్షమాభిక్ష వేడుకొనుము. నీవు నాకు శత్రువ్యుఁడవు గావు. ఆంగ్లదేశము నీకతమున నపయశోమగ్నమాయెను. నీవు గాదు—ఇట్టినేర మొనరించువాఁడు మదీయసోదరుఁడేయైనను రక్షణీయుఁడు గాఁడు.''

అంతఁ గణతుఁ డించుకేనియుఁ జలింపక ఇట్లు బదులాడెను—"భూపాలా! నేను మానవకృపాభిక్ష గోరను. మృత్యుముఖముననున్న నేను సముచితమగు నంత్యప్రార్థన మొనరింపఁజాలు నవకాశ మొసంగెదో, లేదో నీయిష్టము. పరమాత్ముఁడు నన్ను మన్నించుగాక! కాని నాదొక విన్నపము. నిర్మల యశోమండితుఁడవగు నీ వవశ్య మాలింపవలసిన రహస్య మొండు గలదు."

ఆంగ్లపతాకమునకు సంబంధించినవిషయ మెద్దియో వెల్లడించునని యెంచి వెంటనే తెలుపవలయునని రిచర్డు పలికెను. కణతు డిట్టులనెను—"రాజా! ఇయ్యది కేవలము నీ యశోగౌరవములకు జెందిన విషయము—అన్యు లాలింపరాదు."

ఆంగ్లనృపాలుఁ డంత హెన్రీ లోయప్రభుల నుద్దేశించి యవ్వలకేగవలయునని ఆజ్ఞాపించెను. హెన్రీ తత్క్షణ మామందిరము వీడెను. లోయప్రభువుమాత్ర మట్టు లాచరింపక, ఇట్టు లనెను—

"రాజా! నా పలుకు నిక్కమంటివిగదా. కావున నామాట నీవు

పాటింపవలయు. కుటిలుఁడగు స్కాటు ఇం దుండునపుడు నిను వీడి పోఁజాలను.''

రిచర్డు క్రుద్ధుఁడై పాదన భూతాడన మొనరించి యిట్టు లనెను. "ఏమి! ఒక్క దేశద్రోహిని గాంచి నాకై తల్లడిల్లెదవా?''

"నృపాలా! ఆగ్రహము నిరర్థకము. నీవు రోగివి. ఈతఁడు సాయుధుఁడు. కావున నిను వీడరాదు.''

లోయప్రభు వటులు పలుక, స్కాచిశూరుఁ డిట్టు లనెను— "అభ్యంతరము లేదు. ఈ నెపమునఁ గాలహరణ మొనరించువాఁడఁ గాను. లోయప్రభు వుండగనే చెప్పెదను. అతఁడు సత్యప్రియుఁడు, సచ్ఛీలుఁడు.''

"ఒక గడియకిర్రిందట నినుగుఱించి నేనును అట్టులే తలంచితి—'' అట్లు పలుకు నాంగ్లప్రభుస్వరము విషాదనిర్వేదసంకలితమైయుండెను. కణతుఁ డిట్టు లనెను—

"ఆంగ్లభూపాలా! నీవు ద్రోహపరివృతుఁడవు.''

"ఔఁగాక. అందులకు నీవే ప్రబలనిదర్శనము.''

"నృపాలా! సమరమున నూరుపతాకములు గోల్పోవుటకంటెను ఈ ద్రోహము విశేషకళంకదాయకము.''—కణతుని స్వరము కంపించెను. కడుంగడు దొట్రిలి హీనస్వరమున నాతఁ డిట్లు చెప్పఁబోయెను— "మేరీ రాచకన్నియ''—

"హా!'' రిచర్డు అహంకారపూరితచిత్తుఁడై కణతునిఁ దీక్షముగ వీక్షించి కఠినముగ నిట్లు ప్రశ్నించెను—"ఆమెగుఱించి యేమందువు? ఏమి? ఆమె కీవిషయముతో సంబంధ మేమి?''

"నృపాలా! మీ రాజవంశమునకుఁ గళంక మాపాదింపవలయునని కుజనులు కుట్ర లాచరించుచున్నారు. మేరీ రాజకన్యను మ్లేచ్ఛరాజున కొసఁగి క్రైస్తవాన్వయ యశోభంగకరమగు సంధి పొసఁగ

వలయునని మన నాయకులు మంతనము లొనరించిరి.”

అట్టి దుర్వార్తశ్రవణమునఁ బడునంతనే ఆంగ్లరాజు నితాంతకుపిత స్వాంతుఁ డగునని స్కాచిశూరుఁడు సహజముగ విశ్వసించెను. కాని రిచర్డు చిత్తప్రవృత్తి సాధారణమైనది కాదు. ఒక డొసఁగు హితము నందలి గుణదోషములు విచారించి తదుచితముగ మెలఁగుట మాని, వానిపైఁ దనకుఁ గల్గు యభిప్రాయము ననుసరించి చరించుట ఆంగ్ల నృపాలుని స్వభావము. స్కాచిశూరుఁడు మహాద్రోహ మొనరించి శిక్షార్హుఁడై యుండుటయేగాక, ఆతని పూర్వప్రవర్తనము గూడఁ దలఁపునకు వచ్చెను. భాగ్యహీనమగు స్కాట్లాండు దేశమునుండి యరుదెంచిన కణతుఁడు నిరుపమానధైర్యస్థైర్యములు గల శూరుఁడే యైనను తన యంతర మెఱుఁగక తనసోదరి నాసింప సాహసించెనని యనుమానించి, ఆంగ్లరాజు కుపితుఁడై యుండెను. అట్టి కణతుఁ డిట్టి సమయమున నాంగ్లరాజవంశోద్భవురాలి నామోచ్చారణ మొనరించి నంతనే, యుగ్రస్వభావుఁడగు రిచర్డు పరిభవానలతప్తుఁడై, క్రోధో న్మత్తుఁడై యిట్టు లనెను—

“అధమాత్మా! సాహసీ! వదరకుము! పూతక్రైస్తవకాంతా నామోచ్చారణ మొనరించు నీజిహ్వఁ దప్తసందంశముతోడఁ బెకలింతును! ద్రోహీ! అధమాత్మా! నీ వొక కులీనునివలె నటించి యెంత దవ్వుజూపితివో గ్రహించియు సహించియు యూరకుంటిని. మ దేశ పతాకము గోల్పోతినని తెలిపిన తుచ్ఛపునోటితో మత్సోదరీప్రశంస యొనరింతువా? ఆయది నీకేడ? సారసేనుని బరిణయ మాడినను క్రైస్తవుని బరిణయ మాడినను నీకేమి? క్రైస్తవనృపాలురు పంద లగుటయేగాక నిశాసమయమున ముచ్చులై చరింతురు—నీవంటి శూరులు ద్రోహు లగుదురు. ఏమైనను, సత్యస్వరూపుఁడగు సలాద్దీను సుల్తానుతోడ నేను బాంధవ్యము నెఱపుదుఁగాక—నీకేమి? మతేని

కైన నేమి?"

"ఇఁక బ్రపంచముతోడి సంబంధమే లేని నాకేమియు లేదు—" స్కాచిశూరుఁడు ధైర్యముగ బదులాడెను—"కాని, ననుఁ జిత్రవధ గావించినను నేఁ జెప్పున దొక్కటె—నేఁ దెలిపిన సమాచారము త్వదీయ మనోగౌరవములకు దృఢముగ సంబంధించి యున్నదని చెప్పెద. రాజాగ్రణీ! మ్లేచ్ఛసంబంధము తలంపనైన దలంపుదేని, మేరీకాంతను—"

"ఛీ! ఆనామ మెత్తకుము! తలంపనైనఁ దలంపకుము!" అట్లు గర్జించు రిచర్డునృపాలుఁడు మగుడఁ దన ప్రచండపరశువు సారించెను. త దురుపీడనమున నరము లుప్పొంగ, నవిరళవల్లరీనిబద్ధమగు తరు శాఖవోలె నాతఁడు తోఁచెను.

"నామ ముచ్చరింపవలదా!—ఆమెను దలంపనైన వలదా!" స్వీయసోదరీ క్షేమమును ఆత్మగౌరవముం గూడ బాటింపక ఆంగ్ల నృపాలుఁ డట్టు లాడునని భావింపఁజాలక భ్రమాన్వడిన కణతుఁడు మగుడ సంభాషణోత్సాహియై, కృతనిశ్చయుఁడై యిట్టు లనెను— "నేఁ దాల్చు సిలువ నాన—త న్నామధేయమే మ దంత్యవాక్యమగు, త ద్రూపమే మదీయహృదయాంత్యచింతనమగు! నాదు రక్షారహిత శిరముపై నీదు భూరిబలము బ్రయోగించి, అప్పుడైన నా సంకల్పము నివారింపజాలుదువేమొ చూడుము!"

"వీఁడు న న్నున్మత్తు నొనరించును!"—సుస్థిరమగు కణతుని మనో నిశ్చయము దుస్సహం బగుటచే నాంగ్లనృపాలుఁడు విహ్వాలించెను. సన్నిహితుఁడగు లోయప్రభువు ప్రత్యుత్తర మొసంగఁబోయెను. కాని, ఆంగ్లరాణి యరుదెంచెనని ద్వారపాలకుఁ డంతలో విన్నవించెను. తేఁడు వడివడి నిట్టు లనెను—

"అమె నా బాహ్యామందిరముననే నిలిపి యుంచుఁడు. ఈ దృశ్య

మబలలు చూడఁదగినది కాదు. ఛీ! ఒక్క హీనద్రోహి కతంబున నింత కలంగితిని!"—అంత లోయప్రభు నుద్దేశించి మందస్వరంబున నిట్టు లనెను—"లోయా! వీనిని వెనుకగుమ్మమునఁ గొంపొమ్ము. భద్రముగ బంధించి యుంచవలయు సుమా—నీప్రాణము తొలఁగు నని యెంచి వాని నరయవలయు. ఈ ద్రోహి యచిరకాలమునఁ జావ వలయు—వాని శరీరమునే ఖండింతుము గాని, ఆత్మను గూడ శాసిం చువారము కాము. ఆచార్యు నొకని రావించి, వీఁడు పశ్చాత్తాప మొందు నవకాశ మీయవలయు. మఱియొకటి—వీఁడు శూరుఁడు గావునఁ దదుచితముగనే మరణించుఁగాక. వీని దౌష్ట్యము నరకమంత నికృష్టముగ నున్నను, ధైర్యస్థైర్యములు మాత్రము ప్రశంసనీయములు. చరణాంకుశాది శూరలాంఛనములతోడనే వీఁడు మరణించుఁగాక."

లోయప్రభువు సంతసించెను. స్కాచిశూరుఁడు నిరాయుధుఁడై యాత్మసంరక్షణ మొనరించుకొనఁ గడంగని దైన్యస్థితియందుండెఁ గదా. అట్టివానినిఁ దన నృపాలుఁడు వధించు దురవకాశము తొలంగె నని సంతసించి, యా శూరునితోడ లోయప్రభువు నడిగా వెడలెను. ఇంకొక గుడారము జొచ్చినంతనే, కణతుఁడు శృంఖలాబద్ధుఁ డాయెను. అట్టిశూరుఁ డట్టి హైన్యమునకుఁ బాల్పడుట గాంచినంతనే, లోయ ప్రభువు విషాదఘూర్ణితమనస్కుఁడై యిట్టు లనెను—

"నీవు శూరబిరుదములతోడనే మరణింపవలయునని నృపాలుఁడు సెలవిచ్చెను. తలారి శిరచ్ఛేదన మొనరించును."

ఆగ్రహధురీణుఁడగు నాంగ్లరాజట్టి యౌదార్యము జూపునని కణ తుఁడు తలంపలేదు. ఆతఁడు సవినయముగ మెల్లగ నిట్టు లనెను— "రాజు దయాళుఁడు—నేను మరణించినను, అధమాధమమరణము నకుఁ బాల్పడలేదని నా కుటుంబ మెఱుఁగగలదు. హా! తండ్రీ! తండ్రీ!"

దూరదేశమున నుండిన తన జనకుఁ డపుడు కణతుని తలఁపునకు వచ్చెను. ఆతఁడు హీనస్వరమున విలపించెను. ధూర్తుఁడైనను గరుణార్ద్రచిత్తుఁడగు నాంగ్లప్రభువు తద్విలాపమాలించి, తన విశాల ఫాలము దడుముకొని, మగుడ నిట్లు లనెను—

"శూరుఁడా! నీ కాచార్యోపదేశలాభము కూడఁ గలుగవలయు నని నృపాలుఁడు కరుణించెను. ఆచార్యుఁ డవ్వల వేచియున్నాఁడు. నీచిత్తము తదుచితముగ స్థిరపడునంతనే, యాతఁడు ప్రవేశింపఁ గలఁడు."

"తత్క్షణము రానిమ్ము. చిత్తము స్థిరముగనే యున్నది. ఈ ముహూర్తమే శ్రేష్ఠము. ఏకమార్గమునఁ బ్రయాణము సలిపి సలిపి తుద కొండొరుల నెడఁబాసి, వేర్వేరు మార్గములు బట్టు పాంథులవలె, నేనును నా ప్రాణమును పరస్పరము సెలవుగొని సిద్ధముగ నుంటిని."

శూరుఁ డట్లు పలుక, నాంగ్లప్రభువల్లన గంభీరముగ నిట్లు లనెను— "బాగు—నాసందేశము పూర్తిగ నెఱిగించుట బాధాకరముగ నున్నది. నీ వీక్షణము మరణించుటకు సంసిద్ధుఁడవై యుండుము."

కణతుఁడు నిశ్చలస్వరమున వల్లె యనెను. లోయప్రభువు వెనుదిరిగి మందగమనమున ద్వారము సమీపించి, శూరు నొక్కసారి చూడఁ గోరి మోము త్రిప్పెను. ఇహలోకము వీడవలసిన ఆ మందభాగ్యుఁడు తదుచితముగ ధ్యానపరుఁడైనటు లుండెను. ఆంగ్లేయుని హృదయము నీరాయెను. గడ్డిపైఁ బడియున్న ఆశూరుని డాసి, తచ్ఛృంఖలాబద్ధ హస్త మొంకుబట్టి, చేతనగు కరుణార్ద్రస్వరమున నాతఁ డిట్లు లనెను— "శూరకణతా! నీ వింకను దరుణవయస్కుఁడవు; తండ్రిఁగలవాఁడవు. నా కుమారుఁడు మా దేశమున నాటలాడుచుండును. వాఁ డొకనాఁడు నీయంతటి శూరుఁడు కాఁగలఁడు. రేయి నీ వొనరించిన యకార్యము దలంపనేని, నాపుత్రుఁడు నిను బోలవలయుననియే ఆశింతును! ఇందు

నీ కేమియు సాయపడఁజాలనా?''

"చాలవు. నాస్థానము వీడితి, పతాకము గోల్పోతి—నా కిఁక సాయమేడ? తలారి యరుదెంచునంతనే శిరశ్శరీరములు వేఱైపోవును.''

కణతుఁ డట్లు బదులాడ, నాంగ్లప్రభు విట్టు లనెను—"కానిమ్ము, పరాత్పరుఁడు నిన్ను రక్షించుగాక! ఆహా! పతాకరక్షణభారము నేనె వహింపనైతిని. అరయఁజాలను గాని, ఇం దెద్దియో రహస్య మున్నది—విస్పష్టము. నీవంటివాఁడు పందయగుట యసంభవము. భీరుఁ డెవ్వఁడు నీవలెఁ బోరాడుట కాంచి యెఱుఁగను. ద్రోహమందునా!—అదియు నసంభవము. ద్రోహి నిశ్చలచిత్తుఁడై మరణింపఁజాలఁడు. నీ వొక ఘోరమైన మోసమునకుఁ బాల్పడియుందువు—చక్కని మాయోపాయమున నేదుష్టాత్ముఁడో స్థలాంతరమునకుఁ గొంపోయియుండును. కాదేని, భయార్తవనితావిలాప మాలించి వెడలియుందువు—విలాసినీహాసితాననము గాంచి యటు బోయియుందువు. సిగ్గుపడకుము—అందఱ మటులు వంచింపఁబడినవారలమె. శూరుఁడా! రమ్ము, నా మాట వినుము—ఆచార్యునకుఁ గాదు, నాకే నీయుదంత మంతయుఁ దెలుపుము—నిను బ్రతిమాలెద. రిచర్డు దయామయుఁడు—ఈ యుద్రేకము చల్లారునంతనే రాజు ప్రసన్నుఁ డగును. ఏమందువు?''

లోయప్రభువు కరుణార్ద్రహృదయుఁడై స్కాచిశూరుని రక్షింపఁ దత్తరపడినను, ఆతఁడు విముఖుఁ డాయెను. తనకుఁ గల యుపలాలన సామర్థ్య మంతయు నాంగ్లేయుఁడు వినియోగించెను; అంతయు నిరర్థక మాయెను. తా నా యవసరమునకుఁ దగని యారాటము పడితినని నొచ్చుకొని, నిర్భాగ్యుఁడగు నొక స్కాచివానికై యంతగఁ గలత జెందినందుకుఁ దనపై గినిసికొని "మొఱకులగు నీ ప్రుచ్చులు మా దేశమున వైరులైనను, ఈ పాలస్థానమున మాత్రము సోదరప్రాయముగఁ గోచరింతురు.''—అని చింతింపుచు లోయప్రభువు వెడలెను.

బెరంజేరియా' నామధేయయగు నాంగ్లరాజ్ఞి కడు సౌందర్యవతియని పేరుగాంచెను. ఆమె మూర్తి పలుచనయ్యు నిర్దుష్టముగ, దర్శనీయముగ నుండెను. ప్రాయ మిరువదియొక సంవత్సరము లుండును. ఐనను, సుందరకేశపాశసంకీర్ణమై పూర్ణయువలక్షణలక్షితమగువదనముగాంతు మేని, ఆమె యంతకంటెఁ గడు తరుణవయస్కవలెఁ దోఁచుచుండెను. తన తరుణరూపము పురస్కరించుకొనియే కావలయు నానారీమణి బాలికాసహజమగు చలముమూర్ఖ్యము మొదలగు గుణము లలవడఁజేసికొనెను. పరిజనులు వినమ్రులై వందులవలె గీర్తించునపుడామెప్రసన్నచిత్తయై చనవుగ సరళముగ నుండును. కాని, తానుప్రసిద్ధాంగ్లనృపాలునర్ధాంగిని గదాయను గర్వమున వారల ననేకవిధము లామె వేధించుచుండెను. లేనివ్యాధి యెద్దియో యూహించి ఆమె వైద్యుల కెంతయేని ఆరాటము గల్గించుచుండెను. లేనిరోగమునకు నామకరణము జేయలేక వైద్యులు పడుబాధ వర్ణనాతీతముగ నుండెను. అట్టి మిథ్యారోగార్తయగు తమ దేవికిఁ గ్రొత్తక్రొత్తకథలు చెప్పఁజాలక ఆమె వినోదముకొఱకుఁ గ్రొత్త యాటలు గల్పింపనేరక శిరమునకు నవీనాలంకార మరయఁజాలక క్రొత్త యపవాదములు సృష్టింపఁజాలకను బరిచారికలు పడరాని బాధ పడుచుండిరి. వార లొక యాటనో యల్లరినో కల్పించుకొని యందు నిమగ్నులగుచుండిరి. కాని ఆయా వినోదాదికృత్యములు తాఁ జూచుటకు నుచితములో యనుచితములో యనిమాత్ర మామె తలంపకుండెను. తమ రాణిచిత్తము రంజింపఁజేయుటకొఱకుఁ బరిచారికలాటలయందొకపుడు తమ శరీరములు నొవ్వఁజేసుకొనుచుండిరి. తన వినోదమే చూచుకొను నాంగ్ల

రాణి వారి బాధ నరయకుండెను. తనయెడ నృపాలునకుఁగలమక్కువ విశ్వసించి తన యున్నతి పురస్కరించుకొని ఒరుల కష్టములు లెక్కింపక యానందించు నా రాజపత్ని యల్పజీవులతోఁ జెరలాడు సింగమును బోలియుండెను.

బెరంజేరియా తన సాధుని దృఢతమముగ, సావేశముగఁ బ్రేమించెను. కాని ఆంగ్లనృపాలుని గాంభీర్యమును ధార్ద్యమును ఆమెకు భయము గొల్పుచుండెను. రిచర్డు తనకంటెఁ గడు మేధావంతుఁడని రాజపత్ని యెఱింగియుండెను. మేరీకన్నియ సూక్ష్మగ్రాహిణియు, సుదారహృదయయు, ధీశాలినియు నగుటచే రాజామెతోడఁ బ్రాయికముగ సంభాషింపుచుండెను. రాణి కయ్యది దుస్సహముగ నుండెను. అయినను అంతమాత్రమున నామె మేరీయెడ నాగ్రహము వహింపలేదు. ఆమెస్వభావ మట్టిదికాదు. ఒకింత స్వార్థపరత్వ మున్నను, ఆమె హృదయము సహజముగ నిర్మలముగ ఉదారవంతము. కాని నిరంతర సేవాపరాయణులై యుండు పరిచారిక లామె చిత్తము జక్కగ గని పట్టి వాడియగు బరిహాసకములచేత మేరీకన్నియను గారించినచో దమ దేవి యానందించుననియు, దాన నామె సుఖ్యావ్యాధులు తొలంగుననియు నరసి యటు లొనరింపఁదొడగిరి.

కాని అట్టి వర్తన మొకింత నీచముగ నుండెను. ఏమన మేరీకన్య జననీజనకులను గోల్పోయి తన వంశజుఁడును సోదరప్రాయుఁడును నగు రిచర్డునృపాలు నాశ్రయించి ఆ యుదారపురుషుని యనుగ్రహముచే రాజసన్మానములు గాంచుచుండెను. ఆంగ్లనృపాలుఁ డామెను సగౌరవముగ సాఁకుచుండెను. రాణియైనను ఒకపుడు సంకుచితమనస్కయై కారించునదయ్యు, నామెను సముచితముగనే చూచుచుండెను. కాని రాజునకును మేరీకన్నియకును గల యథార్థ బాంధవ్య మెద్దియో మాతృ మచటి పరిజను లెవ్వ రెఱుంగరు.

కొంతకాలము పరిచారికలు మేరీతోడ నెక్కసక్కెము లాడుట కుచితావకాశము చిక్కదాయెను. ఆమె వస్త్రధారణము బాగులేదని యధిక్షేపించుట సామాన్య మగుటచేత నయ్యది రసహీనమాయెను. కాని స్కాచిశూరునికారణమున నావంత యంతరించెను. ఆమె యెంత వివేకముగఁ జరించినను, ఎంతటి గాంభీర్యము వహించినను కణతునిచిత్తము మేరీకన్నియపైఁ బాఱెనని పరిచారికలు కనిపెట్టఁ గలిగిరి. వార లాతని వేషభాషణములను అద్భుత ధైర్యస్థైర్యములను లెస్సగఁ బరిశీలించి యుల్లస మాడఁదొడఁగిరి.

అంతలో నాంగ్లరాణి సఖీపరివృతయై ఎంగాడీస్వామి నిలయమునకు యాత్ర వెడలుట సంభవ మాయెను. ఆసమయముననే స్కాచిశూరుఁ డెడారియందు బాధలు పడి పడి, యెంగాడీ యాశ్రమము జేరెను. అంగలి గుప్తప్రార్థనాలయమున నాతఁ డేకాకియై నిశాసమయమున వేచియుండుటయు, నాంగ్లరాణి మొదలగువార లాతఁ డెఱుంగకుండ నందుఁ బ్రవేశించి యందు భక్తిపురస్సరముగాఁ బ్రదక్షిణ మొనరించుటయు శూరుని డాసినంతనే మేరీకన్నియ సుందరపుష్పముకుళములు రాల్చుటయు మన మెఱిఁగిన విషయములె. సహస్రనయనములు గల పరిచారిక లారహస్య మరసి తమ దేవికి నివేదించియుండిరి. ఈ దివ్యౌషధలాభముచే రాణి చిత్త మెంతయేని సంతసించెను.

అపూర్వవక్రహాస్యాంగులు — నకటబను ఘనవీరలుకూడ నచటనే యామెకు దొరకిరి. ఇఁక నామె యానందమునకు మేరలేదు. ఆ ఘోరవికారాకారుల నాకస్మికముగ నందుఁ బ్రవేశపెట్టి ధ్యానపరుఁడై యేకాకియైయున్న స్కాచిశూరునిఁ గలంచి సంతోషింపవలయునని రాణి యప్పుడే ప్రయత్నించెను. కాని కణతుఁడు స్థిరచిత్తుఁడై యుండుటచే నామె విఫలమనోరథయాయెను. అనంతర మామె

శూరుఁ డెట్లు వంచించెనో ఆ వినోద మెంత అపాయకరముగఁ బరిణమించెనో తెల్లముగదా.

కణతుఁడా తీరున రాజ్ఞీశిబిరమునుండి వెడలిన యనంతర మా కాంత లంకరిఁపుమునఁ సమావేశమైరి. మేరీకన్య భయాగ్రహావమానబాధితయై యెంత చెప్పినను సరకుసేయక రాణి యామెతో డ నెక్కసక్కెము లాడెను. కణతుని జాతిగుఱించియు వేషము గుఱించి ముఖ్యముగ వాని దారిద్ర్యము గుఱించియు నామె కేళిసేయఁ దొడఁగెను. ఇఁక నాతావున నిలువనేరక మేరీకన్య తనగదిలోనికిఁ బోయెను. పాప మామెచిత్తము శూరునిమీఁదనే యుండెను. ఆ శూరాగ్రణికి దన కారణమున నెట్టి యపాయము సంభవించునోయని ఆమె కడుం గడు దత్తరపడి తెలవారునంతనే తత్సమాచారము తేవలయునని యొక పరిచారికను నియోగించెను. అరుణోదయావసరమున నా దాసి యరుదెంచి ఆంగ్లపతాకము పోయెననియు, కణతుఁడు కానరాఁడనియు నివేదించెను. తోడనే యామె దిగ్గున లేచి, విద్యుద్వేగమున రాజ్ఞీసాన్నిధ్యమునకుఁ బాఱి, "దేవీ! నీవు సత్వరము నృపాలుని సందర్శించి నీకుఁ గల చనవుజూపి నీ వినోదమువలన ప్రాపింపఁగలయాపద నుండి శూరుని రక్షింపవలయు"నని వేడికొనెను.

రాణి భీతచిత్తయై తన తప్పిద మొకులపై వైచి ఎన్నియోవిధముల నసంబద్ధముగ నామె నూఱడింప నారంభించెను—"శూరున కపాయము వాటిల్లదని నమ్ముము—రేయియెల్లఁ గావలియుండుటచే నలసి మైమఱచి యాతఁడు నిద్రించియుండు—దరిద్రుఁడుగదా. పట్టు జెండా చేతఁబట్టుకొని నృపాలునకుఁ గానరాకుండ పాఱియుండును— ఒకవేళ పట్టువడెనేని రాజు క్షమించును—ఈ యుద్రేకము చల్లారునంతనే రిచర్డు తప్పక క్షమించును—విచారింపకుము..."

అటు లసంబద్ధముగ నే మేమిమో చెప్పుచు రాజసోదరిని సేద

దేటించి అపాయము లేదని తాను నూటట గాంచవలయునని బెరం జేరియూ ప్రయత్నించెను. అట్టి వ్యర్థాలాపశ్రవణమునఁ గాలహరణ మొనరింప నొల్లక ఆమెను వారింపవలయునని మేరీ కడు ప్రయత్నించెను. కాని తచ్ఛ్రీముఖవచోనిర్ఝర మనివార్యమై నిరాఘాటముగఁ బ్రవహించుచుండెను. అంతలో నొకపరిచారిక యందుఁ బ్రవేశించెను. ఆకాంత నయనములు విపరీతభయాక్రాంతములై, మృత్యునిలయములై యుండెను. ఆవదన మొక్కసారి వీక్షించినంతనే మేరీపైఁ బిడుగుపడినటు లాయెను. ఆమె సహజముగ ధీరహృదయ; సమయముగూడ నమేయమగు స్థైర్యము వహింపవలసినదై యుండెను; కావుననే, ఆమె నేలఁ గూలకుండ బాహ్యగాంభీర్యము దాల్చి నిలువఁ జాలి, తత్క్షణ మిట్లు లనెను—

"దేవీ! నీమాట లిటులు వ్యర్థపఱుపక, ఆప్రాణిని రక్షింపుము"—దుర్భరవిషాదాతిరేకమున గంఠము రుద్ధమాయెను—"ఇంకను ప్రాణరక్షణ మొనరింప నవకాశ ముండునేని, రక్షింపుము."

"అవకాశ ముండును—ఉండవచ్చును. ఆతఁడు రాజసముక్షమునకుఁ గొంపోఁబడెనని వింటిని—ఇంకను ఐపోలేదు—కాని,"—పరిచారిక బోరున నేడ్చుచు నిట్టు లనెను—"కాని, తగు ప్రయత్న మొనరింపని చో మించిపోవును."

"పాలస్థాన దేవళమునకు సువర్ణదీపిక సమర్పింతును—ఎంగాడీ యాలయమునకు వెండివేదిక సమర్పింతును—నూరు సువర్ణములు విలువగల—"

కార్యమునకుఁ గడఁగవలసిన మహాముహూర్తమున నాంగ్లరాణి యీపగిది మ్రొక్కులు వెట్టుటచే నామెను వారించి, వెంటనే నృపాలుని చెంతకుఁ బోవలయునని రాజసోదరి తత్తరంబునఁ బలికెను. స్కాచిశూరుని ప్రాణసంరక్షణార్థము నృపాలునిఁ బ్రార్థింపవలయునని పరిచారిక భయాతురస్వరమునఁ బలికెను.

రాణి వల్లెయని లేచెను. కాని, ఆమె శరీరము కడు గంపించెను. పరిచారికలును భయవిభ్రమపరలై, తమదేవికి సముచితవస్త్రధారణాది పరిచర్య లొనరింపఁజాలకపోయిరి. స్థిరచిత్తయై గాంభీర్యధుర్యయై, మృత్యుసన్నిభముగఁ గళ దొఱంగిన మేరీకాంతయే రాజసందర్శనమునకు రాణి నాయిత్తపఱచెను. తాము చేయవలసిన పని సేయనందుల కా పరిచారికలను గట్టిగ దూషించి, రాణి యిట్టు లనెను—

"మేరీ! వస్త్రధారణము ముగియకున్నది—కాల మతిక్రమించుచున్నది. కావున, పైనగరపుఁ బ్రధానాచార్యుని రావించి, ఈ కార్యభార మాతనిపై వైచి, రాజుచెంత కంపుదము."

"వలదు, వలదు! దేవీ సేవ పోవలయు—నీకతంబునఁ బ్రాపించిన యాపద నీవలననే తొలఁగవలయు."

మేరీ యట్లు పలుక, రాణి యిట్టు లనెను—

"రాజసమక్షమున కిదె పోయెదను—ఇదె పోయెదను: కాని, రిచర్డు ఇంకను ఆగ్రహావేశుఁడై యుండునేని, నే మాటాడఁజాలను—నన్నతఁడు చంపివేయును!"

అంతఁ దనదేవి చిత్తము చక్కఁగ నెఱింగిన పరిచారిక యిట్టు లనెను—"దేవీ! నీ వేగవలయు. దుర్దాంతక్రోధఘూర్ణితహార్యక్షమైనను ఇటువంటి వదనమును ఇట్టి మనోహరాకృతి గాంచునంతనే తప్పక మెత్తపడును. ఇఁక, ప్రేమబద్ధుఁడు, శూరాగ్రగణ్యుఁడు నగు రిచర్డురాజు గుఱించి వేఱుగఁ జెప్పవలయునా? చిన్నమాట నీనోట వెలువడినఁ జాలు, నది యొక యాజ్ఞగా నాతఁడు శిరసావహించును."

"కలశా! ఏమందువు? నీ వెఱుఁగవు—ఐనను, వెళ్ళెదను. కాని—ఇదియేమి? ఈ హరితాంబరము నృపాలుఁ డేవగించును. నీలచేలము, ఆ రత్నహారమును గొనిరండు—ఇనుపపెట్టెలోనో మఱెక్కడనో యుండును."

రాణి యట్లు పలుక, రాజసోదరి సక్రోధముగ నిట్లు లనెను—
"ఒక మానవుఁడు మరణముఖమున నున్నపుడా, ఇట్టి జాలము! దుస్సహము—దుస్సహము!—ఇందు నా సంబంధము గూడఁ గొంత కలదుగదా. నీ విచటనే యుండుము—నేఁ బోయి, రాజాగ్రణిం గాంచి, 'మహనీయా! ఈశూరుఁడు నిరపరాధి—నాకతంబున వంచితుఁడై, స్థానమునుండి తరలింపఁబడి యీ దురవస్థకుఁ బాల్పడెను—ఈతని వధించి నాకును నీకును మన దేశమునకుఁ గూడ దుర్యశ మాపాదింపకు'—మని ప్రార్థించెదను."

మేరీ క్రోధావేశము గాంచి, యాంగ్లరాజ్ఞి భయవిస్మయాక్రాంత చిత్తయాయెను. అట్లు పలికిన యా కన్నియ వెంటనే గుడారము వీడఁ బోయెను. రాణి వెఱగంది, యామెను వారింపవలయునని హీనస్వరమునఁ బలుక, నొక పరిచారిక మేరీ కరం బల్లనఁ బట్టి యిట్లు లనెను—
"కాంతామణీ! నీ వాగవలయును. దేవీ! ఇఁకఁ గాలహరణ మొనరింపక, రాజసన్నిధికిఁ బోదువని విశ్వసింతును. మేరీ యొక్క తెయే వెడలుట ప్రమాదకరము సుమా. నృపాలుఁడు భయంకరముగఁ గ్రోధోన్మత్తుఁ డగును. అంతటి దురాగ్రహ మొక్క ప్రాణముతో నూఱట గాంచక పోవచ్చును. దేవీ! లెమ్ము!"

ఇష్టములేకున్నను జేయునది లేక, రాణి సమ్మతించెను. చిత్తమెంత తత్తరపడుచున్నను ఆమెచేష్టలు గాంచుచు మేరీ నిలిచిపోయెను. రాణి వస్త్రధారణమింకను బూర్తి కాలేదు. తనముస్తాబునందలి లోపములు గానరాకుండవలయునని, వదులగు నంగీ యామె ధరించెను. ఆంగ్లరాణి యెట్టకేలకు సఖీజనపరివృతయై, యంగరక్షకవ్రాత పరిరక్షితయై రాజసోదరిని వెంటఁబెట్టుకొని సింహాసనమాసీనుఁడగు తననాథుని గుడారమునకు వెడలెను.

ప్రకాశకులు:—అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీగ్రంథమండలి

# రాజమహేంద్రవరము

నవలలు - నవరసభరితములగు - నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికోబైండుతో

రెండుమాసముల కొక్కటిగా వెలువడుచుండును.

## నిబంధనలు

1. ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండు మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగు పోస్టేజీ మొదలగు కర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటి గ్రంథముల నన్నిటిని గొనవలయు నను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములను అన్‌రిజిష్టర్డు పార్సిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టర్డు ఖర్చు 0-12-0 లును 1-8-0 కూడివచ్చును.

ఇం దీవరకు ప్రకటింపఁబడిన గ్రంథములు :—చిత్రపటశోభితములు.

**ప్రేమసుందరి**

కర్త:
చిర్రావూరి కామేశ్వరరావు
బి. ఎ., ఎల్. టి.,

నవరసభరితమగు సాంఘికనవల. క్యాలికో బైండు 272 పుటలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**చోరశిఖామణి**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

లోమహర్షకమగు డిటెక్టివు నవల. క్యాలికో బైండు 197 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**లక్ష్మీప్రసాదము**

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

నవరసభరితమగు సాంఘికనవల. ఇందు మూఁడు రాంఢ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కఁగా వర్ణింపఁబడినవి. 346 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**హాత్యారహస్యము**

అనువాదకులు :
సాహితీసమితి సభ్యుడు

జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివునవల. తుదివరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండునటుల దుండగులు పన్నిన పన్నాగము లత్యంత భయంకరములు. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఘోస్టు (ప్రథమభాగము)

అనువాదకులు :

వెదురుమూడి శేషగిరిరావు

అధికార దుర్వినియోగము—అభేద్యములైన కోటలయందు దురాచారుల దురంతములు—మహాప్రళయము—రహస్యమువలన గలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, పాఠకమహాశయుల జిత్తరువుల గావించుచుండును. చందాదారులకు రు 1–0–0 ఇతరులకు రు 1–8–0.

## ఘోస్టు (ద్వితీయభాగము)

అనువాదకులు :

వెదురుమూడి శేషగిరిరావు

ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరాములగు సాధు యువతీ యువజనుల కల్యాణము మున్నగు నత్యద్భుత ఘటనములు. చందాదారులకు రు 1–0–0 ఇతరులకు రు 1–8–0

## కుముద్వతి

రచయిత :

శ్రీమతి పులవర్తి కమలావతీదేవి

ఇందలి దుష్టకేతుని దౌష్ట్యము భయావహము. మాయామారీచుని మాయలు భయంకరకృత్యములు చదివి యానందింపుడు. ఇయ్యది నవలకాదు. నవరసరత్నాకరము. వీరశృంగార కరుణారసంబుల యేకీభావముచే త్రివేణీసంగమమునుబోలి చదువరుల హృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు రు 1–0–0 ఇతరులకు రు 1–8–0.

## చిన్నకోడలు

అనువాదకులు :

క్రొవ్వరపు నరసింహము

శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్రగారిచే మహారాష్ట్రభాషయందు వ్రాయబడిన ధాకట్యాసూన్ భాయి నుండి తెలిగింపబడినది. కథాచమత్కృతి నవీనము. చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంత్యౌదార్యాది సుగుణములును, పతిభక్తియు మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మీసంపన్నముగాఁజేయుట మొదలగు సంగతులు చదువదగినవి. చందాదారులకు రు 1–0–0 ఇతరులకు రు 1–8–0.

## రహస్యభేదనము

కర్త :

కేతవరపు వేంకటశాస్త్రి

రహస్యాపరాధ పరిశోధక నవల. కథాకల్పన మత్యద్భుతము. సంఘటనము లతిభయంకరములు. నిగూఢహత్యలెన్నియో వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇంగ్లాండ్ దేశమునకు సంబంధించినది. ఇట్టి గ్రంథ మిదివఱకాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1–0–0 ఇతరులకు 1–8–0

## సింహగడము

అనువాదకులు :

శ్రీ వాసుదేవరావు

మహారాష్ట్ర భాషలో శ్రీహరినారాయణ ఆపటే గారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయమగు యీకథ గాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## మణిహారము

కర్త :

బులుసు వేంకటసుబ్బారావు బి. ఎ., బి. ఎల్.,

ప్రభాకరునిపగిది ప్రకాశించు ప్రభాకరుడు, హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని, సార్వభౌమలక్షణలక్షితుం డగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధరసభావతరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## మొగలాయీ దర్బారు

(ప్రథమభాగము)

అనువాదకులు :

మొసలికంటి సంజీవరావు పంతులు

శ్రీ. శ్రీ. ధీరేంద్రనాథపాల్ గారి సుప్రసిద్ధ గ్రంథరాజమున కనువాదము. ఇయ్యది నవరసభరితమై, చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును. అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీగ్రంథమెల్లరు చదువ తగియున్నది. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## మొగలాయీ దర్బారు

(ద్వితీయభాగము)

అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

ప్రథమసంపుటమందలి నిగూఢములైన దారుణశవప్రదర్శనములు, పిశాచకృత్యములు ఇందు భేదింపబడి చదువరుల నానందనిమగ్నుల నొనర్చును. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## ఘటనాచక్రము

అనువాదకులు :

గారపాటి అంజనేయ చౌదరి

పాంచకడీదేవ విరచితమగు భీషణపరిశోధకను వాదము. ఆశ్చర్యములకు బుట్టినిల్లు, కౌతుకమునకు భాండారము. విచిత్రములకుఁ గనిమై. పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## రాజసుందరి

కర్త :

కేతవరపు వేంకటశాస్త్రి

ఆంధ్రదేశాత్మకమగు స్వతంత్రకల్పన సాంఘికనవల. కథావిధాన మత్యద్భుతము. నిరుపమానము. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

| | |
|---|---|
| **కుంకుమభరణి**<br>అనువాదకులు :<br>శ్రీ శివశంకరశాస్త్రి | ఇది సాంఘికనవల. మామూలునవలలవలె గాక యిందు క్రొత్తచమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలి మనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **జాగిలము**<br>రచయిత :<br>శ్రీమతి<br>సీరము సుభద్రయాంబ | అతిభయంకర నిరూపక నవలారాజము. హంతకుడు భయంకరమగు జాగిలము సహాయమున చేయు హత్యలు హృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యీవిషమ సమస్యను భేదించు టతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **సరస్వతి**<br>అనువాదకులు :<br>శ్రీవాసుదేవరావు<br>శ్రీకృష్ణరఘునాధరావు | మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపఁబడిన సాంఘికనవల. మనోహరకథావిధానము. శైలి నాతికఠినము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **ఆనందాభాయి**<br>కర్త :<br>కేతవరపు వేంకటశాస్త్రి | ఇయ్యది యూహాజనితమే యైనను చరిత్రసమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0. |
| **హత్యాన్వేషణము**<br>అనువాదకులు :<br>గుర్రాల నారాయణరావు | అద్భుతమగు పరిశోధకనవలారాజము. ఆంగ్లేయ గ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపఁబడినది. తుదినఱకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **మొగలాయీ దర్బారు**<br>(తృతీయభాగము)<br>అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు | మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై, చిత్రవిచిత్రోపకథల కొలవాలమై, మనోహరమై, యానందదాయకమై, పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమై యొప్పును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **గంగ**<br>కర్త :<br>చిర్రావూరి కామేశ్వరరావు బి. ఏ., ఎల్. టి., | గంగాచరిత్రము కరుణరసప్రపూర్ణము, ప్రేమభావాత్మకము. శైలి కోమలమై, సుధామధురమై, తేటనీటివెల్లువవలె, ముద్దులొలుకుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |

## మొగలాయీ దర్బారు
(చతుర్థభాగము)
అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

కథోపకథానల్లరులతో నల్లిబిల్లిగ నల్లుకొని యున్న యీ నవలారాజము సర్వజనహృదయాకర్షణీయము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## కోహెనూరు
కర్త : చిల్లరిగె శ్రీనివాసరావు

ఈ కోహెనూరు అమూల్యమైన వజ్రముగాదు. అతిమనోహరమైన చారిత్రిక నవల. శైలి మృదుమధురము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## ఆర్సేన్ లుపేన్
అనువాదకులు : జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ.,

అత్యద్భుతమయిన డిటెక్టివునవల. ఇందలి మనేలా మర్మములు, మానసికాంతిక మాయలు అనిర్వాచ్యములయి పాఠకులను విస్మయవిపరీత చేతస్కులను గావించును. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## అపరిచిత
కర్త : మాలే రాఘవరావు

మనోహరమైన సహజ సాంసారిక, సాంఘిక సంఘటనలతో వెల్లివిరియు అపూర్వపరిశోధక నవలారాజము. ఇందలి ఇతివృత్తము సర్వజనహృదయానందప్రదము. క్రొత్తపోకడలతో గూడిన దీని శైలి మృదుమధురము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## అంతఃపురము
(ప్రథమ భాగము)
అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

సుప్రసిద్ధ రెనాల్డ్సు గ్రంథరాజమునకనువాదము. తురుష్క చరిత్రాధారమగు నియ్యది సర్వజనహృదయాకర్షణీయమైనది. నవరసభరితము — అందును శృంగారరసప్రధానము_ అద్భుతసంఘటననిధానము. ఎల్లరు చదువదగినది. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## అంతఃపురము
(ద్వితీయభాగము)
అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

అత్యద్భుతఘటనాసంయుతమును, విచిత్రకథాపిలసితమును నగు గ్రంథరాజము. ప్రథమభాగమునందభివర్ణింపబడిన నిగూఢ హత్యారహస్యము లిందు వెల్లడింపబడినవి. శైలి మృదుమధురము. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## అగ్రహారము

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

మనోహరమైన స్వతంత్రసాంఘికనవల. అగ్రహారజీవిత మింగు దర్పణమంటుచులె గానవగును. వరశుల్కాదిదురాచారముల దుష్ఫలితములు చక్కగ చూపింపబడినవి. అపూర్వమగు కథాకల్పనము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## ఛిన్నహస్తము

(ప్రథమభాగము)

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

అద్భుతమైనపరిశోధకనవల. సుప్రసిద్ధమగు ఫ్రెంచి నవల ననుసరించి వ్రాయబడినది. కథాకల్పన మపూర్వము. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## ఛిన్నహస్తము

(ద్వితీయభాగము)

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.,

ప్రథమభాగమునందలి అద్భుతఘటనముల చిక్కులింగు బాహిరమును జూచి మహాఅద్భుతఫలితములను ప్రసవించినవి. ఛిన్నహస్త మెవ్వరిదో యెఱుగువఱకు వీడలేరు. వెల చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

## కంకణరహస్యము

కర్త:
నేలటూరు అనంతాచార్యులు

చక్కని నిరూపకనవలారాజము, ఇతివృత్తము మనోహరరహస్య ఘటనాసంయుతము. ఒక భ్రాతృవేషధారి రహస్యము, ఒక భ్రాతృద్రోహియొక్క రహస్యాభిలాష కంకణరహస్యమున ప్రతిఫలించినవి. పాఠకులు ముగించువఱకు దీనిని విడువజాలరు. చందాదారులకు రు 1_0_0 ఇతరులకు రు 1_8_0.

### అనుబంధ గ్రంథములు

## మృత్యురంగిణి

అనువాదకులు:
చిల్లరిగె శ్రీనివాసరావు

గొప్ప డిటెక్టివునవల. ఒకానొక సుందరి యొక్క భయంకరకథ. నరహత్య - నారీహత్య - హత్యపై హత్యలు. వెల చందాదారులకు 0_8_0 ఇతరులకు రు 0_12_0.

## అభాగిని

అనువాదకులు:
చిల్లరిగె శ్రీనివాసరావు

బాల వితంతువులు పడు కష్టములు, దుండగులు పన్ను కుట్రలు-సహజరీతిని వర్ణింపబడిన నవరసభరితమగు సాంఘికనవల. వెల చందాదారులకు 0_8_0 ఇతరులకు 0_12_0

## భద్రవేషి

అనువాదకులు :

చిల్లరిగె శ్రీనివాసరావు

ఇది చక్కని పరిశోధకనవల. వెల చందా దారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## విదురుని యుపదేశములు

కర్త :

కేతవరపు వేంకటశాస్త్రి

చిత్తస్వాతంత్ర్యము - సత్యవాక్యపరిపాలనము - నీతిబలము - ధర్మోపదేశము జదువదగినవి. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## కాంచనమాల

అనువాదకులు :

శ్రీ శివశంకరశాస్త్రి

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మప్రచారముల దెలుపు నవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## సీమంతిని

కర్త: ములుకుట్ల వేంకటశాస్త్రి

పౌరాణికగాథ నీతిదాయకము వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## సుశీల

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ.. బి. ఎల్.,

పతివ్రతయగు నీమె చరిత్రము హృదయవిదారకమయ్యును ప్రగాఢప్రణయాదర్శముజూపి యనేకుల పవిత్రుల జేయకమానదు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## శశిరేఖ

కర్త :

గుడిపాటి వెంకటాచలం బి. ఎ. ఎల్., టి.,

ప్రేమమూర్తియగు శశిరేఖ, ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లవసరమయ్యెనో, అయినను ఆమె నిర్మలచారిత్ర యెట్లయ్యెనో వ్రాయబడినది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## యమునాబాయి

అనువాదకులు :

క్రొవ్వవరపు నరసింహము

తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకుల కీగ్రంథ మత్యంత బోధప్రదము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## శ్యామల

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి యం. ఏ., బి. ఎల్.,

శిథిలప్రణయుల దుఃఖగాథ. సాంఘికదురాచారమును ఖండించు ప్రేమైక నవల. చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

## కాలసర్పి

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి యం. ఏ., బి. ఎల్.,

అత్యద్భుత రహస్యాపరాధ పరిశోధక నవలా రాజము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## కాంతంకథలు

కర్త :
మునిమాణిక్యం నరసింహారావు
బి. ఎ., ఎల్. టి.,

శ్రవణానందదాయకములై హాస్యరసపూరితములై యొప్పు వివిధకథల సంపుటము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## భారత కథాసారము

గ్రంథకర్త్రి
శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మ

మృదుమధురశైలిలో వ్రాయబడిన శ్రీమదాంధ్ర మహాభారత కథాసారము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## కథాకల్పవల్లి

కొప్పర్తి నారాయణమూర్తి
బి. ఎ.. ఎల్. టి.

మనోహరమైన కథల సంపుటము. ప్రతికథయు పాఠకుల నానందాబ్ధి నోలలాడించునదియే. ఎల్లరు చదివితీరవలసినటివి. చందాదారులకు రు0-8-0 ఇతరులకు రు 1-0-0.

## అరక్షణీయ

అనువాదకులు :
సహదేవ సూర్యప్రకాశరావు

సుప్రసిద్ధుడగు శరచ్చంద్రకవివర్యుని వంగ సాంఘికనవల కనువాదము. కథాకల్పన మత్యంత సహజమై నీతి నింపుచున్నది. శైలి మృదుమధురము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

## మాధవి

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణ
మూర్తి ఎం. ఎ., బి. ఎల్.

రసభరితమైన సాంఘికనవల. శైలి మృదుమధురము. ప్రతివారును చదివితీరవలసినది. చందాదారులకు రు 0-8-0. ఇతరులకు రు 1-0-0.

### —( నా ట కా ను బ ం ధ ము లు )—

## మార్కండేయ

కర్త :
పింగళి వెంకటనరసయ్య

3 గంటల కాలములో ప్రదర్శించుట కనువుగ వ్రాయబడిన భక్తిపూరితమగు 6 అంకముల నాటకము. చక్కని పాటలు గలవు. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0

## అహల్యాశాప విమోచనము

కర్త :
పప్పు మల్లిఖార్జునరావు

భక్తిరసపూరితమగు చక్కని నాటకము. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0.

## మివారుపతనము

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.

వీరరసప్రధానమగు నైదంకముల నాటకము ఇతిహాసిక వచననాటకమున కనువాదము. వె చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## షాజహాను

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.

విషాదాంతమైన మొగలాయీ చారిత్రక న నాటకము. చందాదారులకు రు 0-8-0 ఇతరు రు 1-0-0.

## వరమాల

అనువాదకులు :

మాడభూషి సురేంద్రాచార్యులు

హిందీనుండి యాంధ్రీకరింపబడిన మనోహ మగు నాటకము. ఇందు ప్రేమపరీక్ష. తత్పరిణా మము హృదయంగమముగను చమత్కారస్ఫూ ముగను నిరూపింపబడినవి. వెల చందాదారు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## నూర్జహాను

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.

కరుణారసపూరితము, విషాదాంతము నగు చా త్మక నాటకరాజము. మనోహరగీతములు క చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0

## దుర్గాదాసు

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.

వీరరసపూరితమును, ద్విజేంద్రుని విరచిత మిగుల పవిత్రమును నగు నైదంకముల చక నాటకము. ముఖ్యముగ చదవ తగినది. వెల చం. దారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

## చంద్రగుప్త

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి ఎం. ఏ., బి. ఎల్.

సుప్రసిద్ధ డి. ఎల్. రాయిగారి పేరందిన చ త్రాత్మకమైన నాటకము. చక్కని అనువాదము నాటకకళకు అలంకారము. చందాదారుల రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచింపఁబడుచు రెండుమాస కొకటిగా ప్రకటింపఁబడును.

సరస్వతీ గ్రంథమండలి,
రాజమహేంద్రవరము

---